# విప్లవసేనాని
# చంద్రశేఖర ఆజాద్

సం క

ఎమ్. ఆర్. త్యాగం, ఎం.ఏ.,




జయంతి పబ్లికేషన్స్
ఏలూరు రోడ్...... విజయవాడ-2

# CHANDRA SHEKHARA AAZAD

by

M. R. NAGAM

JAYANTHI PUBLICATIONS
Vijayawada - 520 002

First Edition :
NOVEMBER 1982

Price :
**Rs. 7-50**

Printers :
Sri Kanakalakshmi Printing Works,
Vijayawada-2.



# శ్రీ గద్దే లింగయ్య

జననం : 1912

మరణం : 1963

కృష్ణాజిల్లా — యలమర్రు గ్రామం

మధ్యతరగతి రైతు కుటుంబంలో జన్మించిన శ్రీ లింగయ్య 19 ఏండ్లు నిండకనే జాతీయోద్యమంలో పాల్గొని 1931 లో డిటెన్యూగా జైలు జీవితం అనుభవించారు. జైలునుంచి విడుదలైన తరువాత 23 ఏండ్ల ప్రాయాన 1935లో "ప్రభ" అనే పక్ష పత్రికను స్థాపించి అభ్యుదయ రచనలను ప్రజలకందిస్తూ తద్వారా ఎందరో యువ రచయితలకు ప్రోత్సాహమూ, ప్రోద్బలము కలుగజేసారు. 1937లో గోర్కి "అమ్మ" ప్రథమ ముద్రణను రహస్యంగా ఎన్నో ప్రెస్‌లలో ముద్రించి, కృష్ణా నదిలో పడవలలో బైండింగ్ చేయించి ఎన్నో కష్టాలకు గురిఅయి తెలుగుజాతి కందించారు.

1941లో భారతీయ విప్లవకారుల జీవితాలను కొన్ని వందల ఫొటోలతో కూర్చి "విప్లవయుగం" పేరుతో రహస్యంగా (మద్రాసులో బ్లాక్ మేకింగ్; వివిధ ప్రెస్‌లలో ముద్రణ) ప్రచురించి, ఆనాటి యువతను విప్లవోద్యమం వైపు మళ్ళించారు. ఈ సందర్భంలో మరల అరెస్టు అయి జైలు జీవితం అనుభవించారు. దర్శి చెంచయ్యగారు రచించిన "నేనూ- నా దేశం" (గదర్ విప్లవోద్యమ చరిత్ర) ప్రచురించారు. స్వాతంత్ర్యానంతరం ఆదర్శగ్రంథ మండలిని స్థాపించి వారు రచించినవే కాక గోర్కీ, టాల్‌స్టాయ్, శరత్ ఆదిగాగల ప్రముఖుల రచనలను దాదాపు ఆరువందల వరకు ప్రచురించి తెలుగు దేశానికి అందించిన ఉత్తమ దేశభక్తుడు, విప్లవ వైతాళికుడు శ్రీ గద్దె లింగయ్య గార్కి ఈ రచనను సమర్పిస్తున్నాము.

# స్పందన

పధ్నాలుగేళ్ళ వయసన్నా రాకముందే దేశ స్వాతంత్ర్య కాంక్షతో స్పందించి, ఇరవై అయిదేళ్ళన్నా నిండకముందే ఆ లక్ష్యసాధనలో ప్రాణార్పణగావించిన విప్లవవీరుడు చంద్రశేఖర ఆజాద్. దేశమంతటా బ్రిటిష్ పాలకులకు వ్యతిరేకంగా సహాయ నిరాకరణోద్యమం సాగుతూన్నరోజులవి. వారణాశిలో ఉద్యమ కారులను చెదరగొట్ట ప్రయత్నించిన పోలీసులమీదికి రాయి విసరడంతో చంద్రశేఖర్ రాజకీయ జీవితం ప్రారంభమయింది. అంత లేతవయసులో కొరడాదెబ్బలుతింటూ ఒడలు చిట్లి పోయినా అతడు క్షమాభిక్షను కోరలేదు. అంత చిన్న ఈడులో 'ఆజాద్' బిరుదును పొందడమేగాక, తాను చచ్చినా, బ్రతికినా ఆజాద్ (స్వతంత్రుడు) గానే ఉంటానని ప్రతిజ్ఞచేసి, దానిని నిలుపుకోగలిగాడు. తరువాతిరోజుల్లో జాతీయ విప్లవసైన్యానికి ఆధిపత్యం వహించి, అనేక సాయుధ విప్లవ కార్యకలాపాలు నిర్వహించాడు. ఆచార - సాంప్రదాయాల అంధానుకరణను వదులుకున్నాడు; కుల - మతాల సంకుచిత పరిధినుంచి బయట పడ్డాడు. భగత్‌సింగ్, సుఖదేవ్ వంటివారి సాహచర్యంతో సామ్యవాద సమసమాజ స్థాపనకు దీక్ష వహించాడు. ఆ కొద్ది జీవితయాత్రలో స్వార్థమన్నది ఇసుమంతైనా లేకుండా దేశం

కోసం సేవ జేశాడు...ఇవన్నీ-ఇటువంటి వెన్నో - చంద్రశేఖర్ విశేషణాలు.

అటువంటి గొప్పవీరుని, త్యాగధనుని చరిత్రవ్రాసే అవకాశం లభించినప్పుడు నే నెంతగానో ఆనందించాను. కారణం-నేనూ అటువంటి పరిస్థితుల్లోనే, ఆ వయసులోనే, రాజకీయ జీవితం గడపవలసిరావడం.

1946-47 ప్రాంతాల్లో హైదరాబాదు సంస్థాన ప్రజల స్వాతంత్ర్య పోరాటం ఉధృతంగా సాగింది. నిజాం నవాబుల పాలననుంచి ముక్తిపొంది, తక్కిన స్వతంత్ర భారత పౌరులతో పాటు తామూ స్వేచ్ఛ ననుభవించాలని ప్రజలు కోరుకున్నారు. వారి కోరికకు ఆంధ్ర మహాసభ, ఆంధ్ర జాతీయమహాసభ నాయకత్వం వహించాయి. ముఖ్యంగా ఆంధ్రమహాసభ (కమ్యూనిస్టు పార్టీ) జండాక్రింద నల్గొండజిల్లాలోని సూర్యాపేట, జనగామ, • భువనగిరి తాలూకాల్లో సాగిన వీరోచితపోరాటం ప్రపంచ ప్రశంసలనందుకుంది.

నిజాంపాలకుల పోలీసులూ, వారికి వత్తాసుగా ముందుకు వచ్చిన రజాకార్లూ సంఘ కార్యకర్తలపట్ల, సామాన్యజనంపట్ల సాగించిన అమానుష హింసాకాండ చరిత్రలో మాయని మచ్చ.

సూర్యాపేట పట్టణంలో పోలీస్ స్టేషన్ ప్రక్కనే ఉన్నత పాఠశాల (ఇప్పటికీ) ఉన్నది. సంఘనాయకులను బంధించి తెచ్చి, ఆ స్టేషన్‌లో చిత్రహింసలకు గురిచేస్తున్నారన్న విషయం ప్రక్క

---

• ఇప్పుడది వరంగల్లుజిల్లాలో కలిపివేయబడింది.

నున్న పాఠశాలలో ప్రాకిపోయింది. విద్యార్థులంతా ఒక్క పెట్టున తరగతి గదులను వదిలి, స్టేషన్‌కు యెదురుగా జాతీయ రహదారిమీద చేరిపోయారు. "నాయకులువర్ధిల్లాలి, పోలీసులు నశించాలి" అంటూ నినాదాలు చేశారు. రోడ్డుకు ఇరువైపులా కంకరరాళ్ళు కుప్పపోసి వున్నాయి. విద్యార్థులను చెదరగొట్ట డానికి పోలీసువారు లాఠీలతో రాగా, వారు కంకరరాళ్ళతో శత్రువులనెదుర్కొన్నారు. ఇరువర్గాలమధ్య కొంతసేపు అక్కడ సంకుల సమరమే సాగింది; వాతావరణం భీభత్సంగా మారి పోయింది. ఎవరిని యెవరు కొడుతున్నారో, ఎవరు ఎటు పరుగు తీస్తున్నారో—అంతుదొరక లేదు.

నాకు అప్పటికి పధ్నాలుగేళ్ళు వుంటాయేమో! నేనూ సాటి సహాధ్యాయులతోపాటు పోలీసులమీద ఒకటో, రెండో రాళ్ళువిసిరాను. కాబట్టి నన్నూ వారు బంధిస్తారనీ, బాదు తారనీ అనుకున్నాను. దానితో యెటుకేసి పరిగెత్తానో,ఎక్కడ దాగి వున్నానో-ఇప్పుడేమీ జ్ఞాపకంలేదు.

అంతచిన్నప్రాయంలో, జైలునుగురించిన భయంవల్ల, నేను బడిమానుకుని రహస్యంగా యింటికి చేరుకున్నాను. అక్కడిపరిస్థితులు తెలిసినందున పెద్దలూ నన్ను మరివత్తిడి పెట్ట లేదు. విద్యార్థుల్లో కొందరిని అరెస్టుచేయడం, మరికొందరిని గాలిస్తూండడంవల్ల పాఠశాల తాత్కాలికంగా మూసివేసినట్లు తెలిసింది. దానిని తిరిగి తెరిచినప్పుడైనా మళ్ళీ చదువుకోడానికి నాకు సాహసమూ లేకపోయింది, సమయమూ కరువైంది.

నేను అప్పటివరకు బస్తీలో చదివినవాడిని; పోలీసులమీద

దాడిలో పాల్గొన్నవాడినీ కాబట్టి గ్రామంలోని బాలురంతా నన్ను వీరుడుగా గౌరవించారు. నేను వారిని వెంటవేసుకుని సంఘ సంబధమయిన ప్రదర్శనలు, నినాదాలు నిర్వహించేవాడిని. దానితో గ్రామాధికారులకు చిరాకుకలిగేది. పట్వారీ, పటేలు, దొరలగుమాస్తాలు, పెత్తందార్లు ప్రజాద్రోహులనీ, వారంతా నశించాలనీ మేము నినాదాలుచేసేవారం. అప్పుడప్పుడు ఆయా పార్టీల నాయకులుకూడా మమ్మల్ని కలిసిపోతూండేవారు. క్రమంగా గ్రామాధికారులకేగాక వారిని బలపరిచిన జమీందారులకూ, పోషించిన ప్రభుత్వానికీ మానుంచి ప్రమాదం ఏర్పడింది. కాబట్టి బాలవీరుల నాయకుడైన నన్నూ, కొందరు పెద్దలనూ సజీవంగానో, నిర్జీవంగానో బంధించడానికి జమీందారుల ♦ 'చేతికిందిమనుషులు' ప్రయత్నించారు. అటువంటి ఒక దాడిలో నేను కరవాలానికి ఎరకాబోతూ తృటిలో తప్పించుకున్నాను.

తరువాత గ్రామంలో ఉండటంకూడా నాకు పడలేదు. ప్రత్యక్షంగా బయటపడి, రాజకీయ కార్యక్రమాలతో ప్రవాస జీవితం గడిపాను. ఆనాటి నాయకులూ, కార్యకర్తలూ, జమీందారుల సంతతివారూ చాలామంది నేటికీ సజీవులే కాబట్టి వారి పేర్లూ-ఊర్లూ తెలపడంలేదు.

నా యీ కొద్ది విప్లవజీవితానికీ, విప్లవవీరశిఖామణి అయిన ఆజాద్ జీవితానికీ అసలు సామ్యమేలేదు. ఆ వీరుని త్యాగాలతోపోలిస్తే నా కష్టాలు గణనకేరావు. ఈ విషయం

---

♦ అప్పుడు మాగ్రామం ఒక దేశ్‌ముఖ్ ఏలుబడిలో వుండేది.

నేను పూర్తినిజాయితీతోనూ, నమ్రతగానూ అంగీకరిస్తున్నాను. అయినప్పటికీ ఏంతో కొంత సంబంధం ఉన్నందున ఆజాద్, భగత్‌సింగులవంటి జీవితాలు నావంటివానిని స్పందింపజేయడం అత్యంత సహజం. ఆ స్ఫూర్తే నాకీ సంకలనంలో ముఖ్యంగా దోహదమిచ్చింది.

ఈ రచనకు రూపురేఖలుదిద్ది తోడ్పడిన మిత్రులు, ప్రముఖ జర్నలిస్ట్, రచయిత శ్రీ పోలవరపు శ్రీహరిరావుగారికి కృతజ్ఞతలు.

—నాగం

# భూమిక

"ఏ జాతి చరిత్ర చూచినా ఏమున్నది గర్వకారణం?" అని ప్రశ్నించడంలో మహాకవి హృదయావేదన ధ్వనిస్తోంది. అయితే ఆయన తన ప్రశ్నకు తానే—

"నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం" అని సమాధానం చెప్పారు. ఆ తర్వాత ఆయన అనేకానేక చారిత్రకాంశాలు ఉటంకించారు.

"పరపీడన పరాయణత్వం" తరచుగా కనిపించే చరిత్రను మార్చేందుకు—ప్రతిజాతి చరిత్రలోనూ కొందరు విశేష కృషి చేసి, ఆ లక్ష్యసాధనకోసం తమ సర్వస్వాన్నీ త్యాగంచేశారు; తమ ప్రాణాల్నిసైతం దేశాభ్యుదయంకోసం బలిదానంచేశారు; అజేయమనిపించిన ప్రతీప, పీడనాశక్తుల్ని తమ ధీరోదాత్త చర్యలతో జయించారు. అటువంటి ధీర వీర త్యాగధనుల జీవిత చరిత్రలే ఏ జాతిచరిత్రకైనా గర్వకారణాలు. అలాంటి జీవిత చరిత్రల సంపుటీకరణమే జాతిచరిత్ర అవుతుందనికూడా అంటారు. అంతటి సగర్వకారణ చరిత్రగల భారతీయుల్లో చంద్రశేఖర 'ఆజాద్' ఒక అగ్రగణ్యుడు.

ప్రపంచమానవులంతా ఒకటే అనేది శాశ్వతసత్యం. కాని భౌగోళిక, చారిత్రక కారణాలవల్ల ఒక్కో దేశంలో ఒక్కోరకమైన ఆచార ఆహార విహారాదికాలూ, సంస్కృతీ వ్యాపిస్తాయి.

ప్రాక్పశ్చిమదేశాలమధ్య ఈ సంస్కృతిపరమయిన వ్యత్యాసాలు మరింత స్పష్టంగా అగుపిస్తాయి.

సూర్యోదయం ముందుగా జరిగే తూర్పుదేశాలు నైతిక విశేషాలకు ప్రాధాన్యతనిస్తే—పశ్చిమదేశాలు భౌతికాంశాలకు అగ్రపీఠం యివ్వడం అనాదిగావున్న ఆచారం. ఈ తేడాలు ఆయాదేశాల సంస్కృతిలో, చరిత్రల్లో వెల్లడవుతూనే వుంటాయి.

సంస్కృతిపరంగా, ఆధ్యాత్మికంగా పశ్చిమదేశాలకు తూర్పుదేశాలే మార్గదర్శకాలని ప్రపంచ చరిత్ర వేనోళ్ళచాటు తోంది. అందునా భారతదేశం శాస్త్ర, వేదాంత, కళారంగా లలో, సిరిసంపదల్లో గురుస్థానంలో వుండేది. అందువల్ల అనేక పాశ్చాత్యదేశాలకు విజ్ఞానదాయినిగా వున్నా - వారికి కన్ను గుట్టించేది.

కేవలం విజ్ఞానసముపార్జనకేవచ్చిన విదేశీయులు కూడా ఇక్కడవున్న సిరిసంపదల్ని, సుభిక్షతను గురించి తమ తమ దేశా లలో నోరూరించే వివరాలుచెప్పేవారు. అందువల్ల దోపిడీగాళ్ళ దృష్టి భారతదేశంమీదే వుండేది. ఈ కారణంగానే విదేశస్తుల దాడులు, దోపిడీలు, యుద్ధాలు జరిగాయి.

అయితే—ఆయా కాలాల్లో భారతీయులు తమ ఆధ్యా త్మిక, నైతిక, కళాత్మక చింతనలకు ప్రాధాన్యతనిస్తున్నారు. దేశం అనేకమంది పాలకులచేతుల్లో వుండేది. ఇరుగు పొరుగు రాజ్యాల దాడులనుంచి కాపాడుకునే సైనికబలగాలుతప్ప— విదేశస్తుల మూకుమ్మడి దండయాత్రల నరికట్టే బలాలు, ఏర్పాట్లు ఉండేవికాదు. దేశపాలకులమధ్య స్పర్ధలు, సంకు

చితమైన అవగాహనలూ వుండేవేగాని—ఉమ్మడి విరోధిని గుర్తించి, నిగ్రహించి, తరిమికొట్టే చొరవ లేకపోయింది.

ఏమయితేనేం-భారతదేశం విదేశీయుల ఎత్తుగడలకూ, యుద్ధోద్ధతికీ తలవంచింది. అయినా వీరశూరవరులు దేశదాస్య విముక్తికి తగుత్యాగాలూ, పోరాటాలూ చేయవలసిందేననే పట్టుదలను, సత్యాన్ని వదులుకోలేదు.

విధివశాన విదేశీయుల ఉద్ధతికీ, కుట్రలకూ లొంగినా - భారతీయులు చేవచచ్చిలేరనీ, తరుణంలో నైతికబలాన్నీ, పౌరుషాగ్ననీ జోడించి విజృభించగలరనీ అపడప్పుడూ పరాయి పాలకులకు రుచి చూపుతూనే వున్నారు.

మొగలుచక్రవర్తులు విశాల సామ్రాజ్యాన్ని స్థాపించి బలమైన బలగంతో అజేయులుగా రూపొందారు. స్థానికులతో సంబంధ బాంధవ్యాలునెరపి, పెద్దలకు గౌరవాలూ, ఉద్యోగాలూ సంఘటించి జోలలు పాడుతూనే వున్నారు. అయినా రాజస్థాన్‌లోని మేవాడులో భారతీయ వీరరక్తం పరదాస్య శృంఖలాలను త్రెంచాలని - బోనులోపడిన సింహంలాగా అవిశ్రాంతంగా గర్జిస్తోంది. అవకాశం దొరికినప్పుడల్లా పంజాదెబ్బ తీస్తోనేవుంది.

దేశంలో అనేకానేక ప్రాంతాలు అక్బరు చక్రవర్తికి లొంగిపోయినా మేవాడు ఏలిన రాణాప్రతాపసింహుడు పర పాలనను సహించేది లేదని మొక్కవోని ధైర్యంతో మేరుపర్వత శిఖరంలా నిలబడ్డాడు.

అలాంటి వీరశేఖరుణ్ణి - నమ్మినవాళ్ళెందరో విశ్వాస ఘాతుకులై వెన్నుపోట్లు పొడిచారు. ఉప్పు తిన్నవాళ్ళే

నిప్పులు కురిపించారు; ఎన్నెన్నో చిక్కులు కల్పించారు. ఐనా అచంచల ఆత్మవిశ్వాసంతో, ప్రతాపమే ఊపిరిగా రాణాప్రతాప్ పదేళ్ళకాలం అజేయుడన్న అక్బర్ నెదిరించి యుద్ధాలుచేశాడు. లోగడ కోల్పోయిన కోటల నెన్నింటినో తిరిగి జయించాడు. భారతీయుల స్వతంత్రకాంక్షకుప్రత్యక్షజ్వాలగా విజృంభించాడు.

"విజయమో, వీరస్వర్గమో" అని కత్తిదూసిన రాణా ప్రతాప్ చివరికి 1597 జనవరి 19వ తేదీన యుద్ధరంగంలోనే పరమపదించాడు. అలాంటివీరుల చరిత్రయే భారతీయుల అసలు చరిత్ర అని లోకం గుర్తించింది; దేశస్థులు దాస్యంలోవున్నా అలాంటివీరుల గాథల్నే బృందగానంగా ఆలపించారు.

భారతీయులు గర్వకారణంగా పేర్కొనే చరిత్రలలో రాణాప్రతాప్‌కు దీటువచ్చే "ఛత్రపతి" శివాజీవంటి క్షాత్ర వరులూ, క్షేత్రజ్ఞులూ ఎందరో వున్నారు.

బ్రిటిష్‌వర్తకుల జిత్తులవల్ల భారతదేశం మరింత నికృష్ట మయిన బానిసత్వం అనుభవించవలసి వచ్చినప్పుడుకూడా—కారు చీకట్లలో కాంతిపుంజాలు వెదజిమ్మిన చరిత్రగల ఘనులెందరో ఉద్భవించారు.

125 ఏళ్ళక్రితం తెల్లపాలకులు "సిపాయిల తిరుగు బాటు"గా వక్రీకరించిన మొదటి భారతస్వాతంత్ర్య సమరం ఏజాతియైనా కలకాలం సగర్వంగా చాటుకోదగింది.

వీరరాణిఝాన్సీలక్ష్మీబాయి, నానాఫడ్నవీస్, తాంతియా తోపే నాటి విప్లవసమరానికి నాయకత్వం వహించి-చిచ్చరపిడుగులనీ, యుద్ధవ్యూహ చతురులనీ, పరాక్రమ విక్రమాలకు మచ్చుతునకలనీ ప్రపంచ చరిత్ర కెక్కారు.

రవి అస్తమించని బ్రిటీష్‌సామ్రాజ్యపు పల్లకీకి బోయీలుగా వున్నవాళ్ళు, తోకతొక్కబడ్డ తాచుల్లా, కోదమసింగాల్లా విజృంభించడం తెల్లవార్ని తల్లడిల్లజేయగా-వాళ్ళు 1857 తర్వాత మరింత కఠోరంగా వ్యవహరించసాగారు. స్వాతంత్ర్య కాంక్షతో సంచరించేవారిని ఏదో ఒక సాకుతో ఏరివేశారు. ఎందరినో చిత్రహింసలకు గురిచేశారు.

పాలకుల పాశవికచర్యలకు భయాందోళనలు చెందిన భారతీయులు కొంతకాలం తమ పౌరుషలక్ష్యాల్ని తమలోనే దాచుకోవలసి వచ్చింది. ఆ కాలంలో యేర్పడ్డ స్తబ్ధత "ఈ జాతి యిక నిర్వీర్యం, మన్నుదిన్న పెంజేరు సామెత" అనిపింపజేసింది. కాని-స్వేచ్ఛాపిపాస నివురుగప్పిన నిప్పులా వుందని కొందరికే తెలుసు. ఆ విశేషాన్ని గుర్తించినవారు తగిన అదను చూచి ఆ విప్లవాగ్నిని తిరిగి రేకెత్తించడానికి నిబ్బరంగా పొంచి వున్నారు.

బ్రిటిష్‌వారు తమ "విభజించి పాలించు" విధానాన్ని వేవిధాల అమలుజరుపుతున్నారు. బెంగాలును విభజించి హిందూ-ముస్లిం వేర్పాటును శాశ్వతం చెయ్యాలనే యెత్తుగడ

గతశతాబ్ది చివరిభాగంలో తలెత్తింది. బెంగాలీల సమైక్యతా భావం, ఆత్మగౌరవదృష్టి ఎనలేని జ్వాలల్లా ప్రజ్వరిల్లాయి. "వందేమాతరం" ఉద్యమ ప్రభంజనం చెలరేగింది. బెంగాలు అంతటా-ఇరుగుపొరుగుల్లోకూడా ఉద్యమ దావానలం చండ్ర నిప్పులు వర్షించే అగ్నిపర్వతాన్ని గుర్తుకుతెచ్చింది.

సామ్రాజ్యవాద పాలకులగుండెలు దద్దరిల్లాయి. తమ విభజనోద్దేశాన్ని విరమించుకోకపోతే - ఈ దావానలం తమను మ్రింగివేయగలదని గుర్తించి, మర్యాదగా వెనుకంజవేశారు. "వందేమాతరం" ఉద్యమం ఉపశమించింది.

కాని-"వందేమాతరం" అనే నినాదమూ, దాని అంత రార్థమూ దేశ యువతీయువకుల గుండెల్లో సుడులుతిరుగుతూనే ఉన్నాయ్. వేడిరక్తం ఉరకలెత్తే యువతదృష్టిలో ప్రతితెల్ల వాడూ, ప్రతిపోలీసూ బ్రిటిష్‌సామ్రాజ్యవాదానికి, దాష్టికానికి ప్రతిబింబంగా కనిపించాడు. 1894 ప్రాంతంలో పూనాలో దామోదర్ చాఫేకర్ అనే యువకుడు-ర్యాండ్ అనే బ్రిటిష్ పోలీస్ అధికారిని హతమార్చింది ఈ కారణంగానే. ఈ హత్య పాలకవర్గంలో భయకంపన కలిగించగా భారతీయుల్లో"కసితీరిం" దనే తృప్తిని కలిగించింది.

దాదాపు అదేకాలంలో భారతీయ ప్రముఖులలో స్వపరి పాలనా కాంక్షను బహిరంగంగా వెలుగెత్తిచాటాలనే పట్టుదల రకరకాలుగా మొలకలెత్తి వి. దేశవిదేశాల్లో విద్యావంతులు,

సంస్కార సంపన్నులు వివిధమార్గాలలో తమజాతి వాంఛను వెల్లడించసాగారు.

ఈ వాతావరణంలోనే జాతీయకాంగ్రెస్ అవతరించింది. బ్రిటిష్‌పాలకులతో కదనానికి కాలుదువ్వకుండా-వారిరాజ్యాంగ పద్ధతుల ననుసరిస్తూనే ప్రజాభిప్రాయాన్ని వెల్లడించే పంథా చేపట్టబడింది. "రీ పే ఇన్ ద సేమ్ కాయిన్" అనే ఆంగ్ల సామెతనే భారతమేథావి వర్గం అనుసరించింది.

ఈ చాకచక్యంవల్ల బ్రిటిష్ ప్రముఖులుకూడా జాతీయ కాంగ్రెస్‌కు అభిమానులూ, అనుయాయులూ, అనుసంధాన కర్తలూ అయ్యారని చరిత్ర చెబుతోంది.

ఉద్యోగాలు, విద్యాలయాలు,కనీసకోర్కెలకూ పరిమిత మయిన కాంగ్రెసు క్రమక్రమంగా స్వయం పరిపాలనాధికారాలు జన్మహక్కులని వాదించే ధోరణికి మళ్ళింది.

బిపిన్‌చంద్రపాల్, బాలగంగాధరతిలక్, లాలాలజపతిరాయ్, మోతీలాల్‌నెహ్రూ, మదనమోహనమాలవ్యా, వినాయకదామోదరసావర్కార్, అరవిందఘోష్, రసబిహారిబోస్, సోహన్‌సింగ్‌జోష్ ప్రభృత నాయకులెందరో ఈ శతాబ్ది ఆదిలో జాతీయ స్వాతంత్ర్యం ప్రధానలక్ష్యమని ప్రకటించి, అందుకు ఆనాటి పరిస్థితులను అధిగమించే ధైర్యసాహసాలతో కృషిచేశారు.

మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ దక్షిణాఫ్రికాలో వకీలు వృత్తితో బ్రతకాలని వెళ్ళి - అక్కడనెలకొనివున్న జాత్యహంకార, పరపీడనతత్వాలను చూచి సంచరించి "స్వాతంత్ర్యం ప్రతి ఒక్కరికీ జన్మహక్కు" అనే సత్యాశ్రయంతో పోరాట స్వభావాన్ని అలవర్చుకున్నాడు. "మహాత్ముడు"గా "జాతిపిత"గా కొనియాడబడ్డానికి ఆయనకప్పుడే బీజావాపన జరిగింది.

గాంధీజీ స్వదేశానికి తిరిగివచ్చి జాతీయకాంగ్రెస్‌కు సారధ్యం వహించే సంధి సమయంలోకూడా మనదేశంలో అనేక చోట్ల అతిసామాన్యులనుకునేవారు తెల్లదొరలపాలన, పశుతుల్య విధానాలకు వ్యతిరేకంగా తమ తీవ్రనిరసనలను తెలియజేస్తూ ఘోరశిక్షలకు గురిఅయ్యారు. పల్నాటి రైతుబిడ్డ కన్నెగంటి హనుమంతు వంటివారెందరో వీరచరిత్రలతో జాతికిగర్వకారణం అయ్యారు.

గాంధీజీ జాతీయ కాంగ్రెస్ సంస్థానాధికారాన్ని పూర్తిగాచేపట్టి, అహింసాయుతపోరాటమే మార్గమని నిర్దేశించినా–ఆ కాలంలో కాంగ్రెస్‌కు సంబంధం లేనివారెందరో విప్లవపంథాలను చేపట్టారు. అలాంటి యువకిశోరాలు దాదాపు అన్నిరాష్ట్రాలలోనూ గర్జించి విజృంభించిన చరిత్రలున్నయ్.

దేశ కాల మాన పరిస్థితుల్నిబట్టి శాంతియుతంగా, అహింసామార్గంలో, సత్యాగ్రహ వ్యక్తీకరణద్వారా మాత్రమే

స్వాతంత్ర్య సమరం జరపాలని గాంధీజీ నిర్ణయించాడు. "మంత్రాలకు చింతకాయలురాల"వనీ-సాయుధ విప్లవం, రక్త తర్పణం మాత్రమే జాతివిముక్తికి మార్గమనీ విశ్వసించినవా రెందరో వున్నారు. వారు త్రికరణశుద్ధిగా తమకార్యక్రమాల్ని నిర్వహిస్తున్నారు. బ్రిటిష్ వారికి సింహస్వప్నాలుగా పరిణ మించారు.

ఇలాంటి సమాజంలో చంద్రశేఖర "ఆజాద్" పుట్టి, పెరిగి, సంచలించి, సంచలనాలు సృష్టించిన చరిత్ర మనజాతి చరిత్రకే గర్వకారణం!!

# జననం

నేటి ఉత్తరప్రదేశ్‌ని అప్పుడు "సంయుక్తపరగణాలు". అని పిలిచేవారు. ఆ రాష్ట్రంలో కాన్పూరుజిల్లా నాటికీ నేటికీ ప్రసిద్ధమే! ఆ జిల్లాకు చెందిన 'తివారి' వంశస్తుల్లో సీతారాం అతి సామాన్యుడు. అతనిబాల్యం మాతామహులకుచెందిన ఉన్నావ్ ప్రాంతానగల 'బదరికా' గ్రామంలోనే గడిచి.ది.

యవ్వనకాలంవరకూ ఆ గ్రామంలోనేవున్న సీతారాం తివారికి బదరికాలోనే ఒక కన్యతో వివాహంజరిగింది. ఇల్లరికపు టల్లుడుగా బ్రతకడం అతనికి నచ్చలేదు. వేరింటి కాపురం పెడదామంటే భార్య అంగీకరించలేదు. తన తండ్రి తాతల ప్రదేశానికి వెళతాననేసరికి-అత్తవారు పేచీపెట్టారు. పట్టుదలలు పెరిగాయి. చివరికి సీతారాం ఆ భార్యతో తెగతెంపులు చేసుకున్నాడు.

యుక్తవయసులోవున్న అతనికి మళ్ళీ పెళ్ళిచేసుకోడం అంతకష్టంకాలేదు. ఈసారి లభించిన భార్య చాలా అనుకూలవతి కూడాను. వారి దాంపత్య జీవనం సలక్షణంగా కొనసాగుతూండగా ధర్మపత్ని హఠాత్తుగా మరణించి అతన్ని దుఃఖసాగరంలో ముంచింది.

ఆనాటి సంప్రదాయాల ప్రకారం పెద్దలు పూనుకుని

సీతారాంకు మరోసారి పెళ్ళి జరిపించారు. ఈసారి 'చంద్రమన్ షేరా' గ్రామానికి చెందిన కన్య జగరాణీదేవి అన్నివిధాలా సహధర్మచారిణిగా లభించింది. వసతివసరులు అంతగా లేని సీతారాం తమ భవిష్యత్తు, పుట్టబోయేబిడ్డల ప్రగతి బాగు పడా లనే వాంఛతో మకాం మార్చాలనుకున్నాడు.

అతని దూరపు బంధువుల్లో హజారీలాల్ అనే ఒకాయన అలీరాజపూర్ సంస్థానంలో ఒక మంచిపదవిలో వుండేవాడు. ఆయన తోడ్పాటుతో తాము పెంపొందవచ్చునసే ఆశతో సీతారాంతివారి భార్యతో అక్కడికి వెళ్ళాడు. హజరీలాల్ గారు త్వరలోనే సీతారాంకు అటవీశాఖలో ఒక చిన్న ఉద్యోగం యిప్పించాడు.

ఆకాలంలో ఉద్యోగాలవల్ల వచ్చే జీతం తక్కువే అయినా అటవీప్రాంతంలో జీవించడానికి కొరతలేకుండా జరిగే వసరు లుండేవి. ఉద్యోగ బాధ్యతలూ, ఆదాయమూ సుఖవంతంగానే వున్నాయి. కాని - ఆ ప్రాంతాన వుండే ఆటవికజాతులవారు విశృంఖల విహారులు. నిత్యం వారితో మెలగవలసి వున్నందువల్ల సీతారాంకు ఆ వాతావరణం, వ్యవహారాలూ నచ్చలేదు.

దాంతో అతను ఉద్యోగాన్ని వదులుకొని, మళ్ళీ హజారీలాల్ గారిని అర్థించడానికి మొహం చెల్లక - "భాంవరా" అనే గ్రామానికి మకాం మార్చాడు. ఉదరపోషణార్థం యేం చెయ్యాలి అనేది ఓ సమస్యేగదా! కొద్దిరోజు లాలోచించి పాడి పరిశ్రమ మంచిదనుకున్నాడు.

కొన్ని ఆవుల్నీ, బర్రెల్నీకొని పాలు, పెరుగు వ్యాపారం ప్రారంభించిన సీతారాంకు - కొద్దికాలానికే ఆ వృత్తిపై గురితప్పింది. ఇదికూడా తనకు లాభసాటిగా కలిసి రావడంలేదని పశువుల్ని అమ్మేశాడు. అయితే - మాటిమాటికీ మకాములు మార్చడం తనకే అవమానకరమనిపించింది. ఏమైనా సరే "భాంవరా"నుంచి నివాసం మార్చరాదని నిర్ణయించు కున్నాడు.

నిజానికి ఆ వూరు చాలా అందంగా, ప్రశాంతంగా ప్రకృతిరామణీయకతతో తులతూగుతూండేది. చుట్టూరా నల్లని నీలిరంగు కొండగుట్టలు, పచ్చనిచేలు, విశాలమైన మైదానాలు, అల్లంతదూరంలోనే గలగలపారే సెలయేరు! అప్పుడప్పుడూ విచిత్రాచారాలూ, వింతవేషభాషలూ గల ఆటవికులువచ్చి తమకు కావలసిన వస్తుసంబారాలు కొనుక్కువెళుతుంటారు. వాళ్ళమధ్య జీవించడం కష్టంగాని, అప్పుడప్పుడూ చూడ్డానికి చాలా ముచ్చటగా వుంటుంది.

తివారి అక్కడ స్థిరనివాసం యేర్పరచుకోడం బాగానే వుందిగాని-కుటుంబపోషణకు మార్గం యేది? నానాటికీ ఆర్థిక యిబ్బందులు అధికమవుతున్నాయి. ఏదో ఒకటి చేసి నాలుగు రాళ్లు సంపాదించకపోతే పొయ్యిలో పిల్లి లేవదు!

అలాంటిస్థితిలో అతనికి ఓతోట కాపలాదారు ఉద్యోగం లభించింది. అదే పదివేల మేలనుకుని, ఆ పనే పవిత్రదేవతనుకుని,

కళ్ళలో వత్తులువేసుకుని ఉద్యోగ బాధ్యతలు నిర్వర్తించ సాగాడు. భోజనభాజనాదులకు గ్రామంలోని వసతిగృహానికి వెళ్ళివచ్చే వ్యవధిలో తోట ఏమయిపోతుందోనన్న బెంగతో-ఆ తోటలోనే ఓ చిన్నకుటీరం నిర్మించుకుని సంసారం చెయ్య సాగాడు.

ఈ విధంగా జీవిత బాధ్యతల్ని గుర్తించి, ఉద్యోగ ధర్మాన్ని ప్రాణప్రదంగా నెరవేరుస్తున్న సీతారాం తివారి కొద్ది కాలానికే గ్రామస్తులకు ఓ ఆదర్శప్రాయుడయ్యాడు. అతను మాట్లాడేతీరు కొంచెం కటువుగా వుండేదిగాని-మనసు వెన్న కంటె మెత్తనిదని పల్లీయులు గ్రహించారు. పైగా సత్య సంధుడు. అప్పటినుంచీ గ్రామస్తులు తమకేసమస్య తలెత్తినా, ఏ పొరపొచ్చాలు వచ్చినా సీతారాం సలహాకోసం, తీర్పుకోసం పరుగెత్తసాగారు.

తోటకాపలా ఉద్యోగంవల్లవచ్చే ఆదాయం నెలకు పది రూపాయలకు మించకపోయినా తివారి దంపతుల జీవితం చాలా తృప్తిగా, సుఖమయంగా జరిగిపోతోంది. పైగా ఊళ్ళో అందరికీ పెద్దదిక్కుగా భావించబడడంవల్ల లభిస్తున్న అనుభూతి అమూల్యం, అమృతతుల్యం.

అలాంటి దంపతులకు మొదటి సంతతి మగబిడ్డ పుట్టడం మరింత ఆనందదాయకం అయింది. అతనికి "సుఖదేవ్" అని నామకరణం చేశారు. అయితే అతనెప్పుడూ వారికి సుఖదాయి కాలేదు. మరీ మేథకుడుగా వ్యవహరించేవాడు.

ఆ తరువాత జగరాణీదేవికి వరుసగా ముగ్గురు బిడ్డలు పుట్టినా బాలారిష్టాలవల్ల అకాలమృత్యువు వాతబడ్డారు. ఇది తలిదండ్రులకు కడుపుకోత కావడం సహజమేగదా! భార్యతో పాటు సీతారాంకూడా తానేపాపంచేయడంవల్ల వరుసగా బిడ్డలు పుట్టిపోతున్నారోనని కుమిలిపోయేవాడు.

అటుతర్వాత యిక పిల్లలు పుట్టరని, సుఖదేవ్ ఒక్కడే దిక్కనీ ఆ దంపతులు బెంగగా వుంటుండగా - చాలాకాలానికి జగరాణీదేవి మళ్ళీ గర్భవతి అయింది. ఈసారిపుట్టే బిడ్డకూడా ఏమయ్యేనో అనే దిగులుతో తొమ్మిదినెలలు అనేక మొక్కులు మొక్కేరు.

1906 జూలై 23న తేదీన జగరాణీదేవికి పీలగా, కొన ఊపిరితో ఓ మగబిడ్డ పుట్టేడు. అందుకు ఆ దంపతులెంతో విచారించినా-ఈ బిడ్డడయినా దక్కితేచాలుననే ఆశతో, ఆ అయిదో సంతానాన్ని తమశక్తికిమించిన ఆసక్తితో పెంచసాగారు.

ఆ బిడ్డడే చంద్రశేఖర్.

ఆర్థికమాంద్యంవల్ల అతని బారసాలను వైభవంగా జరపలేకపోయినా-అతన్ని తమ కంటిపాపలా సాకడంలో వారెనలేని శ్రద్ధచూపారు. బక్కగా వున్నవాడు బలిష్ఠుడుగా రూపొందాలనే ఆశతో తాము సరయిన ఆహారం తీసుకోకుండా - బిడ్డలకు పాలు పండ్లు యిచ్చి పోషించసాగారు.

సుఖదేవ్ ఎంత మందకొడిగా వుండేవాడో చంద్రశేఖర్ అంతచురుగ్గా వ్యవహరించేవాడు. చిన్నప్పటినుంచీ అందంగా,

చక్రాల్లాంటికళ్ళతో చూపరుల్ని ఆకట్టుకునేవాడు. అందువల్ల యిరుగుపొరుగువారు, గుప్పెడు సంతానంవున్న తల్లులుకూడా శేఖర్‌ను యెత్తుకుని ముద్దులతో ముంచెత్తేవారు. అందరికీ తన కడగొట్టుబిడ్డడిమీదనే కళ్ళు అనీ, ఎవరి కంటిచెడు దిష్టి తగులుతుందోననీ ఆ తల్లి మనసు విలవిలలాడుతుండేది.

తలిదండ్రుల ప్రత్యేక శ్రద్ధవల్ల చంద్రశేఖర్ క్రమంగా ఆరోగ్యం పుంజుకుని బంతిలా తయారయ్యాడు. వీధిలోకెళ్ళి తోటి బాలబాలికలతో ఆటలాడేవాడు. ఆటల్లో పాటల్లో అందరికీ తానో నాయకుడయినట్టు, అధికారం వెలిగించడం అతనికి అంత చిన్నవయసులోనే అలవాటయింది.

అల్లరి, ఆకతాయి పనులు చెయ్యడంలోకూడా శేఖర్ అందరికంటె ముందంజ వేసేవాడు. అన్నగారైన సుఖదేవ్ అందరికీ ఎడంగావుండి చూచే ప్రేక్షకుడులా వుంటుంటే చంద్రశేఖర్ తోటివారిజట్టుకు నాయకుడై కేరింతలు, తుళ్ళింతలు, కవ్వింతలతో సందడిచేస్తుండేవాడు. చిలిపిపనులు చేసినా అతన్ని అందరూ ముద్దాడేవారు.

తండ్రి సీతారాం తివారి మాత్రం బిడ్డల్ని అడ్డాలనాటి నుంచీ హద్దుపద్దుల్లో పెంచాలనేవాడు. తల్లి అతిగారాంచేసి అతన్ని ఆకతాయిని చేస్తోందని దెప్పిపొడిచేవాడు. అందువల్ల చంద్రుడు కొంటెకోణంగి పనులు చేశాడని వింటే గట్టిగా మందలించేవాడు, దండించడానికూడా వెనుకాడేవాడుకాడు.

ఈ క్రమశిక్షణచర్యలవల్ల చంద్రశేఖర్‌కు తండ్రి అంటే కొంత భయం వుండేది.

తండ్రి కఠినంగా మందలించేసరికి చంద్రశేఖర్ బిక్క మొహం వేసేవాడు. కళ్ళలో నీళ్ళుతిరిగేవి. అలాంటి దృశ్యం చూడలేక జగరాణీదేవి హృదయం తల్లడిల్లేది.బిడ్డను అమాంతం తీసుకుని, అక్కునచేర్చుకుని సముదాయించేది. ఆ తల్లి సపరింపులతో అతని ఒళ్ళూ, మనసూ చల్లబడేవి. ఒక్కోసారి అలాగే ఆమె భుజంమీదనో, వళ్ళోనో ఆదమరచి నిద్రపోయేవాడు.

ఆ చిన్నవయసులోనే చంద్రశేఖర్ ఆటల్లో, ఆకతాయి పనుల్లోకూడా అతిసాహసిక ప్రయోగంపట్ల ఆసక్తి కనిపించేది. ఒకసారి అతనో అగ్గిపుల్లగీసి చూచాడు. కళ్ళు జిగేలుమనిపించే కాంతిని చూచాడు. ఒకేసారి ఆ పెట్టెలోని పుల్లలన్నీ వెలిగితే మరెంతకాంతిగా వుంటుందోననే కుతూహలం కలిగినట్టుంది!

వెంటనే అగ్గిపెట్టెలోని పుల్లలన్నింటినీతీసి చేతిలోపెట్టుకున్నాడు. మందున్నతలలన్నీ ఒకేవేపున వుంచాడు. ఒకపుల్లను గీసి వెలిగించాడు. అంతే-పుల్లలన్నీ ఒకేసారి చివ్వు చివ్వున వెలిగి కాంతివ్యాపించింది. అతను తనచేయి కాలిపోతోందన్నైనా గుర్తించనట్లు సంతోషంతో కేరింతలు కొడుతున్నాడు. మిత్ర బృందం తమాషా చూస్తున్న సంతోషంపోయి అతనిచేయి కాలినందుకు హాహాకారాలు చేస్తున్నారు.

అయినా చంద్రశేఖర్ చీమకుట్టినంత బాధయినా పడలేదు. తనప్రయోగం ఫలించినట్టు విజయగర్వంతో పకపకా నవ్వు

తున్నాడు. చేతిని తుడుచుకొనైనా తుడుచుకోకుండా గెంతులు వేస్తున్నాడు. ఆ తర్వాత తలిదండ్రులెంత గాభరాపడ్డారో, ఎన్నెన్ని మందులూ, మాకులూ వేశారో, ఎంత కొప్పడ్డారో అనేది వేరే విశేషం. అతననుకుంది చేసి చూచి ఆనందించాడు. అదే అతనికి ముఖ్యం!

ఈ అగ్గిపుల్లల దహన ప్రక్రియ తర్వాత అతనిబుర్రలో మరింత సాహసిక ప్రయోగంపట్ల ఆసక్తి కలిగింది. అది ఫిరంగి ఆట. అంటే దీపావళి బాణాసంచాలో తూటాల్లాగా-పొడవాటి గొట్టంలో ప్రేలుడుమందును దట్టించి, దాన్ని ఒకవేపున నిప్పం టించడంద్వారా పేల్చితే పెద్దశబ్దంతో దూరానవున్నలక్ష్యాన్ని తాకి తునాతునకలు చేస్తుంది. అలాంటి ఫి ంగి ఆట ఆడాలని అతనెంతో ఆరాటపడేవాడు.

అప్పుడప్పుడూ మిత్రులనుంచి పటాసుమందు సేకరించి యీ రకం ఫి ంగి ప్రయోగాలు చేసేవాడు. కాని, ఎప్పటి కప్పుడు అంతకంటే పెద్ద ప్రయోగాలు, తరచుగా చెయ్యాలనే కోరిక బలంగా వుండేవి. అందుకోసం అనేక ఉపాయాలు ఆలో చించేవాడు.

ఎక్కువ మందుగుండుకొని ఓ పెద్దఫిరంగిని పేల్చాలంటే చాలాడబ్బులు అవసరంగదా! తాము యిల్లు కట్టుకుని కాపురం ఉంటున్నతోటకు తన తండ్రిగారే యజమానిఅని చంద్రశేఖర్ నమ్మకం. అందువల్ల తమతోటలోనివిపళ్ళు కొన్నికోసుకుని బైట

అమ్మితే చాలాడబ్బులు వస్తాయనే ఆలోచన అతన్ని ప్రోత్సహించింది.

అతడావిధంగా కొన్నిపళ్ళు తెచ్చి యెవరికో అమ్మి, ఆ డబ్బులతో పటాసుమందుకొని ఫిరంగులుచేసి పేల్చేవాడు. వాటిశక్తీ, ధ్వనీ, వేగం, భీభత్సం అతనికెంతో సంతోషాన్ని కలిగించేవి. కాని-ఇదేపకంగా యీ ప్రయోగాన్ని తరచుగా చేస్తుండేసరికి శేఖర్ చేస్తున్న పళ్ళ దొంగతనం తండ్రికి తెలిసిపోయింది. ఓసారి పట్టుకుని చెడామడాతిడుతూ వళ్ళు హూనం అయ్యేట్టు బాదేశాడు. బిడ్డ దెబ్బలకు ఆగలేడని ఆర్తితో అడ్డు వచ్చిన తల్లికికూడా దెబ్బలుతగిలాయి. దాంతో చంద్రశేఖర్‌కు జ్ఞానోదయమయింది.

ఒకటి-తానుచేసిన తప్పుకారణంగా తండ్రి కోపించాడు. రెండోది-తల్లికూడా తనవల్ల దెబ్బలుతింది. మూడోది-ఆ తోట తమ స్వంతంకాదుగనుక తాను దొంగతనం చేసినట్టయింది. తను ఇన్నితప్పులు చేసినందువల్ల తండ్రికి పదిమందిలో తలవంపులట!

అందువల్ల యికముందెప్పుడూ యిలాంటిపని చెయ్యరాదని చంద్రశేఖర్ దృఢనిర్ణయం చేసుకున్నాడు. అతడో నిర్ణయం చేసుకుంటే దానికి భంగంరానివ్వడు.

అంత చిన్నవయసులోనే ఏ బాలునికైనా-దొంగతనం మీద, అబద్ధాలమీద, అవమానాలపైన విముఖత్వం ఏర్పడ్డమనేది అతని విచక్షణాశక్తికి నిదర్శనంగదా! సాహసిక ప్రయోగాలు చెయ్యాలనే కోరిక బలంగా వుండడంవల్ల అతను ముందు

ముందు యెటువంటి వీర శూర క్రియాశీలి అవుతాడోననేది ఊహించవచ్చు.

పూవు పుట్టగానే పరిమళిస్తుందనే సామెత చంద్రశేఖర్ విషయంలో చాలావరకు నిజమయింది. అతడు యుక్తవయస్కుడై విప్లవోద్యమంలో నాయకుడై చెలరేగిన తరుణంలో కూడా దొంగతనం, అసత్యాలాడ్డం, నయవంచనలవంటి వాటిని ఏవిధంగా అధిగమించాడో మున్ముందు తెలుసుకుందాం.

(ఈ సుఖదేవ్ భగత్‌సింగ్‌తోపాటు ఉరితీయబడ్డ వీరుడు సుఖదేవ్ కాదు.)

# విద్యార్జన

సుఖదేవ్ మరీ మేధకుడని యిన్నేళ్ళూ మిన్నకున్న సీతారాం చంద్రశేఖర్ చురుకుదనం మితిమించిందని గ్రహించి యిద్దరినీ ఒకేసారి విద్యాభ్యాసానికి పంపించాడు. ఆ వూళ్ళోనే వున్న మిత్రుడు మనోహర్‌లాల్ త్రివేది అనే ఉపాధ్యాయుని అర్థించి తన బిడ్డలను పంపించాడు.

మనోహర్‌లాల్ పాఠాలు చెప్పడంలో దిట్ట. అలాగే పిల్లలకు భయభక్తులు కలిగించడంలో చండశాసనుడు. తప్పు చేసినవారిని బెత్తంతో దండించడంలో జంకేవాడుకాడు. అయితే-పిల్లల మనస్తత్వాన్ని సరిదిద్దడానికేగాని, అర్థంలేని క్రమశిక్షణ పాటింపు ఎరుగడు. పైగా ఆయనకు విద్యార్థుల అంతర్గతశక్తుల్ని గ్రహించడంలో అపారమైన ప్రజ్ఞ వుంది.

సీతారాం తివారి ఎప్పుడయినా తీరిక దొరకితే వెళ్ళి ఆ మిత్రుని బడిలో కాస్సేపు కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడివస్తుండేవాడు. వాళ్ళిద్దరూ వూరందరికీ పెద్దలూ, మంచి మిత్రులూ!

ఒకసారి మనోహర్‌లాల్‌గారు పొరపాటున ఒక వాక్యాన్ని తప్పుగాచెప్పి పిల్లలచేత వ్రాయించాడు. ఆ తర్వాత ఆయనే ఆ తప్పును గుర్తించి - పిల్లలతో సరిచేసుకోవలసిందని

చెప్పాడు. ఆ సమయంలో కాలక్షేపానికి చేరిన సీతారాం తివారి కూడా అక్కడే వున్నాడు.

గురువుగారి బోధన ప్రకారం అన్న సుఖదేవ్‌తోసహా పిల్లలందరూ ఆ వాక్యాన్ని సరిదిద్దుకుంటున్నారు. చంద్రశేఖర్ మాత్రం మాష్టారి బెత్తంతీసుకుని ఆయనమీదే రెండు దెబ్బలు వడ్డించాడు. తండ్రి చివాల్నలేచి వెళ్ళి ఆ బెత్తం లాక్కుని దండించబోగా-గురువుగారు అడ్డుపడ్డారు. చంద్రశేఖర్ తండ్రి కొడతాడనే భయంతో ముడుచుకుపోకుండా "మేం తప్పుచేస్తే ఆయన కొట్టొచ్చుగాని-ఆయన తప్పుచెబితే మేంమాత్రం కొట్ట గూడదా?" అని రొక్కించి సవాలు విసిరాడు. తండ్రి అవాక్కయ్యాడు.

గురువుగారు "చురుకుదనం, తెలివితేటలూగల విద్యార్థులకు చదువు చెప్పేప్పుడు మేం మరింత జాగ్రత్తగా వుండాలి. తెలివితేటలూ, అందుకుతగ్గ వాదనాశక్తీ, సాహసమూవున్న చంద్రశేఖర్‌వంటి శిష్యుడు లభించడం నా అదృష్టం మిత్రమా" అన్నారు.

ఆనాటినుంచి మనోహర్‌లాల్‌గారు శేఖర్‌ను ఒక ప్రత్యేక శిష్యుడుగా అభిమానించి మరింత విశిష్టరీతుల్లో పాఠాలు చెప్పడం మొదలెట్టారు. అతను ఉడుకుమించిన అవగాహనాశక్తితో విద్యలు నేర్చుకుంటున్నాడు; అందరికంటె ముందుంటున్నాడు.

సీతారాం తివారికి పెద్దకొడుకుమీద ఎలాంటి ఆశలూ,

భ్రమలూ లేవు. ఈ చంద్రశేఖర్ వల్ల తనఆశలు నెరవేరతాయనే నమ్మకం కుదిరింది. ఈ బిడ్డ సంస్కృతం బాగాచదివి, వేదాలను వల్లెవేసి, మహావిద్వాంసుడై తమవంశానికి కీర్తిప్రతిష్ఠలు గడించాలని ఆయన ప్రగాఢవాంఛ! ఈ సంగతి అప్పుడప్పుడూ భార్యతో అంటుండేవాడు.

కాని-చంద్రశేఖర్ ఆలోచనలు మరో రకంగా వుండేవి. అతను గురువుగారు చెప్పిన పాఠాలు అవసరమైనంతకంటె యెక్కువగానే అర్థంచేసుకుని గుర్తుంచుకునేవాడు. అయినా - ఈ పాఠాలకుమించింది మరేదో కావాలనే తపన వేధించేది.

తన చదువు, ఆటపాటలు, తలిదండ్రులు, ఈవూరు - అన్నిటా అతనికేదో వెలితి,అసంతృప్తిజనించేది. మరేదోచేయాలి, మరెంతో తెలుసుకోవాలి, ఇంకెన్నో సాహసిక కార్యక్రమాలలో తలమునకలవ్వాలనే ఆరాటం తొందరించేది.

ఈ ఆలోచనలవత్తిడివల్ల అతను ఒక్కోరోజు బడికి యెగనామంపెట్టి నలుగురుమిత్రుల్ని పోగుచేసుకుని ఊరికవతలవున్న అడవిలోకి దూసుకుపోయేవాడు. జనసంచారంలేని ప్రాంతంలో చేర "దొంగలు-పోలీసులు" ఆట ఆడేవాడు. దొంగగా ఆడితే యెవరికీ దొరక్కుండా జాములతరబడి తప్పించుకోడం సరదాగా వుండేది. పోలీసుగా నటిస్తే దొంగను క్షణంలో పట్టుకునేవాడు.

ఇలాంటి సందర్భాల్లో శేఖర్ ఆటవికులతో స్నేహం చెయ్యడానికి ఉబలాటపడేవాడు. వాళ్ళలాగావిల్లుపట్టి బాణాలు

సంధించి గురిచూచికొట్టాలనే కాంక్ష పెల్లుబికేది. తుపాకులు పట్టడమంటే అన్నిటికంటె గొప్ప సాహసంగా భావించే వాడు.

తన ఆశలిలావుండగా-తండ్రిగారు సంస్కృతం, వేదాలూ పాండిత్యం అనడం చంద్రశేఖర్‌కు సరిపడని సంగతే అయింది. తండ్రికట్టడికి, ఈ చిన్నవూరికి, ఈ పిరికి మిత్రులకూ దూరంగా పంజరంవదలిన పిట్టలా యెక్కడెక్కడికో యెగిరిపోవాలనే కోరిక చెలరేగింది. తను పాఠాల్లో చదువుకున్న అనేకానేక విశేషాల్ని, ప్రదేశాల్ని, పట్నాల్ని స్వయంగా చూడాలనే తహతహ నానాటికీ పెరగసాగింది.

చంద్రశేఖర్ వంటి ఉత్తమ విద్యార్థి - పరధ్యానంగా వుండడం, తరచుగా బడి ఎగగొట్టడం గురువైనమనోహర్‌లాల్ గారిని ఆలోచింపజేశాయి. విద్యార్థి మనసు మరోవైపు మళ్ళు తోందిగనుక-అతన్ని కోప్పడడంగాని, కట్టడిలో వుంచడంగాని మంచిదికాదనుకున్నారు. వేరొక వ్యాపకం, కుటుంబ బాధ్యత తెలిసివచ్చేట్టు చేయడం ఉత్తమమని భావించారు.

యుక్తవయసు వస్తుండగా సుఖదేవ్ హఠాత్తుగా మర ణించడంవల్ల తలిదండ్రులు మరింత క్రుంగిపోయారు. ఇంక ఒక్కగానొక్కబిడ్డగామిగిలినచంద్రశేఖర్‌మీదనేవారిఆశలన్నీను. ఈ సమయంలో ఆబిడ్డ నాలుగురాళ్ళు సంపాదించే ప్రయోజకు డయితే తన మిత్రుడుతివారి యెంతో సంతోషిస్తాడనికూడా మనోహర్‌లాల్ తలపోశాడు.

ఆ మిత్రులిద్దరూ సంప్రదించుకుని శేఖర్‌కొక ఉద్యోగం సంపాదించగలిగారు. మనోహర్‌లాల్ గారికున్న పలుకుబడివల్ల, సీతారాం తివారి నీతినిజాయితీలను గురించి అందరినోటా వినడం వల్ల అలీరాజపూర్ తాలూకాఫీసులో చంద్రశేఖర్‌కు ఓ చిన్న ఉద్యోగం లభించింది. ఆరోజుల్లో ఇంగ్లీషుచదువు అంతగా లేని వారికి ప్రభుత్వోద్యోగం దొరకడం అంతసులభంకాదు.

పెద్దలమాట వినాలనిగాని, తమ గ్రామంకంటె పెద్దదయిన బస్తీలో అనేకవేలమందిని చూచే అవకాశం లభిస్తోందని కాని శేఖర్ ఆ చిరుద్యోగంలో చేరాడు. విధ్యుక్త బాధ్యతల్ని నేరవేరుస్తూనే వున్నాడు. కాని-అతనిమనసు అందులో నిమగ్నము కావడంలేదు.

ఈ ఉద్యోగం ఒక బానిసత్వం అనేభావన అతనిలో విముఖత్వాన్ని కలిగిస్తోంది. మాటిమాటికీ "అయ్యా - చిత్తం-మీ దయ" అంటూ అందరికీ తలవంచడం అవమానకరంగా తోచింది. అందువల్ల ఏమాత్రం అవకాశం దొరకినా బయటికివెళ్ళి రకరకాల మనుష్యుల్ని పరిశీలించడం, నదుల ఒడ్డున తిరగడం, అడవుల్లో ఆటలాడటం అతనికెంతో సరదాగా వుండేది. ఈ సమయంలోనే అతనికి ఒంటరిగాకూర్చుని దీర్ఘంగా ఆలోచించడం కూడా అలవాటయింది.

చిన్నప్పట్నుంచే అందరికంటె భిన్నంగా ఆలోచించడం, సాహసప్రక్రియలు చేయడం అలవాటైన చంద్రశేఖర్‌కు-తండ్రి ఆశించినట్లు వైదిక పాండిత్య సాధనమీదగాని, మతఛాందస

క్రతువులను చెయ్యడంలోగాని పిసమెత్తయినా ఆసక్తిలేదు. ఈ కట్లుబాట్లు, ప్రేమానురాగాల బంధనాలనుండికూడా విడివడి విశాల ప్రపంచంలోకి ఎగిరివెళ్ళాలనేకోరిక మనసును తొందరించ సాగింది.

కరచరణాలనేగాక మనసునుకూడా బంధించివేసేఉద్యోగ బానిసత్వాన్నివదలి దూరంగాపోయి ప్రపంచంలోని వింతలన్నీ చూడాలనే ఉబలాటం యెక్కువైన చంద్రశేఖర్‌కు ఒక అవకాశం గమ్మత్తుగా లభించింది.

ఆ వూరికి అప్పుడప్పుడూ ముత్యాలవర్తకు డొకడు వస్తూండేవాడు. బొంబాయి మహానగరంనుంచివచ్చే అతను యువకుడూ, మంచి మాటకారికూడాను. అందరితోనూ యిట్టే స్నేహం కలుపుకునే అతని ధోరణి చంద్రశేఖర్‌ను అమితంగా ఆకర్షించింది. అవకాశం దొరికినపుడల్లా అతను ఆ వర్తకుడు విడిది దిగివుండే చోటుకువెళ్ళి-అనేక ప్రశ్నలడిగి ఆసక్తికరమైన విశేషాలెన్నో తెలుసుకునేవాడు. బొంబాయినగర వైశాల్యం, వైవిధ్యం, వైభవాలగురించి వింటుంటే శేఖర్ మనసు యెప్పుడెపుడవన్నీ చూచి అనుభవిద్దామా అనే కౌతుకం తొందరించేది.

వర్తక యువకుడు చెప్పిన విశేషాల్నిబట్టి బొంబాయిలో అతులాది ప్రజలు హాయిగా వుంటున్నారు. ఉండడానికి యిల్లూ, తినడానికి తిండీ కరువైనవార్తలు యెన్నడూ వినలేదు. అటువంటిచోట చెయ్యడానికి యెన్నోపనులు సిద్ధంగావుంటాయి

అసలక్కడ పనిచేసే సమర్థులకోసం చాలామంది వెదుకుతుంటా రేమో! ఆ నగరానికి వెళితే యేదో ఒక వృత్తి సులభంగానే దొరుకుతుంది. హాయిగా బదుకుతూ ప్రపంచవింతలన్నీ తెలుసు కుంటూ వుండవచ్చుననిపించింది. ఏమైనాసరే బొంబాయివెళ్ళి పోవలసిందేనని నిర్ణయించుకున్నాడు.

ఈ సంగతి తెలిస్తే తలిదండ్రులు ససేమిరా ఒప్పుకోరనీ, కాళ్ళుచేతులు కట్టి యింట్లోపడేస్తారనీ చంద్రశేఖర్ అనుమా నించాడు. అందువల్ల యెవరికీ తెలియకుండా-ఈసారి ముత్యాల వర్తకుడు వచ్చివెళ్ళేప్పుడు శేఖర్ వెంబడించాడు.

ఆ విధంగా "భాంవరా" గ్రామాన్నివదలి దగ్గరి రైలు స్టేషన్‌కుచేరాక-వర్తకయువకునికి యీ కుర్రవాని నిర్ణయం అర్ధమయింది. లోగడ తాను నోరూరేట్లు చెప్పిన మాటలన్నీ అబద్ధాలని యిప్పుడు వెల్లడించడం అతనికిష్టంలేకనో - ఏమో అలాగే మాటలుచెబుతూ ముందుకు నడిపించాడు.

అక్కడకు బొంబాయి యెంతోదూరంకూడా కాదు. సరాసరి రైలుంది. ఆ రైలుకు టిక్కెట్టు కొన్నాడో లేదో తెలి యదుగాని-చంద్రశేఖర్ తోసహా బొంబాయిలో ఒక టెర్మినస్ స్టేషన్‌వరకూ ప్రయాణంచేశాడు. స్టేషన్ బయటకు వెళ్ళేసరికి మాత్రం ఆ ర్తకుడెటో తప్పుకున్నాడు. మళ్ళీ చంద్రశేఖర్‌కు కనిపించితే ఒట్టు.

ఆ మహానగరంలోకి ఒంటరిగా ప్రవేశించినప్పుడు చంద్ర శేఖర్ ఒళ్ళు జలదరించింది. తెలిసినవారొక్కరూ కనిపించక

కొంత భయంవేసింది. బిక్కు-బిక్కుమంటూ అతను రోడ్డున వెళు తుంటే యే ఒక్కరూ ఆగి "ఎవరివి, ఏమిటీ, ఏంకావాలి?" అని అడిగిన పాపానపోలేదు. ఎవరిపనిమీద వారు హడావుడిగా వెళ్ళి పోతున్నారు. అనంత సముద్రంలాంటి జనం ఉరుకులు పరు గులతో క్షణం తీరికలేనట్టు కనిపిస్తున్నారు.

ఎటుచూసినా వేగంగా దూసుకుపోతున్న ట్రాములు, బస్సులు, కార్లు! అంతటా సిమెంటురోడ్లు, తారురోడ్లు, ఎత్త యినమేడలు, విచిత్రమైన అలంకరణలు, రకరకాల దుస్తుల్లో లక్షలాది మనుషులు. చూడగానే కళ్ళుచెదిరే అంగళ్ళు. రక రకాల వస్తువులతో, నోరూరించే తినుబండారాలతో, రంగు రంగుల వస్త్రాలతో పెద్దపెద్ద షాపులు. తానింతవరకు కలలో నయినా ఊహించని అద్భుత ప్రపంచంలోకి అడుగుపెట్టి నట్టుంది.

అంతా కొత్త కొత్తగా ఆకర్షణీయంగా వుండడంవల్ల చంద్రశేఖర్ బొంబాయి నగరవైభవాల్ని చూస్తూ ఆరోజంతా తిరుగుతూనే వున్నాడు. ఎటువెళుతున్నాడో, ఏంజరుగుతుందో అనే ఆలోచనే లేదు. ఎప్పటికప్పుడు మరేదో వింతనుచూస్తున్న కుతూహలంతో తిరిగి తిరిగి చివరికి సముద్రతీరం చేరు కున్నాడు.

సముద్రంమీదినుంచి వచ్చే చల్లనిగాలి అతనికెంతో హాయనిపించింది, అప్పటికి అతనెన్నిమైళ్ళు నడిచాడో-కాళ్ళు నొప్పులు పెడుతున్నట్టు తెలిసింది. తిండిలేకుండా తిరగడంవల్ల

శరీరమంతాకూడా నీరసపడిపోయింది. ఉస్సురస్సురంటూ ఓచెట్టు నీడను కూర్చున్నాడు. ఆకలనిపించింది.

కాని-అటూ యిటూ వేగంగా కదలిపోతున్న మను షుల్ని, సముద్రంలో తేలియాడుతున్న నౌకల్ని, తీరాన రక రకాల పనులతో సతమతమవుతున్న కూలీలనీ, అక్కడక్కడా మెరిసిపోతున్న కెరటాల్ని చూస్తూ సర్వమూ మరచి చాలాసేపు ఆనందంగా గడిపాడు.

ఈ విధంగా చుట్టుపట్ల జరుగుతున్న అనంత కార్యకలా పాలను చూస్తూండగా - అక్కడక్కడా తినుబండారాలమ్మే వాళ్ళూ, కొనుక్కుతినేకూలీలూ చంద్రశేఖర్‌కు మళ్ళీ ఆకల్ని గుర్తుచేశారు. జేబులో రాగి డబ్బన్నాలేదు.

యాచించడం అనే వూహే అతని ప్రకృతికి విరుద్ధం, అంతకంటె అవమానకరం మరేదీ లేదని అతని నమ్మకం. కాని- ఆకలిని చల్లార్చుకునేదెట్లా?

సముద్రతీరాన చిన్న చిన్న నావలకు వాడకీలుపూసి, రంగులువేసే వాళ్ళున్నారు. కంట్రాక్టర్లు వాళ్ళను రోజువారి కూలికి నియమించుకుని, రంగులూ బ్రష్షులూ యిచ్చి ఆ పనులు చేయించుకుంటారు. కంట్రాక్టర్లలో ఒకరికి అదనపుకూలీలు కావ లసి వచ్చారు కాబోలు. చంద్రశేఖర్ వద్దకువచ్చి పనిచేస్తే డబ్బులిస్తానని అవకాశం చూపించాడు. శేఖర్‌కు తానుగా అడ క్కుండా ఏదో ఒకపని లభించడం సంతోషకరమైంది.

ఈ విశాలనగరంలో యీ విధంగా పొట్టపోసుకునే అవకాశం లభించిందనే సంతోషంతో అతను నావకు రంగులు వేశాడు. సాయంత్రానికి కరకు రొఖ్ఖం చేతిలో ఆడుతుంటే అతనికెంతో విజయం సాధించినట్టుంది. ఆ డబ్బులు గలగల్లాడించుకుంటూ, ఇతరకూలీలతో కలిసివెళ్ళి - చౌకగా లభించే భోజనం చేశాడు. ఆ కూలీలతోనేవెళ్ళి ఏ చెట్టునీడనో, ఏతూము చాటునో, మరేవరండాలోనో రాత్రంతా తలదాచుకున్నాడు. మళ్ళీ ఉదయమే వాళ్ళతోపాటు నావలకు మరమ్మతులుచేసి, రంగులువేసే పనిలోకి వెళ్ళాడు.

## కాశీఖండం

బొంబాయిలో చంద్రశేఖర్ జీవితం ఒక స్థాయీ భావాన్ని అలవరచుకుంది. తనకిష్టంవచ్చినపుడు పనిచెయ్యడం, తగినంత భోంచెయ్యడం-నాలుగుపైసలు దాచుకోడం అలవాటయింది.

అదేమిటి యిదేమిటి అని అడిగేవాడులేడు. ఫలానాపని చెయ్యాలనే వత్తిడిలేదు. చాలావరకు నిష్పూచీగా, స్వేచ్ఛగా బతుకుతున్నాడు. అయినా-అతని కప్పుడప్పుడూ ఓ ప్రశ్న తలెత్తేది. "నేను కోరుకున్న స్వేచ్ఛ యిదేనా? ఇంతకంటె లక్ష్యం మరొకటిలేదా?"

తల్లిదండ్రులు, గురువు, పెద్దల బంధనాలనేవిలేవు. పైగా ఇక్కడ తనిష్టంవచ్చినచోట్లకువెళ్ళి కొత్తకొత్తవిశేషాలుతెలుసు కుంటూ ఎన్ని జాములయినా గడపవచ్చు. కాని - కావలసి నప్పుడు కూలిపనులుచేసి, పొట్టనింపుకోవటమే తను కోరుకున్న స్వేచ్ఛ కాదనిపించింది. "మరేదో చెయ్యాలి, పదిమందిలో పెద్దగా వ్యవహరించాలి, సామర్థ్యం పెంచుకోవాలి" అనే తపన యెక్కువకాసాగింది.

అనేకరకాల యువకులతో, అనేకానేక వృత్తులవారితో కలిసి మెలిసి బ్రతుకుతున్నా చంద్రశేఖర్‌కు అలాంటివారి

వ్యసనాలేవీ అంటకపోవడం ఓ విశేషం. ఎందరో యువకులు అతనికి సన్నిహితంగావుంటూ తమ వ్యసనాలను గొప్ప అనుభూతులుగా వర్ణించి చెప్పి సుఖలాలసత్వాలు మప్పాలని చూచారు. కాని చంద్రశేఖర్ అలాంటివాటికి దూరంగా వుండడమేగాక వాటివల్ల ఆరోగ్యం, గౌరవం, ధనమూ కోల్పోతామని తోటివారికి చెబుతుండేవాడు.

ఆ మహానగరంలోని హెచ్చుతగ్గులు, తళుకుబెళుకులు, కార్మికుల గానుగెద్దుజీవితాలూ, చిలిపికజ్జాలు - చీటికీమాటికీ అలజడులూ, అశాంతీ చంద్రశేఖర్‌లో చికాకు, అశాంతి, ఏవగింపు కలిగించసాగాయి. ఈ వాతావరణంలో యిలా బతుకుతూ యీ నగరంలో వుండడంలో అర్థంలేదనిపించింది. మార్గాంతరం ఆలోచిస్తూ మరికొంతకాలం గడిపాడు.

ఒకనాడు హోటల్లో భోంచేస్తుండగా - తక్షణం యీ వగలమారి నగరాన్ని వదిలిపోవలసిందేనని నిర్ణయించుకున్నాడు. బయటికివచ్చి చూచుకుంటే ఓ వారంరోజులకూలి మొత్తం జేబులో నిల్వవుంది. శేఖర్ ఆ ధీమాతో సరాసరి స్టేషన్‌కు వెళ్ళి ప్లాట్‌ఫారంమీదున్న రైలెక్కి కూచున్నాడు.

అతను భవిష్యత్తును గురించి యేమేమో ఆలోచించుకుంటూ యెక్కడికివెళ్ళాలో, ఏ రైలెక్కాలోకూడా గుర్తించనట్టుండిపోయాడు. టిక్కెట్టయినా కొనలేదు. రైలు బయలుదేరింది. వేగంగా వెళుతోంది. చంద్రశేఖర్ తన ఊహాలోకంలో కలలుగంటున్నాడు-పగలూ రేయీ తేడా తెలియుదు. అదృష్టం

యేమిటంటే టిక్కెట్ చెకింగ్‌వారెవరూ ఆ పెట్టెలోకి రాకుండానే ఆ రైలు కాశీ (బెనారస్) చేరుకొంది.

అందరూ దిగిపోయినతర్వాత - కలలోంచి హఠాత్తుగా మేలుకున్నట్టు శేఖర్ కూడా రైలుదిగి సిటీలోకి వెళ్ళాడు. "కాశీ, వారణాసి, బెనారస్"వంటి బోర్డులుచూచి తను సరైన పట్నానికే చేరుకున్నందుకు శేఖర్ ఎంతో సంతోషించాడు.

కాశీ పూర్వకాలంనుంచీ విద్యాభిక్షకు, వితరణలకు పెట్టింది పేరు. ఎంత ఉన్నతవిద్యలనైనా ఉచితంగా బోధించే విద్యాలయాలెన్నో వుండేవి. పేదలకు ఉచితంగా భోజనంపెట్టి వస్త్రాలిచ్చే సంస్థలున్నూ అనేకం వుండేవి. ఈ విశేషాలు పూర్వమే తెలిసివున్న చంద్రశేఖర్ కాశీపట్నమంతా ఓసారి చూశాక-ఒక విద్యాసంస్థకువెళ్ళి ఆశ్రయించాడు.

ఎందువల్లనో యిప్పుడతను తండ్రికోరికను నెరవేర్చాలనే పట్టుదలతో చదువసాగాడు. సంస్కృతం బాగా అభ్యసించి అష్టాధ్యాయి, లఘుకౌముది, అమరకోశం బాపోసన పట్టేశాడు. భాషాధికారం సంపాదించడంతో సరిపెట్టుకోక గ్రంథాలయాలకువెళ్ళి చరిత్ర, రాజకీయ వివరాలుగల పుస్తకాలు యెక్కువ చదవసాగాడు.

రామాయణ, భారతాది పురాణాలను అర్థంచేసుకుని-కావ్యాలను విశ్లేషించుకుని - వీరగాధలకు పరవశించి పరవళ్ళుత్రొక్కే హృదయంతో జాతీయగౌరవం ఆత్మగౌరవం

స్వాతంత్ర్యం ప్రాణాధికంగా భావించిన జీవితమే ధన్యం అనే నిర్ణయానికి వచ్చాడు.

భాషాధికారం సంపాదించాక - గ్రంథాలయాలకు వచ్చే పత్రికలు చంద్రశేఖర్‌ను యెక్కువ ఆకట్టుకోసాగాయి. దేశ విదేశాల్లో (మొదటి ప్రపంచయుద్ధకాలం) జరుగుతున్న చారిత్రక విశేషాలు, పరిణామాలు అతన్ని జాతీయ దృక్పథంతో ఆలోచింపజేసేవి.

మనదేశంలో అప్పటికి జాతీయకాంగ్రెస్ సంస్థ గాంధీజీ ప్రభావంతో సంచలనం కలిగిస్తోంది. అక్కడక్కడా కొందరు బ్రిటిష్ పాలనకు వ్యతిరేకంగా పౌరుషధీరత్వాలతో పోరాడుతున్న వార్తలు చదివి - శేఖర్ ఆయా వీరుల స్థానంలో తానే వున్నట్టు ఉత్సాహం ఉద్రేకం పొందుతుండేవాడు.

ప్రపంచయుద్ధ చర్యలలో బ్రిటిష్‌వారికి భారతీయులు సర్వవిధాలా తోడ్పడితే - పరిమిత స్వయంపరిపాలనావకాశాలు కల్పించగలమన్న వాగ్దానాన్ని పాలకులు త్రోసివేశారు. ఈ నమ్మకద్రోహానికి కాంగ్రెసు తీవ్రంగా తన నిరసనను తెలియజేసింది. గాంధీజీ ఒక అపూర్వమయిన ఉద్యమాన్ని ప్రారంభించనున్నారని తెలిసింది.

దేశమంతా మహోద్యమంకోసం ఎదురు చూస్తుండగా 1921లో విదేశీవస్తు, వస్త్రబహిష్కరణకు గాంధీజీ పిలుపు యిచ్చారు. బ్రిటిష్‌వారితో సాధ్యమైనన్ని విధాల సహాయ నిరాకరణ చెయ్యాలనే కార్యక్రమం పలుచోట్ల వ్యాపించింది.

విదేశీవస్త్రాల విక్రయశాలలవద్ద పికెటింగులు, విదేశీవస్త్రాలను ఒకచోటచేర్చి తగలబెట్టడం మొదలయ్యాయి.

ఈ ఉద్యమం క్రమక్రమంగా కార్చిచ్చులా వ్యాపించడంతో చంద్రశేఖర్ ఉత్తేజితుడయ్యాడు. విద్యార్థిలోకం యెక్కడికక్కడ ఉద్రేకంతో కదిలింది. విద్యాలయాల్ని బహిష్కరించి జట్లుజట్లుగా వీధులవెంట బయలుదేరారు. పిడికిళ్ళు బిగించి, ఆకాశం ప్రతిధ్వనించేట్టు "వందేమాతరం...విప్లవం వర్ధిల్లాలి...భారతమాతకుజై" అని నినాదాలిస్తూ ఊరేగింపులు జరుపసాగారు.

ఇలాంటి వాతావరణం పొడసూపగానే చంద్రశేఖర్ మనసు ఉరకలువేసింది. నాలుగయిదుసార్లు యిలాంటి ఊరేగింపుల్ని తమాషాగా చూస్తూ గడిపిన అతను ఉత్తేజితుడై నలుగురతోనూ గొంతుకలిపి దిక్కులు పిక్కటిల్లేట్టు నినదించసాగాడు.

కొద్దిరోజులకే చంద్రశేఖర్ కాశీ విద్యార్థుల జట్టుకు నాయకుడై-స్వయంగా నినాదాలిస్తూ ఊరేగింపులు, ప్రదర్శనలు నడిపింపసాగాడు. పధ్నాలుగు, పదిహేనేళ్ళవయసులోపలి పిల్లలు విదేశీ వస్తుబహిష్కరణోద్యమం నడుపుతున్నారంటే చాలామంది ఆశ్చర్యంగా చూచేవారు, విడ్డూరంగా చెప్పుకునేవారు.

పది పన్నెండుమంది బాలకులు ఒకోజట్టుగా, పెద్దపెట్టున నినాదాలిస్తూ, ఊరేగుతుంటే - పోలీసులు వారినేంచెయ్యాలో

తెలియక, ఏమీ చెయ్యకుండానూ వుండలేక గుంజాటన పడే వారు. "విదేశీపాలనను సహించం" అనే ధోరణిలో వినవచ్చే నినాదాలు అధికారవర్గాన్ని కలవరపరిచేవి. ముక్కుపచ్చలారని విద్యార్థులింతధైర్యంగా ముందుకువచ్చి జాతికోరికను ఎలుగెత్తి చాడడం ఎందరినో ఉత్తేజపరిచేది-పెద్దలు తమ నిద్రాణస్థితికి సిగ్గుపడేవారు-పిరికివారు ఆ జట్లను చూడగానే తమ యిళ్ళ తలుపులు వేసుకునేవారు.

ఎంత పిరికివారయినా ఆ విద్యార్థుల ధైర్య చర్యలకు మురుసుకోకుండా వుండలేరు. కిటికీల సందులనుంచి, దొడ్డిదోవల నుంచి వూరేగింపుల్ని చూస్తూ, మనసులోనే వారి నినాదాలతో గొంతులు కలిపేవారు. ధైర్యవంతులు బహిరంగంగానే యీ విద్యార్థి బృందాల్ని ప్రశంసించి-దేశభక్తికీ, ఆత్మగౌరవ రక్షణకూ యిదే నిదర్శనం అంటుండేవారు.

విదేశీవస్త్రాలు అమ్మే అంగళ్ళముందు గొప్పకుటుంబాల స్త్రీలు, పెద్దలతోపాటు బాలురుకూడా చేరి పికెటింగ్ చేసే వారు. ఆ వస్త్రాలుకొంటే మనదేశంలో చేనేతవారికి ద్రోహం చేసినట్లేనని, మన దేశసంపదను విదేశాలకు దోచిపెట్టడమేనని పెద్దలు వివరించేవారు. విద్యార్థులు "బోలో-భారత్ మాతాకూ జై" అని నినదించేవారు. ఏనాడూ ఎండ పొడచూచే అవసరం రాని భాగ్యవంతుల స్త్రీలుకూడా తమ ఖరీదయిన విదేశీవస్త్రాలను-వందలు వేల విలువైనవాటిని తెచ్చి గుట్టలువేసి, నడి వీధిలో నిప్పంటించేవారు. ఆ దృశ్యాలకు చంద్రశేఖర్ గుండెలు

ప్రళయకాల శివతాండవంచేసినంత సంచలనం,తృప్తి నింపుకున్న ట్టుండేవి.

ఈ ఉద్యమం దేశమంతటా వ్యాపించి నిరంతరం ప్రతి ధ్వనించడంతో బ్రిటిష్ పాలకులు తమ పోలీసుబలగానికి కఠినచర్యలు తీసుకోవలసిందని ఆజ్ఞాపించారు. స్వామి భక్తులైన పోలీసులు ముక్కుపచ్చలారని పసివారనైనా ఆలోచించకుండా బాలురపైనకూడా లాఠీదెబ్బలు వర్షించసాగారు.

ఒకసారి చంద్రశేఖర్ తన విద్యాలయం బాలురనేగాక, మరెందరినో పోగుచేసి పెద్ద ఊరేగింపు నడిపాడు. దాదాపు వందమందికిపైగా యువకిశోరాలు బారులుతీరి కదంతొక్కుతూ నడిచే ఏర్పాటుచేస్తూ-తాను నాయకుడుగానినాదాలిస్తున్నాడు. యువకులు లైనుతప్పకుండా నడవడానికి హెచ్చరిస్తూ సర్దుతూ ఎల్లెడలా తానేయై సంచరిస్తున్నాడు. "వందేమాతరం...విప్లవం వర్ధిల్లాలి" అంటూ దిక్కులు పిక్కటిల్లే నినాదాలు!!

ఇంతలో పోలీసుల బృందం ఒకటివచ్చి ఈ బృందం ఊరేగింపుపై లాఠీలతో దాడిచేసింది. కళ్ళుమూసుకుని విచక్షణా రహితంగా లాఠీలతో కొడుతున్న పోలీసుల ఉధృతానికి విద్యార్థులు చెల్లాచెదరవుతుంటే-చంద్రశేఖర్ వారికి ధైర్యం కొలిపి, క్రమశిక్షణతో వరుసల్లో నడవండని హెచ్చరిస్తూనే వున్నాడు. అంతలో పోలీసుల దెబ్బలకు నలుగురైదుగురు బాలురు గాయాలై రక్తంచిమ్ముతూ పడిపోయారు. కొందరు హాహాకారాలు చేశారు.

ఆ దృశ్యంచూసి శేఖర్ హృదయం కోపాగ్నితో ప్రజ్వరిల్లింది. అంతకఠినంగా లాఠీలతో తనవార్ని కొడుతున్న పోలీసులకు గుణపాఠం చెప్పాలనిపించింది. వెంటనే ఒక రాయి తీసుకుని, ఒక పోలీసతని తలకు గురిచూచి విసిరాడు. అది బలంగా తగలడంతో ఆ పోలీసు తల ఠక్కున పగిలి రక్తం చిమ్మింది. అతను లుంగలుచుట్టుకుంటూ, విలవిల్లాడుతూ కింద పడిపోయాడు.

ఇతరపోలీసులు "పట్టుకోండి-ఎవడ్రా రాయి విసిరింది" అంటూ అటువేపు లాఠీలెత్తి పరుగెత్తివస్తున్నారు. చంద్రశేఖర్ వారికి చిక్కకుండా అల్లీ బిల్లీ తిరుగుతూ గుమిగూడిన జనంమధ్య నుంచి తప్పించుకు పారిపోయాడు. కనీసం ఒక్క ముష్కరుని కైనా గుణపాఠం చెప్పాననే తృప్తితో అతనిమనసు పులకిస్తున్నా-పరాయి పాలకులబంట్లకు చిక్కిపోరాదనే పట్టుదలతో అలా తప్పించుకు తిరుగుతున్నాడు. పోలీసులు కళ్ళలో వత్తులు వేసుకుని ఎంతకాలం ఎంతగా గాలించినా అతను దొరకనే లేదు.

అయితే పోలీసులకు నాటికీ నేటికీ రహస్యంగా ఆచూకీ తెలుసుకునే చాకచక్యం, మార్గాలూ వుండనే వున్నయ్‌గదా! ఆ రోజున ఆ విధంగా రాయివిసిరి తమలో ఒకర్ని తీవ్రంగా గాయపరిచిన కుర్రాడు ఒక ధర్మసత్రంలో వుంటున్నాడని పోలీసులకు తెలిసింది. దాంతో వాళ్ళు తమవర్గంలో ఒకడిపై జరిగిన అత్యాచారానికి ప్రతీకారం చెయ్యాలనే కక్షతో చెలరేగి

అన్నిసత్రాలనూ వెదకసాగారు. రేయింబవళ్ళు అలా వెదుకు తున్న పోలీసులకృషి చివరికి ఫలించింది. పదిమంది చుట్టుముట్టి ఆ పదిహేనేళ్ళబాలుణ్ణిపట్టి బంధించగలిగారు.

వాళ్లు చంద్రశేఖర్ వుంటున్నగదిని పరిశీలించగా - మరీ దిమ్మతిరిగింది. గోడలనిండా బాలగంగాధరతిలక్, మహాత్మా గాంధీ, లజపతిరాయ్‌వంటి నాయికుల పటాలు! దాంతో పోలీ సుల కోపం మిన్నుముట్టింది. ఆ కుర్రవాడికి నాలుగంటించి చేతులకు బేడీలు వేశారు. "ఛడవా పోలీసులన్నా భయం లేదురా?" అని గద్దించారు. అతను పకపకా నవ్వేశాడు.

జంకు గొంకూ లేకుండా వీరకిశోరంలా నడుస్తున్న చంద్రశేఖర్‌ను వాళ్ళు పోలీస్‌స్టేషన్‌కు తీసుకెళ్ళి-నేరస్తుల్ని వుంచే ఒకగది (లాకప్)లో బంధించారు. అప్పటికి శీతాకాలం ముదిరి ఎముకల్ని కొరికేంత చలిగా వుంటోంది. అయినా పోలీసులు ఆ కుర్రాడికి ఓ దుప్పటిముక్కయినా యివ్వలేదు. అయినా చంద్రశేఖర్ నాపరాయి పరచిన నేలమీద నిశ్చింతగా హాయిగా కూర్చున్నాడు. అతని మొహంలో ఏదో యుద్ధంలో గెలిచినంత సంతోషం ఉరకలువేస్తోంది. ఈ దుర్భరమైన చలికి అతను పిడచగట్టిపోయే భయంతో తమల్ని క్షమాపణ వేడు కుంటాడని పోలీసులూ, అధికార్లూ భావించి శేఖర్‌ను అలాగే వుంచేశారు.

ఆనాటి అర్థరాత్రి!

మందపాటి ఖాకీదుస్తులమీద ఉలెన్‌కోటుకూడా వేసు

కున్న పోలీస్ ఇనస్పెక్టర్ గారికి చలికి వణుకుపుడుతున్నట్టే వుంది. ఈ సమయంతో కుర్రకుంక తప్పకుండా కాళ్ళమీద పడి వేడుకుంటాడనే ఆశతో అతను ఖైదీగదివేపు వెళ్ళాడు.

లైటువేసి చూడగా ఇన్‌స్పెక్టర్ నోరూ కళ్ళూ వెళ్ళ బెట్టవలసివచ్చింది!

చలికి గజగజవణుకుతూ లుంగలుచుట్టుకు ఏడుస్తుంటా డనుకున్న చంద్రశేఖర్-చలిమంటల మధ్య వున్నట్టుగా చెమట లతో తృప్తిగా నవ్వుకుంటున్నాడు. దండేలు బస్కీలుతీసి చలిని జయించిన అతనిశరీరం - బొద్దుగా ముద్దుగా కమ్మెచ్చుతీసిన ఉక్కువిగ్రహంలావుంది. చిరునవ్వులూ, చెమటలూ చూడక పోతే అతను చలికి పిడచగట్టుకుపోయాడని భావించేవాడే ఆ ఇన్‌స్పెక్టర్. హతాశుడైన ఆయన నీరసంగా తిరిగి వెళ్ళి పోయాడు.

మర్నాడు చంద్రశేఖర్ మీద కేసుపెట్టి కోర్టులో హాజరు పరిచారు. ఆ కోర్టు అధికారి (మేజిస్ట్రేటు) పేరు వింటేనే నింది తులు హడలిపోతారని, అతడంతటి కఠినాత్ముడనీ చెప్పుకునే వారు. అతను సూటిగా కళ్ళలోకి చూస్తేనే నేరస్తులు పులినోట బడ్డ మేకల్లా గజగజలాడేవారట! కాని-చంద్రశేఖర్ చిరునవ్వు మాయని సింహంపిల్లలా నిలబడ్డాడు. మేజిస్ట్రేటు తనకంటె నిశి తంగా తనకళ్ళలోకి చూస్తున్న ఆ బాలుణ్ని నఖశిఖపర్యంతం ఆసక్తితో పరిశీలించాడు.

యవ్వనంలో అప్పుడప్పుడే అడుగెడుతున్న ఆ బాలుని

శరీరం నునుపుదేలి, కండలు మెలిదిరిగి, కోదమసింగాన్ని గుర్తు చేస్తోంది. ఆ కుర్రాడు తనవంక నిర్లక్ష్యంగా, తీక్షణంగా చూడ్డం అతని హృదయాన్ని దోచుకుంది. పోలీసు అధికారికిగాని, పబ్లిక్ ప్రాసిక్యూటర్‌కుగాని వ్యవధి ఇవ్వకుండా తానే ప్రశ్నించడం ఆరంభించాడు.

"నీ పేరేమిటి?" అనగానే యువకుడు ఖంగున జవాబిచ్చాడు.

"ఆజాద్" (సర్వస్వతంత్రుడు) అని.

"నీ తండ్రి పేరు?"

"భారత్"

"నివాసం?"

"చెరసాల"

చంద్రశేఖర్ నిర్భీకత, సమాధానాల్లోని విశాలార్థాలు ఆ కర్కోటకునికూడా కదిలించాయి. కాని బ్రిటిష్ పాలకుల ఆదేశాలు, చట్టాలు అతనికి శిరోధార్యాలుగదా! తన పేరు ప్రఖ్యాతులకు తగినట్టుగా వ్యవహరించకపోతే పై అధికార్లు తననే తప్పుపట్టిశంకరగిరిమాన్యాకులు పట్టించవచ్చుననే భయంతో ఆ మేజిస్ట్రేటు కఠినశిక్ష విధించాడు.

ముద్దాయి చంద్రశేఖర్ మరీ తలబిరుసుగా సమాధానాలిచ్చాడని, ప్రభుత్వోద్యోగియైన పోలీసు తన బాధ్యతల్ని పవిత్రంగా నిర్వర్తిస్తుండగా తీవ్రంగా గాయపరచి "రాజద్రోహి" అయ్యాడనీ న్యాయమూర్తి పేర్కొన్నాడు. ఫలితంగా పదిహేను కొరడాదెబ్బల శిక్షవిధించాడు.

ఆ రోజుల్లో ఈ శిక్షను అమలుజరపడం అతి క్రూరంగా వుండేది. లంగూటీతప్ప మరేగుడ్డా లేకుండాచేసి-బలిష్ఠుడైన వాడి చేత గట్టిగా కొట్టించేవారు. ఈ శిక్షను విన్నపుడుకూడా చంద్ర శేఖర్ చలించలేదు.

పోలీసులు అతన్ని బయటిజనం చూచేవిధంగా-జైలు గేటులోపలే ఓకూడలికి తీసుకెళ్ళారు. గుడ్డలన్నీ ఊడదీసి-చేతులు కదలకుండా ఓ కొయ్యచెక్కకు బిగించికట్టారు. మంచివయసులో వున్న యమకింకరుడులా బలిష్ఠుడొకడు పొడవాటి కొరడాతీసి సవరించాడు. రెండుసార్లు ఛెళ్ ఛెళ్ మనిపించి-గురిచూచి చంద్ర శేఖరుని వీపుమీద కొరడా సుళ్ళుతిరిగేట్టు కొట్టాడు. చూచే వాళ్ళకే గుండెలవిసినట్టు, చర్మం చిట్లినట్టు వళ్ళు గగుర్పొడి చింది. చంద్రుని శరీరం ఆ దెబ్బ తగిలినంతమేరా పొలుసు రేగింది; మోకుతాడులా కదుంకట్టింది, రక్తం చెమర్చింది. చూచేవాళ్ళు ఆర్తితో హాహాకారాలు చేశారు.

చంద్రశేఖర్ మాత్రం చలించలేదు. పళ్లు బిగబట్టి కళ్ళ తోనే నవ్వుకుంటున్నాడు. మధ్య మధ్య "జై భారత్... వందేమాతరం...విప్లవం వర్ధిల్లాలి" అని ఆకాశం దద్దరిల్లేట్టు గర్జిస్తున్నాడు.

దెబ్బమీద దెబ్బకొట్టినా ఆ కుర్రాడు "అయ్యో, అమ్మా" అనకుండా నిబ్బరంగా నిలబడ్డం కొరడాతోకొట్టే ఆ తలారికే వింత గొలిపింది. పెద్దవాళ్ళుకూడా తన కొరడాదెబ్బలు రెండు మూడు తగిలేసరికి బాధతో అరుస్తూ, విలవిల్లాడుతూ స్పృహ

కోల్పోయేవారు. ఈ చిరుత చీమకుట్టినట్టయినా లేనట్టున్నా డేమని తలారి వెరగుపడ్డాడు.

ఒకవేళ తనబలం తగ్గిందేమోనని పరీక్షించుకోదలచినట్లు మరింతగట్టిగా కొరడా జాడించికొట్టినా-కుర్రాడు సవాలుగా ఎదిరించి నిలచి నినాదాలిస్తున్నాడు. వేలాది కాశీవాసులు గుమి గూడి చూస్తూ "అతనిపేరే ఆజాద్ అట! నిజంగా ఇంత సాహసి కుడూ, ఓర్మిమంతుడూ, ధైర్యశాలీ వుంటాడా!" అని ఆశ్చ ర్యంగా చెప్పుకుంటున్నారు.

దెబ్బలు పూర్తయ్యాయి. చంద్రుని శరీరం వాతలుతేలి రక్తసిక్తం అయింది. అయినా అతను "జై భారత్" అంటూనే వున్నాడు.

ఈ విశేషం వైర్‌లెస్ వార్తలకంటె వేగంగా నగర మంతటా పాకిపోయింది. జనం తండోపతండాలుగా వచ్చి యీ వీరకిశోరాన్ని చూడాలని జైలుగేటుముందు గుమిగూడారు. ఆ అద్భుత సాహసికవీరకుమారుని చూడాలని యెవరికివారు ముందుకు త్రోసుకురాసాగారు.

రక్తం చిమ్ముతున్న దెబ్బలతో, లంగూటీతప్ప మరే వస్త్రముూలేని చంద్రశేఖర్ "వందేమాతరం" అంటూ బయటికి వచ్చాడు. అప్పుడతని శరీరం ఉదయిస్తున్న సూర్యునిలా వుందనీ, అతనిచూపులు మధ్యాహ్నభానుని కిరణాల్లా వెలుగు తున్నాయనీ కొందరు అభివర్ణించారు. కాశీలో కవులకేం తక్కువ!

దేశాన్నే చెరసాలగా వర్ణించి, భారత్ బిడ్డడినన్న ఆజాద్ అనే సింహకిశోరాన్ని చూచి వేలాదిమంది పౌరులూ ఉత్తేజితు లయ్యారు. గేటుదాటి తమవేపు వస్తున్న అతనితోపాటు "జై భారత్-వందేమాతరం-విప్లవం వర్ధిల్లాలి" అని దిక్కులుపిక్క టిల్లేటట్లు నినాదాలు చేశారు. చంద్రశేఖర్‌ను భుజాలకెత్తుకుని నగరముఖ్యవీధులంతటా జేజేధ్వానాలతో, దేశభక్తి నినాదాలతో ఊరేగించారు. అదే అతనికి "ఆజాద్" బిరుదు ప్రదానం అయింది.

కర్కోటక న్యాయస్థానంలో తనకుతాను పెట్టుకున్న పేరు నాటినుంచే స్థిరనామం అయింది. ఆ ఊరేగింపు ముగియ గానే వేలకుమించి లతుకు దగ్గరైన ప్రజ ఒక బహిరంగ స్థలంలో పభ ఏర్పాటుచేసింది.

చంద్రశేఖర ఆజాద్ వేదిక నెక్కుతూనే కుడిచేయి పిడికిలిబిగించి ఆకసాన్ని బ్రద్దలుచేస్తూ "విప్లవం వర్ధిల్లాలి" అని నినదించాడు. మేఘాలుదద్దరిల్లాయి. జనసమూహం కోటిగొంతు లతో ప్రతిధ్వనించింది. చుట్టూ జనం ఇసుకవేస్తే కిందరాలనంత దట్టంగా చేరారు. అశేషజనంలో ప్రతిఒక్కరూ ఆ వీరకిశో రాన్ని చూడాలని-ఇంకా దగ్గరగావెళ్ళి చూడాలని తహతహ లాడ్డంవల్ల తొక్కిసలాట మొదలయింది.

ప్రమాదాలు జరక్కుండా పెద్దలు మరొక మేజాబల్ల తెప్పించి ఆజాద్‌ను దానిమీద యెక్కించి అందరికీ కనిపించే యేర్పాటుచేశారు. క్రియాచాతుర్యంతప్ప ప్రసంగానుభవం

లేని శేఖర్ తొలిసారిగా కాశీపురప్రముఖులనుద్దేశించి మాట్లాడే సదవకాశాన్ని చక్కగా వినియోగించుకున్నాడు. అంతరాంతరాలలో అణగిమణగివున్న దేశభక్తి, ఆత్మగౌరవం, విప్లవాత్మకభావాల్ని అతను సులభశైలిలో సూటిగా వివరించాడు.

రణరంగంలో విజయకుంకుమ జల్లించుకుని తిరిగి వచ్చినట్టున్న ఆ కుర్రవాడు అందరి హృదయాలను దోచుకున్నాడు. వీరశూరధైర్యసాహసాల సంపుటిగా అందరినీ ఉత్తేజపరిచాడు. పెద్దలూ,వయోవృద్ధులూకూడా అతన్నిపూలమాలల్తో సత్కరించారు.ఆతనితో గొంతుకలిపి భూనభోంతరాళాలు దద్దరిల్లేట్టుగా "వందేమాతరం, విప్లవం వర్ధిల్లాలి, భారత్‌కీజై" అని నినాదాలు చేశారు.

చివరికి చంద్రశేఖర్ తన ప్రసంగాన్ని ముగిస్తూ అన్న వాక్యాలు చిరస్మరణీయాలు. "పరాయి పెత్తందార్ల బూట్ల క్రింద బ్రతికే పోలీసులు నన్నెలాగో బంధించగలిగారు. ఇది మళ్ళీ నా జన్మలో జరగదు. నాచేతులకింక బేడీలువేయగలవాడింతవరకూ పుట్టలేదు. నేను వాస్తవంగా ఆజాద్‌ను! ఇకముందు ఆజాద్‌గానే వ్యవహరిస్తానని దేశమాతసాక్షిగా చెబుతున్నాను. దేశమాత దాస్యశృంఖలాల విచ్ఛేదనంకోసం అవసరమయితే నా రక్తం, ప్రాణం ధారపోస్తాను. మరణమయినాసరే ఆజాద్‌గానే మరిస్తాను" అన్నాడు. ఆ కుర్రవాని కంచుకంఠం పలికిన వాక్యాలు దేశమంతటా ప్రతిధ్వనించాయి. అతని శపథాన్ని అతను కడకంటా నిలబెట్టుకున్నాడు.

## సంచలనం

"ఆజాద్"గా చంద్రశేఖర్ చేసిన తొలిప్రసంగాన్ని, అంతకుముందలి విశేషాల్ని, అతనిఫోటోతోసహా ఆనాటి ప్రముఖ జాతీయ వారపత్రిక "మర్యాద"లో ప్రకటించారు. అప్పటిఅగ్రశ్రేణి నాయకుడు డాక్టర్ సంపూర్ణానంద ఆ పత్రిక సంపాదకుడు, ప్రచురణకర్త. దాంతో చంద్రశేఖర ఆజాద్ ధీరోదాత్త కథనం దేశమంతటికీ ఆదర్శప్రాయంగా తెలియ వచ్చింది.

చంద్రశేఖర్ మళ్ళీ కాశీ విద్యాపీఠంలోచేరి విద్యా భ్యాసం కొనసాగించాలని ప్రయత్నించాడు. కొంతకాలం విదేశీ వస్తుబహిష్కరణోద్యమంలో ముమ్మరంగా పనిచేయడంవల్లసహా ధ్యాయులకంటె వెనుకబడ్డాడు. అందువల్ల వారికంటె దిగువ తరగతిలో చేరవలసి వచ్చింది. అయినా పై తరగతులవారుఅతన్ని గొప్పవాడుగా, ఆరాధనీయుడుగా గౌరవిస్తూనేవచ్చారు. కాని అతనిమనసు మళ్ళీ ప్రశాంతంగా, విద్యార్జనే ధ్యేయంగా కుదురుకోలేదు. విద్యాలయంలో కంటె గ్రంథాలయాల్లో యెక్కువకాలం గడపసాగాడు.

ఇక-అతనిదృష్టి పూర్తిగా విప్లవసాహిత్యంవైపే మళ్ళ సాగింది. ప్రపంచ చరిత్రలో చిట్టంగట్టిన ప్రభువులను ఏ యే

శక్తులెలా యెదిరించారో చదివాడు. ఫ్రెంచి విప్లవం గురించి అర్థంచేసుకున్నాడు. రష్యన్ విప్లవసమాచారం ఏమాత్రం లభించినా పదేపదే పరిశీలించి ఉత్తేజితుడయ్యాడు. మనదేశంలో అక్కడక్కడా జరుగుతున్న విప్లవచర్యలను గురించి పత్రికల్లో చదివి-ఆయా విప్లవకారుల్ని స్వయంగా కలుసుకోవాలనే కాంక్షతో ఉవ్విళ్ళూరసాగాడు.

అప్పటికి మోహన్‌దాస్ కరంచంద్‌గాంధీ జాతీయ కాంగ్రెస్‌సంస్థపై అధిక ప్రభావంగల మహానాయకుడుగా రూపొందాడు. విదేశీ వస్తుబహిష్కరణతోపాటు-ప్రభుత్వంతో సహాయనిరాకరణ చెయ్యాలనే ఉద్యమంకూడా నిర్వహిస్తున్నాడు. హింసతో, ఆయుధాలతో, ప్రత్యక్షపోరాటంతో సంబంధంలేని యీ ఉద్యమం దేశం దశదిశలా లక్షలాదిమంది సామాన్యుల్ని సైతం సంచలింపజేసింది. పల్లెవాసులుకూడా ప్రభుత్వంతో సహకరించకుండా ఉద్యమంలో చేరినట్టయింది. గాంధీజీ ఆశించినదానికంటె యెక్కువ సమైక్యకృషి జరిగింది. ప్రజల సహాయనిరాకరణోద్యమంతో ప్రభుత్వ కార్యకలాపాలు స్తంభించిపోయేసమయం అనతిదూరంలోనే వున్నదనుకుంటున్న తరుణంలో "చౌరీచౌరా" (ఉత్తరప్రదేశ్‌లోని గోరఖ్‌పూర్ జిల్లా గ్రామం)లో ఓ అఘాయిత్యం జరిగింది.

ఆ గ్రామంలోని రైతులను పోలీసులువచ్చి సాధికారికంగా భయపెట్టినా శిస్తులు చెల్లించలేదు. పైగా పోలీసులకు, అధికార్లకు తగుమర్యాదలు (కోళ్ళనుకోసి విందులు చెయ్యడం

వంటి మామూళ్ళు) చెయ్యలేదని వాళ్ళు దుర్భాషలాడి, లాఠీ లతో ఝళిపించారు. దాంతో ఉద్రిక్తులైన రైతుబిడ్డలు అలిగి-సుడిగాలిలా చుట్టుముట్టి పోలీసుబృందంలో కొందర్ని కట్టగట్టి నిప్పంటించారు. ఆ పోలీసులు సజీవదహనం పాలయ్యారు.

ఈ వార్త అహింసావాదియైన గాంధీజీని యెంతో కలవరపరచింది. బ్రిటిష్ ప్రభుత్వాధికారులు ప్రతీకారచర్యలు తీసుకోవాలనుకుంటుండగానే గాంధీజీ తన ఉద్యమాన్ని విరమిస్తున్నట్టు ప్రకటించారు.

పదిమందితో మొదలయి వందలు వేలనుమించి లక్షలాది ప్రజలకుప్రాకి మహోద్యమంగా విజృంభించినదాన్ని గాంధీజీ హఠాత్తుగా ఆపివేయడం-భారతీయుల స్వాతంత్ర్య కాంక్ష అనే అగ్నిమీద నీళ్ళుపోసినట్టే అయిందని యువకులు నిరసించ సాగారు.

గాంధీజీ ప్రభావానికిలోనయిన కాంగ్రెసుసంస్థ, తదనుయాయులూ ఉద్యమాన్ని విరమించినందువల్ల దేశంలో మళ్ళీ తెల్లదొరల ప్రభుత్వం నిరాటంకంగా, నిరంకుశంగా సాగుతోంది. యువతలో కొందరు ఇందుకు ఖిన్నంగా మరేదయినా ఉద్యమం తీవ్రఘోరణిలో చేపడితేగాని దేశ దాస్యవిముక్తి సాధ్యంకాదనే ఆలోచనల్లో వున్నారు.

"వందేమాతరం" ఉద్యమానికి పుట్టినిల్లయిన బెంగాలు ప్రాంతం తీవ్రవాద విప్లవకార్యక్రమాలకుకూడా నిలయం అని పేరొందింది. ముఖ్యంగా జారు ప్రభుత్వాన్నెదిరించి విజయ

సాధకులయిన సోవియెట్ విప్లవగాథలనుంచి స్ఫూర్తిపొందిన వారెందరో అక్కడ కొన్ని కార్యక్రమాలు చేపట్టారు. అలాంటి యువకుల్లో కొందరు పోలీసులచే గుర్తించబడ్డంవల్ల, ఆ వల నుండి తప్పించుకోడానికి, విప్లవకార్యక్రమాల్ని వ్యాపింపజేయ డానికీ ఉత్తరప్రదేశ్‌కుకూడా చేరుకున్నారు.

కాశీలోకూడా చాలాకాలంగా బెంగాలీలు యెక్కువగానే వున్నారు. అందువల్ల బెంగాల్‌నుండి వచ్చిన కార్యకర్తలు యిక్కడ త్వరలోనే ఒక విప్లవసమితిని రూపొందించుకోగలిగారు. ఈ దళం సమావేశాలూ, కార్యకలాపాలూ చాలా రహస్యంగా జరిగేవి. వారు తమ ఆదర్శవిధానాల్ని గురించి బహిరంగంగా ప్రచారం చేసుకునే అవకాశంలేదు. సాయుధపోరాటాలవల్లనే దేశదాస్యవిముక్తిసాధ్యమని నమ్మేవారాయె! అందువల్ల రహస్యంగా సంచరించేవారికి సానుభూతిపరులయినా ధన సహాయాదులు అందించే అవకాశాలులేవు. అసలు యెవరి కార్యక్రమం యేమిటో తెలియకుండా ధనమిచ్చేవాళ్ళుమాత్రం ఎవరుంటారు?

సురేశచంద్ర భట్టాచార్య అనే అతను బెంగాలీ యువకుల్ని కొందర్ని చేరదీసి "అనుశీలన సమితి"గా కొంత ప్రచారం చేశాడు. కొద్దిరోజులక్రితమే అండమాన్ జైలు శిక్ష అనుభవించి విడుదలయివచ్చిన శచీంద్రనాథసన్యాల్ అనే ఆయన ఒక విప్లవదళాన్ని స్థాపించి నడుపుతున్నాడు. కొద్దికాలానికి భారత దేశాన్ని స్వశక్తియుక్తులతో సర్వసత్తాక ప్రజారిపబ్లిక్‌గా నెల

కొల్పుకోవడమే ఈ రెండు సంస్థల ఆశయమూ నేది సభ్యులకు తెలిసింది. అందువల్ల ఏకాభిప్రాయంగల దళాల్ని రెంటినీ కలిపి- "ఇండియన్ రిపబ్లికన్ అసోసియేషన్" అనే పేరుతో ఏకోన్ముఖంగా నడిపించసాగారు. ఈ విప్లవసంస్థకు కొన్ని నియమనిబంధనల్ని రూపొందించుకున్నారు.

ఈ నూతనసంఘాన్ని స్థాపించిన ముఖ్యులు తదితర ప్రాంతాల్లోను అలాంటి దళాలను వ్యవస్థాపించడానికి వెళ్ళగా- కాశీప్రాంత వ్యవహారాలకు శచీంద్రనాథబక్షీ, రవీంద్రమోహన్ సర్కార్, రాజేంద్రలాహిరీ నాయకత్వం వహించేవారు. రాంప్రసాద్ బిస్మిల్ అనే ఆయనకూడా ఈ బృందంలో ప్రముఖుడుగా వుండేవాడు. ఆజాద్‌గా పేరొందిన చంద్రశేఖర్ యీ దళంలో సభ్యుడవడంలో ఆశ్చర్యంలేదు.

చిన్నప్పట్నుంచే నాయకత్వ లక్షణాలున్న చంద్రశేఖర ఆజాద్ క్రమంగా క్రియాశీలక సభ్యుడై, ఒక నాయకుడుగా రూపొందాడు. డాక్టర్ రోషన్‌సింగ్, అష్ఫాక్ ఉల్లా, రామకృష్ణఖత్రీ, మన్మథనాథగుప్తా, దామోదరసేథ్, భూపేంద్రనాథ సన్యాల్ విప్లవకర కార్యక్రమాలు రూపొందించుతూఆజాద్‌తో పాట్లు నాయకులనిపించుకున్నారు. ఆజాద్ కార్యదీక్ష, అసాధారణ సంఘటనాశక్తి, అమేయధైర్యసాహసాలు అందర్నీ ఆకట్టుకునేవి.

ఈ "ఇండియన్ రిపబ్లికన్ అసోసియేషన్" ఆశయాలను, కార్యక్రమాలను దేశవ్యాప్తంగా ప్రచారం చెయ్యడానికి ఇంగ్లీ

షులో ఒక కరపత్రాన్ని ప్రచురించారు. "దేశదాస్య శృంఖ లాల్నిబదాబదులుచేసి, స్వాతంత్ర్యం స్థాపించడంకోసం యువకు లంతా మాకు చేయూతనివ్వండి" అని ఆ కరపత్రంలో పిలుపు నిచ్చారు.

ఆ కరపత్రాన్ని ముద్రణాలయాల్లో అచ్చువేయడం ఒక యజ్ఞలాంటిదికాగా - దాన్ని దేశం నలుమూలలలా పంచడం "దాదాపు అసంభవం" అనుకునేకాలంలో విప్లవకారులు చాతు ర్యంతో దాన్ని పంచినతీరు వర్ణనాతీతం.

వివిధప్రాంతాల్లో - విదేశీపాలనను అంతమొందించాలనే ఆవేశంతో, దృఢచిత్తంతో వేగిపోతున్న యువకులకు యీ కరపత్రం ఒక ఆలంబనం, పవిత్రశాసనంగా లభించింది. అడవిలో చిక్కుపడ్డవారికి ఓ మార్గం దొరికినట్టయింది. తమకవసరమయితే మరింత ముందుకు నడిపే నాయకులున్నారనే ధైర్యంకూడా వారిలో కలిగింది.

"అప్పటికి లాహోర్‌లో సర్దార్ భగత్‌సింగ్, సుఖదేవ్, భగవతీచరణ్, యశపాల్ మొదలయినవారు "నవభారత సభ" నేర్పాటుచేసి, కార్యకలాపాలు కొనసాగిస్తున్నారు. ఆ యువ నాయకుల్నికూడా కలుసుకోవాలని చంద్రశేఖర ఆజాద్ తహ తహలాడుతున్నాడు.

కాశీనగరంలో యేర్పడిన సంఘాన్ని క్రియాశీలంతో నడపడానికి తగిన నాయకుల్ని నియమించి తాను ఇతరప్రాంతా లలో విప్లవకారుల్ని సంఘటితపరచాలని ఆజాద్ తలపోశాడు.

అదేసమయంలో రహస్య కరపత్రాల్ని దశదిశలా పంచడంలో ఆజాద్‌పాత్ర ప్రముఖంగా వుందని పోలీసులు అతనికోసం గాలించసాగారు. తత్ఫలితంగా చంద్రశేఖర్ విద్యాపీఠానికి వెళ్ళడం పూర్తిగా విరమించుకుని విప్లవకార్యక్రమాలకే అంకిత మయ్యాడు.

ఒకవైపున చంద్రశేఖర ఆజాద్, మరోవైపున "నవ భారతసభ" నాయకులూ వివిధప్రాంతాలలో విప్లవ దళాలను ఏర్పరుస్తుండగా-ఇంకోవిధంగా పోలీసులు యీ రహస్యదళాల ఆచూకీలు తీస్తూనేవున్నాయి.

ఒకసారి ఉత్తరప్రదేశ్, ఆ పరిసర రాష్ట్రాలలోని కార్య కర్తలు ఝాన్సీలో రహస్యసమావేశం జరిపి - ఒక గట్టి కార్య క్రమాన్ని నిర్ణయించుకోవాలని యేర్పాట్లుచేశారు. ఆనాటికి ఆజాద్ మరికొందరు క్రియాశీలక సభ్యులూ వివిధప్రాంతాల నుంచి ఝాన్సీలో సంకేతస్థలానికి చేరుకున్నారు. కాన్పూర్, లాహోరులనుంచి భగత్సింగ్ తదితర నాయకులురావలసివుండగా హఠాత్తుగా యీ సమావేశస్థలాన్ని రహస్యపోలీసులు చుట్టు ముట్టారని తెలిసింది.

చంద్రశేఖర ఆజాద్ మిత్రులందరినీ రెండోవానికి తెలియ కుండా వేర్వేరుగా తమ స్థావరాలకు వెళ్ళిపోవలసిందని హెచ్చ రించాడు. మళ్ళీ సమావేశంగురించి తగుతరుణంలో తెలియజేస్తా మని చెప్పాడు. తాను బ్రతికివుండగా పోలీసులకు చిక్కనన్న ప్రతిజ్ఞను పాటించడానికి-అతిచాకచక్యంగా ఆ రాత్రికి రాత్రే

ఝాన్సీనుంచి-సి. ఐ. డి. శాఖ వలలోంచి తప్పించుకుని ఢిల్లీ చేరుకున్నాడు.

ఝాన్సీ సమావేశం విఫలమై చెల్లాచెదరయిన విప్లవ కార్యకర్తలు తమతమ కేంద్రాలకు చేరుకున్నారని శుభవార్త లందాయి. ఢిల్లీ, లాహోర్‌లలో పర్యటించి అనేకమందితో చర్చలు జరిపినా ఆజాద్‌కు తృప్తికలగలేదు.

భగత్సింగ్, సుఖదేవ్‌వంటి ప్రముఖ నాయకుల్ని కలుసుకునిగాని భవిష్యత్ కార్యక్రమం రూపొందించరాదని ఆజాద్ నిర్ణయం. చివరికతను కాన్పూర్‌లో భగత్సింగును కలుసుకుని గంటలతరబడి చర్చించాడు.

ఈ తొలికలయికలోనే ఆ విప్లవవీరులిద్దరూ ఒకర్నొకరు బాగా అవగాహన చేసుకోగలిగారు. భగత్‌సింగ్ తమ విశాలమైన విప్లవసంఘానికి సరికొత్త ఆశయలక్ష్య సిద్ధాంతమూ, విధాననిర్వచనం అవసరమని సూచించాడు. అంత చిన్నవయసులోనే పూర్వాపరాలింతలోతుగా, విపులంగా ఆలోచించిన భగత్సింగ్‌మీద చంద్రశేఖర్‌కు అమిత గౌరవభావం కలిగింది. అలాంటివారి నాయకత్వంలోనే విప్లవకారుల లక్ష్యం సిద్ధిస్తుందని ఆజాద్ భావించాడు.

అదేవిధంగా ఆజాద్‌నుగురించి తానింతకుముందు విన్నవన్నీ అక్షరాలా నిజమేననీ, అతనంతటి క్రమశిక్షణ, సాహసం గలవాడు తమకు నాయకత్వం వహించడం మేలనీ భగత్సింగ్ అభిప్రాయపడ్డాడు. ముందుగా తామిద్దరూ వివిధ ప్రాంతాలలో

చెల్లాచెదురుగావున్న విప్లవకారుల ప్రతినిధుల్ని రావించి ఢిల్లీలో ఒక విస్తృతసమావేశంజరిపి-అందరికీ కలిపి ఒకేఒకబలమైన విప్లవ సంఘాన్ని ఏర్పరచాలని నిర్ణయించారు.

ఆరోగ్యంగా బలిష్ఠంగావుండే శరీరంతో, మామూలుగా చిరునగు మోముతో, పసివాడిలా వ్యవహరించే చంద్రశేఖర్-దేశ సమస్యలనుగురించి, భవిష్యత్కార్యక్రమం గురించి చర్చించేపుడు గంభీరంగా వుండడం-విదేశిపాలకుల ప్రసక్తివస్తే పళ్ళునూరి పిడికిలి బిగించడంవంటివి గమనించిన భగత్సింగ్ అతన్ని నాయకుడుగా భావించి గౌరవించసాగాడు.

అలాగే తనకంటె చిన్నవాడు, బక్కవాడు, సాధువుగా మాట్లాడేవాడయిన భగత్సింగ్ - దేశచరిత్రపై వ్యాఖ్యలను, విప్లవకారుల కర్తవ్యాలపై స్పష్టమైనభావాలను, దేశభక్తుల విభిన్న ధోరణులను గురించి చెప్పడం ఆజాద్‌లో ఆరాధనా భావాన్ని కల్పించింది.

పంజాబులో రైతు ఉద్యమాలగురించి, లాహోర్‌లో జరిగిన దారుణాలగురించి భగత్సింగ్ వర్ణించి చెబుతుంటే చంద్రశేఖర ఆజాద్ రక్తం సలసల కాగుతున్నంత ఉద్రేకం చెందాడు.

మొత్తంమీద తొలికయికలోనే వాళ్ళిద్దరూ సన్నిహిత మిత్రులై, పరస్పర గౌరవవిశ్వాస గరిమలతో - విప్లవకారుల విస్తృతసమావేశం ఏర్పాటుకు కృషిచేసే నిర్ణయంతో విడిపోయారు.

# సర్వసేనాని

చంద్రశేఖర్ తిరిగి ఝాన్సీచేరుకుని-అక్కడ విప్లవదళా నికి వెన్నెముకలా వుంటున్న సదాశివమల్కాపూర్ ఇంట అతిథిగా చేరాడు. తన అనుభవాలూ చర్చలూ నిర్ణయాలూ అతనికి వివరించాడు.

మాటలమధ్యలోనే తనకేదో హఠాన్నిర్ణయం జరిగినట్టు దిగ్గునలేచి "సదాశివ్-మావూరూ యిల్లు చూద్దువుగాని-బయలు దేరు" అన్నాడు. సదాశివ్ చాలా ఆశ్చర్యపోయాడు. ఇంత కాలం యెంత సన్నిహితంగావున్నవారితోనయినా, వారడిగినా తన స్వవిషయాలూ, కుటుంబం సంగతులూ మాట్లాడటానికి ఆసక్తిచూపని ఆజాద్ ఇపుడు హఠాత్తుగా యిలా పిలవడం విచిత్రమేమరి!

ఆజాద్ పిలిస్తే ఉరికంబం యెక్కడానికైనా సిద్ధంగా వుండే స్వభావం అలవరచుకున్న సదాశివ్ మిత్రునితో బయలు దేరాడు. "భాంవరా" గ్రామం అక్కడికంత దూరంకాదు. ఆ వూరు చేరగానే చంద్రశేఖర్ చడీచప్పుడూ కాకుండామిత్రుడ్ని తనకు తొలిపాఠాలు నేర్పిన మనోహర్‌లాల్ గారింటికి తీసు కెళ్ళాడు.

దాదాపు పదిసంవత్సరాలపాటు తలిదండ్రుల్ని ఎడబాసి, వారి యోగక్షేమాలయినా తెలుసుకోక, తన ఉనికి గురించైనా తెలపకుండావున్న చంద్రశేఖర్ హఠాత్తుగా తమయింటికి వచ్చే సరికి మనోహర్‌లాల్‌గారు ఆనందబాష్పాలతో బిగికౌగలించి ఒడలంతా సవరించారు.

ఈ వార్త అందగానే సీతారాం తివారి పరుగు పరుగున మిత్రునింటికి వచ్చాడు. తండ్రిని చూడగానే శేఖర్ చేతులు జోడించి వంగి పాదాభివందనం చేశాడు. ఆయన కళ్ళు నిండి బాష్పాలు జలజలరాలాయి. ఆయన మిగిలిన ఒక్కకొడుకును యింతకాలానికి చూడగలిగిన ఆనందంతో, దీర్ఘ వియోగబాధతో కన్నీటితో నేలతనితలనుఅభిషేకిస్తూగట్టిగాకావులించుకున్నాడు. అదిచూస్తున్న గురువుగారూ, మిత్రుడు సదాశివ్‌కూడా కన్నీరు నాపుకోలేకపోయారు.

అంతలో జగరాణీదేవికూడా వచ్చింది. పదేళ్ళనుంచి గర్భశోకాన్ని దిగమింగుకు గడిపిన ఆమె బిడ్డను తనివిదీరా సవరిస్తూ కంటికి కడివెడుగా విలపించింది. అతను మరీ అడ్డాల్లో బిడ్డడే అయినట్టు పదేపదే ముద్దులతో ముంచెత్తసాగింది. ఇలా జాముసేపు గడచినా ఆజాద్‌గాని, తలితండ్రులుగాని ఒక్క మాటైనా ముచ్చటించుకోలేదు. ఆ పూటకు భోజనంవేళ మీరింది.

గురువుగారివద్ద శెలవుతీసుకుని తమ యింటికి రమ్మనితల్లి పిలిస్తే చంద్రశేఖర్-తానింక ఆ యింటికి రాలేనని, వచ్చినా అది తలిదండ్రులకు సమస్యలెన్నో తెచ్చిపెట్టవచ్చుననీ, బాంధవ్యా

బంధనాలను మరిచిపో ప్రయత్నిస్తున్నాననీ సర్దిచెప్పి పంపించాడు.

మిత్రులిద్దరూ గురువుగారింటనే విడిదిచేసి భోజన భాజనాదులు నిర్వర్తించుకున్నారు. కాని-ఆ మర్నాటిరాత్రినుంచి జగరాణీదేవి కోరికను కాదనలేక వీరిద్దరూ తివారి యింటికి భోజనానికి వెళ్ళిరావడం తప్పలేదు.

గురువుగారింట వుంటే యెవరో విద్యార్జనకై వచ్చిన శిష్యులనేభావం కలుగుతుందని-తమ యింటికివెళితే బాంధవ్యం బయటపడి విప్లవకారుడిగా పోలీసులకు తెలిసిపోతుందేమోననీ ఆలోచించిన చంద్రశేఖర్ యిపుడు త్వరితంగా తనగ్రామాన్ని వదలిపోక తప్పదని నిర్ణయించుకున్నాడు.

పదిపన్నెండేళ్ళ బాలుడుగా వూరువదలివెళ్ళి పదేళ్ళ తరువాత బాగా యెదిగిన మీసకట్టుతో దృఢకాయంతో వచ్చిన ఆజాద్‌ను తమవూరి చంద్రశేఖర్‌గా గుర్తించినవాళ్ళు లేరనే చెప్పాలి. కాని-పగలంతా ఎవరికంటా పడకుండా దాగివుండడం వాళ్ళకు సాధ్యంకాలేదు.

అయిదారురోజులు గడిచేసరికి ఆజాద్ ఇంక వెళ్ళవలసిందేనని మిత్రుని హెచ్చరించాడు. అదేరోజున మనోహర్‌లాల్‌గారు యేదో పనిమీద తాలూకాఫీసులున్న బస్తీకివెళ్ళారు. ఆ రోజున ఆ ఆఫీసులవద్ద యెన్నడూ లేనంత పోలీసుబలగం, ఏదో దాడికి సన్నద్ధం అవుతున్నట్టు అగుపించి గురువుగారికేదో కీడు తోచింది.

ఆయన హుటాహుటిగా తమవూరికి తిరిగివచ్చి చంద్రశేఖరుతో యీ విషయం చెప్పారు. ఆ రాత్రి తొలిజాము గడవగానే చంద్రశేఖర్ మిత్రుడైన సదాశివ్‌తో కలిసి-తమవారివద్ద శెలవుతీసుకుని గమ్యం నిర్ణయించుకోని యాత్రకు బయలుదేరాడు.

అప్పటికే ఆకాశమంతా మబ్బులు కమ్ముకుని చలిగాలి వీస్తోంది. కొద్దిసేపటికి చిటపట చినుకులు మొదలయి ఒక మోస్తరువర్షం కురవసాగింది. ముందున్నత్రోవ కనిపించలేదు. విప్లవమే ఊపిరిగా, బలంగా చేసుకున్న ఆ యువకులిద్దరూ ముందుకు అహమికతో నడిచిపోతున్నారు.

అంతలో యెదురుగావస్తున్న బూట్లసవ్వడి వినిపించింది. ఆజాద్ మిత్రునివద్ద దాచిన పిస్తోలు తీసుకున్నాడు. మందుగుళ్ళు సరిగా వున్నవో లేదో సరిచూచుకుని-పక్క జేబులో పెట్టుకుని, కుడిచేతి వ్రేలిని ట్రిగ్గర్ మీదే ఆడిస్తూ నడక సాగించాడు.

చీకట్లలోంచి యమకింకరుల్లాంటి సిపాయీలిద్దరు యీ యువకులమీదికి వస్తున్నారు. వాళ్ళభుజాలమీద బోనెట్స్ బిగించి వున్న తుపాకులు మెరుస్తున్నాయి. ఇకతాము వాళ్ళకు చిక్కక తప్పదని సదాశివ్ భయపడ్డాడు. కాని - ఆజాద్ అతనికేదో విచిత్రమయినకథ చెబుతూ పకపకనవ్వుతూ ముందుకు నడిపించాడు. ఆ మిత్రునిధోరణినర్థంచేసుకున్న సదాశివ్‌కూడా సైదోడుగా చకచక నడిచాడు. ఆ సిపాయిలిద్దరూ వీళ్ళను పరికించి చూడకుండా ఝాంసీ గ్రామంవేపు వెళ్ళిపోయారు.

చంద్రశేఖర్, సదాశివ్‌లు ఆ రాత్రి చాలాసేపు ఆ చిత్తడివానలో అడవిమార్గాన నడచి నడచి, అలసిపోగానే ఓ చెరువువద్ద దట్టమయిన చెట్లనడుమ విశ్రాంతి తీసుకున్నారు.

అటువంటి ప్రాణభయంకరపరిస్థితిలోనూ చంద్రశేఖర్‌కు పడుకోగానే నిద్రపట్టేసింది. మరుక్షణం గుఱక పెట్టసాగాడు. సదాశివ్ ఆ పిస్తోలుపట్టుకుని తెల్లవార్లూ చుట్టూ పరికిస్తూ కను రెప్పలు వాలకుండా మేలుకునేవున్నాడు.

ఉదయం నిద్రలేచేసరికి ఒకటికి రెండు వింతలు సంభ వించాయి. ఇటువంటిచోట్లనే పోలీసుదాడుల భయం వుండదనీ-నిష్పూచీగా నిద్రపోకుండా జాగారం చేయడం తప్పనీ ఆజాద్ మిత్రుని మందలించాడు.

అంతలో గురువుగారయిన మనోహర్‌లాల్ వాళ్ళను వెదుక్కుంటూవచ్చి కలుసుకున్నారు. జగరాణీదేవి మాతృ సహజమైన ప్రేమతో బిడ్డకోరకు అనేకరకాల తినుబండారాలు తెల్లవార్లూ తయారుచేసి పంపించింది. బహుశా ఇదే తనబిడ్డకు తాను పెట్టగలిగిన చివరి ఆహారం అని ఆ తల్లికేం తెలుసు పాపం!

ఆనాటితర్వాత చంద్రశేఖర్ జీవితం మరింత వేగంగా క్షణం తీరికలేనిదిగా కొనసాగింది. అనేకరాష్ట్రాల్లో పలు పట్ట ణాల్లో రహస్యంగా పర్యటిస్తూ విప్లవకారుల్ని కలుసుకుని అందరూ ఒకేలక్ష్యంతో, ఒకే కార్యక్రమాన్ని చేపట్టాల్సిన అవ సరాన్ని నచ్చచెప్పడం జరిగింది. ఈ విధంగానే విస్తృత సమా వేశాలకు యేర్పాట్లున్ను జరిగాయి.

ఇలాగే పర్యటిస్తున్న భగత్సింగ్, సుఖదేవ్, కుందన్ లాల్, చంద్రశేఖర్ మధ్య మధ్య ఏ పట్నంలోనో కలుసుకునే వారు. తమ కార్యకలాపాలగురించి కూలంకషంగా చర్చించుకునేవారు. మహాసభ ఏర్పాట్లగురించి నిర్ణయాలు తీసుకునే వారు.

మొత్తంమీద 1928 అక్టోబరు 8, 9 తేదీల్లో ఢిల్లీ పాత కోటలో విప్లవకారుల మహాసభలు (రహస్యంగా) జరిగాయి. పంజాబు ప్రతినిధులుగా భగత్‌సింగ్, సుఖదేవ్, రాజపుత్ర స్థానంనుంచి కుందన్‌లాల్, సంయుక్త పరగణాల (ఉత్తర ప్రదేశ్‌కు అప్పటి పేరు)నుంచి శివశర్మ, బ్రహ్మదత్, జయదేవ్, విజయకుమార్‌సిన్హా, సురేంద్రపాండే, బీహార్ తరఫున ఫణీంద్ర నాథఘోష్, మన్‌మోహన్ బెనర్జీలు యీ సమావేశాలకు వచ్చారు.

కారణాంతరాలవల్ల చంద్రశేఖర ఆజాద్ యీ సభలో పాల్గొనలేకపోయాడనీ, ఇటీవల తనను లక్నోలో కలుసుకున్నాడనీ, మెజారిటీ అభిప్రాయం ప్రకారం తాను కట్టుబడి నడుచుకుంటా నన్నాడనీ భగత్సింగ్ తెలియజేశాడు.

ఈ రెండురోజుల చర్చల పర్యవసానంగా వివిధప్రాంతాల విప్లవసంఘాలను సమైక్యంచేసి "ఇండియన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ" (హిందూస్తాన్ సమాజవాది ప్రజాతంత్రసేన) అనే పేరు పెట్టారు. సర్దార్ భగత్సింగ్ ఈ పేరును ప్రతిపాదించినప్పుడు ఈ సంఘం ఆశయాల్ని యిలా వివరించాడు: "దేశం స్వతంత్ర

మయినప్పుడు ప్రజాప్రభుత్వం ఏర్పడుతుంది. మనిషిని మరో మనిషి దోచుకునే అవకాశం వుండదు. ప్రతి ఒక్కరికీ కష్టానికి తగ్గ ప్రతిఫలం అందే విధానాన్ని అవలంబిస్తాం" సుదీర్ఘ చర్చల తర్వాత యీ ఆశయలక్ష్యాలను ఆమోదించారు.

తాము దౌర్జన్యవాదులు కాదనీ-సాయుధవిప్లవం ద్వారా దేశానికి స్వాతంత్ర్యాన్ని సాధించి, ప్రజలందరికీ సమన్యాయం కలిగించే ప్రభుత్వాన్ని ఏర్పాటుచేయడమే తమలక్ష్యమనీ ప్రజ లందరికీ తెలియజేసేందుకు ప్రచారవిధానాల్నికూడా రూపొం దించారు.

ఆ విప్లవసంస్థ నిర్వహణకు ఒక కేంద్రసంఘాన్ని ఎన్ను కున్నారు. అందులో భగత్‌సింగ్, చంద్రశేఖరఆజాద్, సుఖదేవ్, విజయకుమార్ సిన్హా, శివశర్మ, ఫణీంద్రనాధఘోష్, కుందన్ లాల్ కార్యనిర్వాహకవర్గంగా ఎన్నికయ్యారు.

ఆయాప్రాంతాల కార్యక్రమాల పర్యవేక్షణకు కొందర్ని "ఇన్‌ఛార్జి"లుగా పేర్కొన్నారు. పంజాబుకు సుఖదేవ్, బీహా రుకు ఫణీంద్ర, యు.పి.కి శివశర్మ బాధ్యులన్నారు. విప్లవసంస్థకు సిద్ధాంతకర్తగా, సంచాలకుడుగా భగత్‌సింగ్ ఎన్నికయ్యాడు. అతని సూచనమేరకు చంద్రశేఖరఆజాద్‌ను "సర్వసేనాధిపతి"గా ఎన్నుకున్నారు.

అతను సమావేశాలకు హాజరుకాకున్నా, కార్యకర్తలంద

రికీ పరిచయం కానివాడయినా సర్వాధికారిగా ఎన్నిక కావడం చాలా గొప్ప విశేషం. అందుకు భగత్‌సింగ్ అందరిలోనూ ఆజాద్‌పై అచంచలవిశ్వాసం కలిగే మాటలు చెప్పడమే ముఖ్య కారణం.

ఈ విశేషాలు తెలిసినప్పుడు చంద్రశేఖర్ ఉత్సాహంతో ఉప్పొంగాడు. ఇంతమంది ప్రముఖ విప్లవకారులు తనమీద వుంచిన విశ్వాసానికి తగినట్టు ప్రతిక్షణమూ విప్లవసంస్థసేవకే అకుంఠితదీక్షతో అంకితమయ్యాడు. ఎలాంటి క్లిష్టపరిస్థితుల్లోను మొక్కవోని అతని అచంచలవిశ్వాసం, ప్రలోభలేశమైనా లేని స్వచ్ఛంద జీవనసరళి, సాహస వ్యూహారచన "రిపబ్లికన్ ఆర్మీ"కి పెట్టనికోటలుగా రూపొందాయి.

సర్వసేనానిగా యెన్నికయిన తర్వాతకూడా ఆజాద్ ఝూన్సీలోనే వుంటున్నాడు. అక్కడ విప్లవశాఖ కార్యకర్తయైన మాష్టర్ రుద్రనారాయణద్వారా ఎందరో రాజాలతో, సర్దార్లతో పరిచయాలు యేర్పడ్డాయి. చంద్రశేఖర్ కొంతకాలం ఒక సర్దార్ యింట నివసించాడు. అటువంటి పెద్దమనుషులచాటున వుంటూ-తమ సంఘసభ్యులకు కావలసిన ఆయుధాలు సంపాదించవచ్చునని, తుపాకులు వగయిరా ప్రయోగించడాన్ని సభ్యులకు నేర్పవచ్చుననీ ఆజాద్ యిలా ఆశ్రయం సంపాదించాడు.

ఆ సర్దార్‌కు అతడు కొలువున్న రాజాగారంటే గిట్టదు. ఏమాత్రం అవకాశం దొరికినా ఆ రాజాను అంతమొందించి

తానే ఆ జమీందారీకి ఏలిక కావాలని ఆ సర్దార్ వేచివున్నాడు. ఈ చంద్రశేఖర్ అనే యువకుడు ఆయుధాలు ప్రయోగించ నేర్చిన విప్లవకారుడనే నిజం ఆ సర్దార్‌కు తెలిసిపోయింది. మెల్లగా తనలక్ష్యాన్నిగురించి శేఖర్‌కు చెప్పాడు. రాజాను పై దొలగించడంలో తనకు ఆజాద్ సహాయపడితే-తాను విప్లవ సంస్థకు భూరివిరాళాలిస్తానని ఆశపెట్టాడు. శేఖర్ తమకు సంబంధంలేని హత్యాకాండకు తోడ్పడ్డం తనకిష్టంలేదని స్పష్టం చేసినా ఆ సర్దార్ మరింత మాటకారితనంతో వత్తిడి చేయ సాగాడు.

చంద్రశేఖర్ ఈ విషయాన్ని తమ విప్లవసంస్థ శాఖా సమావేశంలో మిత్రులకు తెలియజేశాడు. విప్లవకారుల్లో కొందరు సర్దార్‌జీ కోరినదాంట్లో విపరీతం యేమీలేదనీ, తమ విప్లవసంఘ కార్యక్రమాల్ని పటిష్ఠంగా విపులంగా నిర్వహించ డానికి ఏవిధంగా డబ్బు సంపాదించినా తప్పుకాదనీ అన్నారు. ఒకరయితే-తాము విప్లవదశావసరాలకోసం యింతకుముందు కొన్ని దాడులు చేశామన్నారు. అలాంటి సంఘటనలలో కొందరు అమాయకులుకూడా హతులయినారని వివరించారు. అందువల్ల అసమర్థుడైన ఒక రాజాను తొలగించి సర్దార్‌కు పట్టంగట్టి భూరివిరాళం పొందడం మంచిదని వాళ్ళు చెప్పారు.

కాని-ఈ వాదన చంద్రశేఖర్‌కు నచ్చలేదు. పైగా కోపం వచ్చింది. తమ సంఘం కొన్ని ఉత్తమ సిద్ధాంతాలకోసం, సాయుధ విప్లవానికి సిద్ధమయిందేగాని - హంతకుల ముఠా

కాదన్నాడు. దేశభక్తితో సంచలించేవారు దేశద్రోహుల్ని పరి
వెయ్యాలేగాని అమాయకుల్ని, తమకు సంబంధం లేనివారినీ
నష్టపెట్టడం, కష్టపెట్టడం కూడదన్నాడు.

"ఈ విప్లవకార్యకర్తలు డబ్బులేక ఆకలితో అలమటించ
వలసి వచ్చినా, పాలకవర్గానికి పట్టుబడి ఉరికంబాలకు వేలాడ
వలసి వచ్చినా-చరిత్రలో మచ్చవచ్చే హీనకృత్యాలకు తలవంచ
రా"దని ఆజాద్ వాదించాడు. అంతవరకు వితండవాదాలుచేసిన
వారు తలలువంచి-ఆజాద్‌వాదనే సమంజసం అన్నారు. చంద్ర
శేఖర ఆజాద్ ఆసభ్యుల్ని దగ్గరకుతీసుకుని-ఆచరణ విధానాలలో
బేధాభిప్రాయాలు రావడం సహజమనీ, మనసువిప్పి చర్చించు
కుని మంచి చెడులు గ్రహించడం విజ్ఞతయనీ చెప్పి ఆ సంగతి
అంతటితో మరచిపోదామన్నాడు.

ఇదే మాదిరిగా చంద్రశేఖర్ సభ్యుల ప్రవర్తనకుగాని,
పిడివాదనలకుగాని ఒక్కొక్కసారి కోపం వచ్చినా, ఆ విషయంపై
నిష్కర్షగా చర్చించిన తర్వాత - అంతామరచి అందరితోను
ఎంతోసఖ్యంగా, చనువుగా మెలిగేవాడు. అందువల్ల ఈ" సర్వ
సేనాధిపతి" అందరికీ అధికారిగాగాక పెద్దన్నగా గౌరవనీయు
డయ్యాడు. అతను తన వాదనలోని న్యాయజ్యోతిద్వారా,
సత్ప్రవర్తనద్వారా సహచరులను ప్రభావితం చేసేవాడేగాని,
తనమాటే చెల్లాలనే మొండిపట్టు పట్టేవాడుకాదు. తమకు
తెలిసిన సానుభూతి పరులు, ప్రజాసామాన్యంపట్లకూడా ఆజాద్
ఉదారంగా, మైత్రీభావంతో వ్యవహరించేవాడు. సానుభూతి
పరులను కోల్పోతే తమ విప్లవకార్యక్రమాలకు ప్రజామోదం
వుండదని చెప్పేవాడు.

## దాడులు

ఈ సమయంలోనే భగత్‌సింగ్ తమ విప్లవసంస్థ ఆశయ సాధనకు ఆయుధాలు, మందుగుండు సామగ్రి తయారుచేసే స్వంత కేంద్రాలు అవసరమని అందరికీ నచ్చబలికి-అందుకోపథకం తయారుచేశాడు. (ఈ పరిణామానికి తగిన వివరాలు ఆసక్తి కరంగా, వళ్ళు గగుర్పొడిచే విధంగా అభివర్ణించిన గ్రంథం "షహీద్ భగత్సింగ్" యీ ప్రచురణకర్తలనుండి సేకరించి చదవండి).

ఆయుధాలు, బాంబులు తయారుచేయడానికి కావలసిన ముడిపదార్థాల సేకరణకూడా జరిగింది. నిర్మాణానికి అవసర మయిన సాంకేతిక పరిజ్ఞానంకూడా సమకూడింది. ఇక ఉత్పత్తి కేంద్రాన్ని (ఫ్యాక్టరీ) యెక్కడ స్థాపించుకోవాలనే విషయం తేల్చడానికి "కమేండర్-ఇన్-చీఫ్" (సర్వసేనాని)తో చర్చించాల్సి వుంది.

భగత్సింగ్ తన ప్రతిపాదనలను తెలియజేస్తూ రహస్య పత్రం పంపించాడు. అది అందగానే చంద్రశేఖర్ ఆగ్రా పట్టణానికి బయలుదేరి వెళ్ళాడు. అక్కడ అప్పటికే భగత్సింగ్‌తో పాటు సుఖదేవ్, బటుకేశ్వరదత్తు, శివశర్మ, విజయకుమార్ సిన్హా, జయదేవకపూర్, డాక్టర్ గయాప్రసాద్ ప్రభృతులు

చేరివున్నారు. అందరూ సమాలోచనలుచేసి బాంబులతయారీకి ఆగ్రాయే అనుకూలంగా వుంటుందని నిర్ణయించారు.

వాళ్ళు తమ విడిదికోసం ఒక ఇల్లు, ఫ్యాక్టరీకోసం మరో చోట మరో యిల్లూ అద్దెకుతీసుకున్నారు. ఉత్పత్తి కేంద్రసలహాదారుగా బెంగాలీ విప్లవకారుడు జతీన్‌దాసు - సభ్యులకు బాంబులు వగయిరా తయారుచేసే విధానాలు నేర్పేవాడు. ఆయనా, ఆజాద్, భగత్సింగ్, ఒకరిద్దరు కేంద్రకార్యవర్గసభ్యులూ మాత్రం అక్కడే బసచేసేవారు. మిగతా సభ్యులు రెండో యింట్లో నివసించేవారు.

ఓవైపున బాంబుల తయారీకి కృషి జరుగుతోంది. అప్పుడు ఆగ్రాజైలులోవున్న విప్లవయోధుడు యోగేశచంద్ర చటర్జీని ఎలాగయినా తప్పించి రక్షించుకోవాలనే నిర్ణయం కూడా చేశారు. యోగేశ్‌ను ఆగ్రాజైలునుంచి మరొకజైలుకు మార్చబోతున్నారని తెలిసింది. అలామార్చే సమయంలో తమ బృందం పోలీసులపైన ఒక్కుమ్మడిగా దాడిచేసి, చాకచక్యంతో యోగేశ్‌ను విడిపించాలని వ్యూహం రచించారు. అందుగ్గాను ఒకరిద్దరు బయటివారినికూడా రప్పించి తమలో కలుపుకున్నారు.

కాని- యోగేశ్ నేగాక, మరేఖైదీనిగాని ఆగ్రాజైలునుంచి మరోచోటికి తరలించే యోచన విరమించబడిందని తమ వేగులవారు తెలియజేశారు. అందువల్ల చాలామంది కార్యకర్తలు తమ తమ ప్రాంతాలకు వెళ్ళిపోయారు. ఆజాద్‌కూడా తన సహచరులతో ఝాన్సీకి తిరిగివచ్చాడు.

అయితే-త్వరలోనే యోగేశ్‌చంద్ర చటర్జీని ఆగ్రా జైలునుంచి మరెక్కడికో తరలిస్తారనేవార్త వచ్చింది. ఆజాద్ మరికొందరు ముఖ్యులూ మళ్ళీ ఆగ్రా చేరుకున్నారు. యోగేశ్‌ను రాత్రి పదిగంటలకు బయలుదేరే రైలులో కాన్పూరువేపు తీసుకెళతారని తెలిసింది. అయితే సాయంత్రం ఏడుగంటలలోపుగానే యోగేశ్‌ను ఆగ్రా స్టేషన్‌కు తీసుకెళతారట! ఆ విశేషాలు గమనించి పొంచి అనుసరించడానికి బటుకేశ్వరదత్తును ముందుగానే స్టేషన్‌కు పంపించారు. రాజగురు అంతకుముందే వెళ్ళి కాన్పూరులో ఒక యింటిని అద్దెకు కుదర్చాలని నిర్ణయించారు.

ఈసారి వారికందినసమాచారం నిజమైనదే. యోగేశ్‌ను రాత్రి బండికెక్కించి పోలీసుబృందం బందోబస్తుతో తీసుకు వెళుతోంది. ఆజాద్, భగత్‌సింగ్ మరికొద్దిమందితో అదే రైలులో వేరే ప్రయాణీకుల్లా వెళుతున్నారు. రైలు ఆగినపుడల్లా ఎవరో ఒకరు పోలీసులు ఖైదీతోవున్న పెట్టెలోకివెళ్ళి మరుసటి స్టేషన్‌లో దిగిపోతూ - అనువైన వీలుకోసం వేయికళ్ళతో చూస్తున్నారు. రైలు కాన్పూరు చేరినా విప్లవకారులకు ఏమాత్రమూ అవకాశం లభించలేదు.

పైగా ఆజాద్ జేబునెవరో కత్తిరించి భద్రంగా వుంచిన ధనం దొంగిలించిపోయారు. కాన్పూరులో అంత తొందరగా యిల్లు అద్దెకు దొరకలేదని రాజగురు నివేదించాడు. మొత్తం మీద ఈ బృందం పథకం సఫలంకాలేదు. పైగా అవమానం జరిగినట్లు నాయకులిద్దరూ (భగత్సింగ్, ఆజాద్) తలలు పట్టుకు

కూర్చున్నారు. యోగేశ్‌ను తప్పించలేకపోయినందుకు, జేబులో డబ్బులేకపోయినందుకు ఆజాద్ చాలాకాలంవరకు చింతిస్తూనే వున్నాడు.

తమ దళం అసమర్థత వెల్లడయిందని నాయకులు బాధ పడుతున్నారుగాని - విప్లవసంఘంలో చేరే సభ్యులసంఖ్యా, ప్రాంతీయశాఖలూ నానాటికీ పెరుగసాగాయి. కార్యక్రమా లను, కరపత్రాలను పంచడంకోసం తగినంత డబ్బులేక చాలా చికాగ్గావుంది. జీవితమంతా విప్లవానికే వెచ్చిస్తున్న కార్య కర్తల్ని పోషించుకోడానికి, ఆయుధాల ఉత్పత్తికి, వివిధ శాఖ లతో ప్రత్యక్ష సంబంధాలు పెట్టుకోడానికి ధనం చాలా అవసర మాయె! అందువల్ల ధనసంపాదన తక్షణ సమస్యగా పరిణ మించింది.

పరిస్థితుల్ని అర్ధంచేసుకున్న సభ్యులుగాని, సానుభూతి పరులుగాని యిచ్చే విరాళాలు కార్యకర్తల టీనీళ్ళకైనా చాల డంలేదు. కాబట్టి ఆగ్రా పరిసరాల్లోగల సభ్యులంతా సమా వేశమై వివరాలు, సాధకబాధకాలు చర్చించుకున్నారు. చివరికి రాజకీయ లక్ష్యాలకోసం ప్రభుత్వాన్ని బలపరిచే ధనికుల్ని, దుర్మార్గుల్ని దోచుకోవడం తప్పుకాదనే నిర్ణయానికి వచ్చారు.

అయితే తమ కార్యకలాపాలు వెంట వెంటనే పోలీసు లకు, ప్రభుత్వదృష్టికి రాకుండా - పట్నాలనువదిలి, దూరంగా వుండే పల్లెల్లోనే దాడులు జరపడం మంచిదనుకున్నారు.

ఈ దాడుల సందర్భంలో-సామాన్య ప్రజలకు యిబ్బం దులు కలిగించరాదు. స్త్రీలను తాకరాదు. అధికసంపన్నులనే

అది హింసారహితంగా, భయపెట్టి దోచుకోవాలి. హత్యలు ససేమిరాకూడదు. ఈ నియమాలకులోబడి దాడులు జరపడానికి సమర్థులు, సంసిద్ధులతో ఒక ప్రత్యేక బృందం ఏర్పాటయింది. ఈ దళానికి రాంప్రసాద్ బిస్మిల్ నాయకుడు.

ఈ దాడులలో పాల్గొనేవారికి కొన్ని సంకేత పదాలు అవసరంగదా! వారిమాటలు దోచుకోబడేవారికిగాని, చాటు మాటుగానో, పొరపాటునో వినేవారికిగాని అర్థంకాకూడదు గదా!

ఈ కార్యక్రమంలో స్వయంగా పాల్గొనేవాడు "జ్ఞాని". దాడుల విధానం వగైరా వివరాలేమీ తెలియనివాడు "భక్తుడు". అన్నీ తెలిసిన క్రియాశీలి "అవధూత". ఇలాంటి గుప్తనామా లను వాడేది యీ రాజకీయ దాడుల సందర్భంలో మాత్రమే! విప్లవసంఘ పోరాటరీతులకు వేర్వేరు సంకేతాలు వుండనే వుంటాయి.

మొట్టమొదటి దాడికి కృషి జరుగుతుండగా "పల్లెల్లో అతిస్వార్థంతో అమాయకుల్ని పీడించి ధనికులయిన వారిని మాత్రమే దోచుకోవాలి. దాడితర్వాత వారి తప్పులకు యిదో శిక్ష అని తెలిసివచ్చేట్టు వ్యవహరించా" లని చంద్రశేఖర ఆజాద్ మరోసారి హెచ్చరించాడు.

వేగులవారినుంచి సేకరించిన సమాచారం ప్రకారం ముందుగా ఫతేపూర్‌లోని ఒక జమీందారును దోచుకోవాలని బిస్మిల్ నిర్ణయించాడు. అందుకుతగ్గ వ్యూహం తయారుచేసి తనబృందంలో యెవరికి తగిన బాధ్యతలు వారికి అప్పగించాడు.

ఎవరికివారు, లేదా ఇద్దరు ముగ్గురు చొప్పున పల్లెటూరిబైతుల వేషభాషలతో ఫతేపూర్ చేరుకున్నారు.

బాగా చీకటిపడిన తర్వాత అందరూతలొక మూలనుంచి ఆ జమీందారు దేవిడీవద్దకు చేరుకున్నారు. సైగలతోనే తమ పథకం అమలుకు పూనుకున్నారు. తలొక ఆయుధం (లేనివారు కూడా ఏదో గుప్తంగా) వున్నట్టే నటిస్తూ ఒక్కుమ్మడిగా లోపల ప్రవేశించారు.

సాయుధులైన వార్ని చూడగానే సిబ్బందీ, కాపలాదారులూ భయకంపితులయి ఓ మూలకు చేరుకున్నారు. వాళ్ళను అక్కడనుంచి కదలకుండా నిలవరించే బాధ్యత ఆజాద్‌కు అప్పగించబడింది. అతనొక్కసారి పిస్తోలుతీసి అందరికీ చూపి గురిచూసినట్టు నటించేసరికి దేవిడీ బలగం కుక్కినపేనుల్లా నిలబడి గుడ్లు మిటకరించారు. బిస్మిల్ సైగల ప్రకారం మిగతా వారు లోపలిభాగాల్లోకి చొరబడ్డారు.

అయితే డబ్బూ దస్కం యెక్కడ వుంటుందో తెలియక వాటికోసం వెదకడంలోనే చాలాకాలం ఖర్చయింది. అంతలో జమీందారు దేవిడీలో ఏదో జరుగుతోందని యిరుగు పొరుగు వారికి తెలిసి వాళ్ళు "దొంగలు - దొంగలు" అని అరుస్తూ దేవిడీకి చేరుకుంటున్నారు.

పదిమందికీ తెలిసి భంగపడే విషమస్థితి రావచ్చునని ఆజాద్ భయపడుతున్నాడు. అదే ఆలోచనతో రాంప్రసాద్ బిస్మిల్ దొరికినంతవరకు మూటగట్టుకుని బయటపడవలసిందిగా అనుచరులను హెచ్చరించాడు. దాంతో అందరూ అలాగే సింహద్వారం వేపు పరుగెత్తారు.

బిస్మిల్ మొదటిగదిలోకి పరుగెత్తేసరికి చంద్రశేఖర్ చేతిలోని పిస్తోలును ఒకస్త్రీ యెవరో లాక్కోడానికి ప్రయత్నిస్తోంది. స్త్రీని తాకరాదనే నియమంవల్ల ఆజాద్ ఆమెనేమీ చెయ్యలేక పిస్తోలును వదలకుండా రక్షించుకోడం కృత్యాద్యవస్థగా చెమటలు కారుస్తున్నాడు. బిస్మిల్ ఆజ్ఞాపించగానే ఆజాద్ తన పిస్తోలుకూడలాక్కుని బయటికి లంఘించాడు.

దేవిడీముందు గుమిగూడిన ఇరుగుపొరుగువారు కర్రలూ బడితెలతో సిద్ధంగావున్నా-ఈ ఆధునికాయుధాల్ని చూచి వెనుకంజ వేశారు. "కదిలితే కాల్చేస్తాం" అని బెదిరించి ఈ విప్లవ బృందం అందరూ ఊరుదాటేవరకూ బిస్మిల్ అక్కడే ఆగాడు. ప్రజల్ని భయకంపితుల్ని చేయడానికి రెండుసార్లు గాలిలోకి పిస్తోలు పేల్చాడు. చివరికి తానున్నూ పరుగెత్తి మిత్ర బృందాన్ని కలుసుకున్నాడు.

ఈ తొలిదాడివల్ల ఆశించినంత ధనం చిక్కలేదు. అందువల్ల భవిష్యత్కార్యక్రమం గురించి చర్చించడానికి మళ్ళీ సమావేశం జరిపారు. అన్నికోణాలనుంచీ కూలంకషంగాచర్చించారు. వ్యక్తుల యిళ్ళను దోచుకుంటే "కొందరు దోపిడీదొంగలు విప్లవకారులమనే పేరుచెప్పి దోచుకుంటున్నా"రని ప్రభుత్వం ముద్ర వేయవచ్చు. ప్రజలు యీ ప్రచారాన్ని నమ్మితే తమ నిజ విప్లవఘటనకే చెడుపేరు వస్తుందని అభిప్రాయపడ్డారు.

రామకృష్ణఖత్రీ అనే ఒక సాధువుకూడా ఈ విప్లవ దళములో సభ్యుడుగా చర్చల్లో పాల్గొన్నాడు. తనకు తెలిసిన విశేషం ఒకటి చెప్పాడు. హర్యానాకు చెందిన ఘాజీపూర్‌లో మహంత్ (మఠాధిపతి అధికారి; గురువు)వద్ద అపారంగా ధనం

వుంది. ఆయన యేదో దీర్ఘవ్యాధితో బాధపడుతున్న వృద్ధుడు. అతడేనిముషంలోనయినా మరణించనున్నాడు.

అలాంటి మహాంతునెవరూ హింసించనక్కరలేదు, దోచుకోను వద్దు. తనకు నమ్మకం కలిగించే శిష్యుడెవడయినా తారసపడితే తన అమూల్యసంపద నంతటినీ ఆ శిష్యుని కప్పగించి, హాయిగా కన్నుమూస్తానని ఆ మహాంతంటున్నాడు. అందువల్ల తమలో యెవరయినా కొద్దిరోజులు ఆ మఠంలో శిష్యుడుగా వుండడానికి సిద్ధపడితే చాలని ఖత్రీ చెప్పాడు.

ఆ మహాంతువద్ద శిష్యుడుగా వుండేవాడికి శాంతం,దయ, మమత, త్యాగశీలం, స్పష్టమైన ఉచ్చారణతో పూజామంత్రాలు వల్లించే శక్తి వుంటే చాలునన్నాడు. అలాంటి లక్షణాలన్నీ వున్నవాడు చంద్రశేఖరఆజాద్ ఒక్కడేనని అందరూ అన్నారు. అయితే-నటించి ఒక మతవిశ్వాసిని, ధర్మకర్తను మోసగించడం తన కిష్టంలేదని ఆజాద్ నిరాకరించాడు.

విప్లవసంస్థ పురోగమించాలన్నా, ఆశయలక్ష్యాలు సాధించాలన్నా సభ్యులు తమకిష్టంలేని పనులుకూడా కొన్ని చేయవలసి వుంటుందని; లక్ష్యసాధనకు యిదీ విద్యుక్తధర్మమేనని; ఆజాద్‌వంటి సర్వసేనాని వెనుకంజవేయడం తగదనీ సహచరులు వాదించారు. బిస్మిల్ కూడా అదేమాట అనడంవల్ల చంద్రశేఖర్ మెజారిటీ అభిప్రాయాన్ని పాటించక తప్పలేదు.

చంద్రశేఖర్ ముఖంలోని ప్రశాంతమయిన వర్చస్సు, వ్యవహారణలోని మార్దవం, కార్యాచరణలో చురుకుదనం ఆ మహాంత్‌ను ఆకర్షించాయి. అందువల్ల ఆయన అతన్ని మనస్ఫూర్తిగా ఆశీర్వదించి శిష్యుడుగా స్వీకరించాడు.

అయితే ఓ చిక్కుసమస్య యెదురయింది. ఆ మహాంతు సిఖ్ఖుమతానికి చెందిన పెద్ద. ఆ మఠంలో ఆ మతస్థుల పవిత్ర గ్రంథమైన "గురుగ్రంథసాహెబ్"ను పఠించడం శిష్యుని ప్రథమ కర్తవ్యం. అందుకు హిందీ, సంస్కృత భాషాజ్ఞానం చాలదు. గురుముఖిలిపి బాగా తెలిసి వుండాలి. ఏమయినా గురుముఖిలిపిని త్వరితంగా అవగాహన చేసుకోడానికి ఆజాద్ శతథా ప్రయత్నించసాగాడు.

ఆ మఠంలో అనుంగు శిష్యుడుగా నటించడం ఆజాద్‌కు చాలా కష్టంగా వుంటోంది. వివిధ భక్తులనుంచి అనేక విషాదకర వార్తలు తెలుస్తున్నాయి. బ్రిటిష్‌పాలకుల క్రూరకర్మలు అమాయక భారతప్రజలనెంతెంత కష్టాలు పెడుతున్నాయో తెలిసి ఆజాద్ హృదయం కోపాగ్నితో సలసలకాగుతోంది.

అధికార్లూ, పోలీసులూ, దళారీలూ ప్రజల్ని బాధలు పెట్టి దోచుకుంటుంటే-భారతమాత ఆ బిడ్డలకన్నీరు తుడవడానికయినా వీల్లేకుండా చేతులకు సంకెళ్ళుండి దీనంగాచూస్తున్నట్టు దర్శనం యిస్తోంది. చంద్రశేఖర ఆజాద్ ఆ మహాతల్లి సంకెళ్ళను ఎంత త్వరగా నరికి స్వాతంత్ర్యదేవిగా పూజిద్దామా అనే ఉద్రేకంతో పండ్ల పళ్ళుతొక్కుతున్నాడు. మనసులో ఇంతటి ఉద్వేగం బడబానలంలా ప్రజ్వరిల్లుతుంటే దయ, శాంతి, ఓర్పులను నటించాల్సిన మఠజీవితం అతనికి అడక త్తెరలో చిక్కుకున్నట్టుంది.

ఇక యీ నటన తనవల్ల సాధ్యంకాదని ఆజాద్ వ్యసనతరంగా ఆలోచిస్తున్నాడు. పైగా-రేపోమాపో చచ్చేట్టున్నాడనుకున్న మహాంతు ఇతడు వచ్చాక స్వస్థతచెంది రోజురోజుకూ ఆరోగ్యం పుంజుకుంటున్నాడు.

అంతేకాదు-ఉదయం లేవగానే వ్యాయామంచేసి, పాలు పళ్ళువంటి బలవర్ధకాహారం తీసుకుని అంతకంతకు బలిష్ఠుడవు తున్నాడు. "ఇక ఈ మహంతు చావడం యిప్పట్లో జరగ"దని ఆజాద్ నిర్ణయించుకున్నాడు. అలాంటప్పుడు తానిక్కడేవుండి విప్లవసంఘాన్ని అయోమయంలో వుంచడం తగదనికూడా అనుకున్నాడు. అంతే! ఎవరికీ చెప్పకుండా ఒకనాడు మఠం నుంచి బయలుదేరి ఆగ్రాలోని తమ కేంద్రానికి చేరుకున్నాడు.

ఈ చర్యలవల్ల మఠానికి చెందిన ధనరాసులు తమ విప్లవ సమితికి లభించే అవకాశంలేదని తేలింది. ఈ ధనసమస్యపై మళ్ళీ చర్చజరపక తప్పలేదు. ఎవరూ ఒకమంచిపథకాన్ని ప్రతిపాదించ లేకపోయారు.

ఈ సందర్భంలోనే రాంప్రసాద్ బిస్మిల్ అధ్యక్షతను విప్లవసంఘ కార్యకర్తలొకసారి కాశీలోసమావేశం జరిపారు. సంఘం అనుమతిలేకుండా ఆజాద్ ఆ ఘాజీపూర్ మఠంనుంచి వచ్చేవేయడం క్షమించరాని నేరం అని కొందరు వాదించారు. ఈ క్రమశిక్షణోల్లంఘనకు చంద్రశేఖర ఆజాద్‌ను కఠినంగా శిక్షించాలనే అభిప్రాయంకూడా వెల్లడయింది.

కాని-ఈ పథకానికి సర్వాధికారి అయిన రాంప్రసాద్ బిస్మిల్ ఆ విషయాన్ని ప్రస్తావించకుండా - మరొక సమస్యను చర్చకుపెట్టాడు. విప్లవసంఘం ఒక కరపత్రాన్ని ప్రచురించింది. అందులో తమసంస్థ ఆశయలక్ష్యాలూ, కార్యాచరణవిధానాలూ వివరించబడ్డాయి. దేశమాత దాస్యశృంఖలాల విచ్ఛిత్తికి

పౌరుషంగల ప్రతిభారతీయుడూ తమతోసహకరించాలనే విజ్ఞప్తి కూడా వుంది.

ఈ కరపత్రాల్ని దేశమంతటా, అన్నిపట్నాల్లోనూ యువజనాళికి అందేటట్లు, బహిరంగంగా అందరికీ తెలిసేటట్లు పంచే బాధ్యతను ఎవరు స్వీకరిస్తారో ముందుకు రావలసిందని రాంప్రసాద్ బిస్మిల్ ప్రకటించాడు. అయితే-ఏ పట్నంలోనైనా సరే ఒకేరోజున అనేకానేక ప్రాంతాల్లో ఒకేసారి వెల్లడి కావాలి.

ఆ సమావేశంలో అష్ఫాక్ ఉల్లాఖాన్, సచీంద్రనాధబక్షీ, ఆజాద్, మన్మధనాధగుప్తా, రాజేంద్రలాహిరీ ప్రభృతులుకూడా వున్నారు. కాని-ఏ ఒక్కరూ యీ రహస్య కరపత్రాల పంపిణీకి ముందుకు రాలేదు. బిస్మిల్ అందరిముఖాల్లోకీ ప్రశ్నార్ధకంగా చూడసాగాడు. చాలాసేపటివరకు ఎవరూ మారుపలకనేలేదు. సమావేశం నిశ్శబ్దాన్ని వరించినట్టుంది.

కొంతసేపటికి ఒక కార్యకర్త లేచాడు. "కమేండర్‌గా మీరు యెవరిని యీ పనికి నియోగిస్తే వారు త్రికరణశుద్ధిగా యీ కర్తవ్యాన్ని నిర్వర్తిస్తా" రన్నాడు. మిగిలిన సభికు లందరూ అది నిజమేనన్నారు. ఆజాద్‌మాత్రం అంతకుముందు అందరిదృష్టిలోనూ తానొక నేరస్తుడుగా వున్నందుననో ఏమో పెదవి విప్పలేదు.

రాంప్రసాద్ బిస్మిల్ మరొకసారి సభాసదులందరినీకళ్ళలో కళ్ళుగలిపి నిశితంగాపరిశీలించాడు. చివరికి "ఈ కర్తవ్యభారాన్ని నేను చంద్రశేఖర ఆజాద్‌కు అప్పగిస్తున్నా"నని గంభీరంగా

ప్రకటించాడు. అంతా వూపిరిపీల్చుకుని ఆజాద్‌వంక కుతూహలంతో చూడసాగారు.

శిక్షింపబడగలడనుకున్న ఆజాద్‌పైన బిస్మిల్‌కు అపారమయిన విశ్వాసం వుండబట్టే అతనీనిర్ణయం చేశాడని-నిజానికి చంద్రశేఖర్ అంతటి ధైర్యసాహస చాకచక్యాలు గలవాడేనని అందరూ మనఃపూర్వకంగా అనుకున్నారు. తనపట్ల యింతటి నమ్మకంవుంచి యీ బాధ్యతను కేటాయించి నందుకు చంద్రశేఖర్ తలవంచి రాంప్రసాద్ బిస్మిల్‌కు కృతజ్ఞతలు తెలియజేశాడు.

ఆ మర్నాడు పురజనులు మేలుకుని తమ తమ పనుల్లోకి మళ్ళేలోపునే - అందరికీ యెర్రరంగు కరపత్రాలు ప్రత్యక్షమయ్యాయి. స్కూళ్ళు, కాలేజీలు, హాస్టళ్ళు, గ్రంథాలయాలలో సరేసరి! ఎక్కడ చూచినా, ఏ నోటవిన్నా "హిందూస్తాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ ఆర్మీ" పేర్లూ, అది ప్రచురించిన కరపత్రం, అందలి విశేషాలే!

ఒకే రాత్రిలో కాశీపట్నం అంతటా మారుమూల కేంద్రాల (కూడలిస్థలాలు)లో కూడా విరివిగా-పోలీసుల కళ్ళబడకుండా దర్శనమిచ్చేట్టు ఏర్పాటు చేయగలిగిన కార్యకర్త సాహసాన్ని, చాకచక్యాన్ని ప్రజలు మనసారా మెచ్చుకోసాగారు.

"పరాయి పాలనను ఎదిరించడం భరతమాత బిడ్డలుగా పుట్టినవారి కనీసధర్మం. దేశదాస్య విముక్తికి సాయుధ విప్లవ పోరాటాలు జరపదలచిన మాకు మీ ఆశీస్సులూ సహకారం

యివ్వండి. మనగడ్డమీద పరప్రభుత్వం ఉండకుండా కూకటి వేళ్ళతోసహా పెకలించివేస్తాం. పూర్తిగా ప్రజాశ్రేయస్సుకోసం, సమధర్మ న్యాయస్థాపన కోసం ప్రజాప్రభుత్వాన్ని నెలకొల్పుతాం. ఒకర్ని మరొకరు దోచుకునే వీలులేని-ప్రతివ్యక్తికీ శ్రమకుతగ్గ ఫలితం లభిం చే వ్యవస్థను ఏర్పరచడం మా ముఖ్యాశయం. ఈ కృషికి ప్రజలందరూ సహకరించాలని విజ్ఞప్తి చేస్తున్నాం" అనే ధోరణిలో ఈ కరపత్రం అందరినీ ఆకట్టుకుంది.

ఆ తర్వాత ఒకే నిర్దిష్ట సమయంలో - ఒకేరోజున - అనేక పట్టణాలలో ఇవే కరపత్రాలు కోకొల్లలుగా ప్రత్యక్షమయ్యాయి. ఇందుకు పోలీసులూ, అధికారవర్గం కలవరపడ్డమే గాక-ఇటు విప్లవసంస్థ సభ్యులుకూడా ఆశ్చర్యచకితులయ్యారు. ఇంతటి అసాధారణ కార్యాన్ని సాధించగలిగిన చంద్రశేఖర ఆజాద్ సాహస సామర్థ్యాన్ని దళనాయకుడు రాంప్రసాద్ బిస్మిల్ కూడా బహుధా ప్రశంసించాడు. ఆనాటినుంచి విప్లవ కార్యకర్తల దృష్టిలో చంద్రశేఖర ఆజాద్‌పై వీసమెత్తు అన్యభావం లేకపోగా విశేష గౌరవాభిమానాలు పెరిగాయి.

ఈలోపుగా ఆజాద్ ప్రమేయం లేకుండా కొన్ని గ్రామాలలో దాడులు జరిగాయి. అయితే అలాంటి చర్యలవల్ల ఆశించినంత ఫలితం లేకపోయింది. ఒకప్పుడువారు అనుమానించినట్టుగా-విప్లవకారుల పేరుతో పల్లెప్రాంతాల జరిగిన దాడులపై ప్రజల వ్యాఖ్యానాలు అవమానకరంగాను, విప్లవవ్యతిరేకంగాను వినవచ్చాయి.

# కా కో రీ

ఈ సందర్భంలో గడచిన చారిత్రకాంశల్ని ఒకసారి మరి కొంచెం వెనక కాలంనుంచి తెలుసుకోవాలి.

బెంగాలు, బీహారు, ఉత్తరప్రదేశ్, మహారాష్ట్రలలో అక్కడక్కడా కొందరు అకళంక దేశభక్తులు, అకుంఠిత ధైర్య సాహసాలతో-ఒక్కరొక్కరుగానే మహత్తర విప్లవ చర్యలుతీసు కున్న ఉదాహరణలు కొన్ని వున్నాయ్. అక్కడక్కడా కొందరు ముష్కరులయిన తెల్ల అధికార్లపై తీవ్రచర్యలు జరపడంద్వారా విదేశీపాలనపై తమకుగల వైముఖ్యతను చాటడం జరిగింది.

అటువంటి యోధాగ్రగణ్యులలో మన్యవిప్లవకారుడుగా అభివర్ణించబడిన "ఆంధ్రశ్రీ" అల్లూరి సీతారామరాజు ముఖ్యుడు. ఆయన కేవలం ఆంధ్రుడవడంవల్ల - మనవాళ్ళకు చారిత్రక ప్రచారంపట్ల తగు జాగృతి లేకపోవడంవల్ల - దేశ విప్లవకారులచరిత్రలోసముచితస్థానం లభించలేదనిపిస్తుంది.ఆయన బ్రిటిష్ సామ్రాజ్యపాలక ప్రతినిధుల్ని, కఠోర చండశాసనుల్ని, భయంకర యమకింకర సమూహంవంటి తెల్లసైనికబలగాన్ని కూడా గడగడలాడించి 1922-24 మధ్యకాలంలో సువర్ణ చరిత్ర సృష్టించాడు.

ఆ కాలంలోనే విదేశాల్లోవున్న భారతీయ దేశభక్తులు

కొందరు విప్లవభావపూరితులై - మాతృభూమిపై గల విప్లవశక్తు లకు తగినసహాయ సంపత్తులందించడానికీ, ఇతరదేశాల్లో మన విప్లవపోరాటాలకు సానుభూతిని సాధించడానికీ కృషిచేశారు.

1925నాటికి ఉత్తరప్రదేశ్‌లో హిందూస్తాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ ఆర్మీ కార్యక్రమాలు విపులంగా వ్యాపించి,బలీయంగా నడుస్తున్నాయి. జర్మనీలోవున్న భారతీయులు పెద్దసంసంఖ్యలో తుపాకులు, పిస్తోళ్ళు సేకరించి ఒక ఓడలో ఈ ఆర్మీకిగాను మరొకపేరున పంపించారు.

అలా పంపినబంగీ జులై చివరికి కలకత్తా రేవుకు చేరగల దనీ, దానికి కొంతఖరీదు చెల్లించి తీసుకోవలసిందనీ రహస్య వర్తమానం అందింది. అయితే అందుకు చాలా డబ్బు చెల్లించాల్సి వుంటుంది. (గహస్యంగా చేరవలసినబంగీ కనుక ఓడ అధి కార్లు యెక్కువఛార్జీ వసూలుచేయడం సహజంగదా!) ఆ మొత్తం కోసమైనా తక్షణం ఏదో ఒక గట్టిప్రయత్నం చేయ వలసి వచ్చింది. ఈ బాధ్యతకూడా రాంప్రసాద్ బిస్మిల్ దే నన్నారు.

ఆ రోజుల్లో "ఎనిమిది డౌన్" అనే రైలులో వివిధ స్టేషన్లనుంచి ధనపు బంగీలు, పెట్టెలు లక్నోకు చేర్చబడేవి. ఒక రోజు రాత్రి ఆ ఖజానాతాలూకు మొత్తాన్ని కొల్లగొట్టాలని దళం అభిప్రాయపడింది.

ఈవిధంగా కొల్లగొట్టడాన్ని అష్ఫాక్ ఉల్లా మాత్రం వ్యతిరేకించాడు. ప్రభుత్వంమీద యుద్ధంచేసినట్లవుతుందనీ, విప్లవ సంస్థ సభ్యుల్ని ఏరివేస్తారేమోనని అతను జంకు వెల్లడించాడు.

ఆజాద్ ప్రభృతులు ఇలా భయపడితే అసలు విప్లవసంఘం వుండ వలసిన అవసరమే లేదని, ప్రభుత్వాన్ని సవాల్‌చేసి పోరాడ్డమే తమ ధ్యేయమని వాదించి నెగ్గారు.

మెజారిటీ నిర్ణయం ప్రకారం రైలును దోచుకునేందుకు రెండుమూడు పద్ధతులపై సమాలోచనలు జరిగాయి.

రైలు ఏదయినా చిన్నస్టేషన్‌లో ఆగినపుడు తమ బృందం ఆయుధాలతో దాడిచేసి కొల్లగొట్టడం ఒక పద్ధతి. అంత కంటె నడుస్తున్న రైల్లో సాధారణుల్లాగా ప్రయాణంచేస్తూ-నిర్జనప్రాంతంలో గొలుసులాగి ఆపాలి; వెంటనే ధైర్యసాహస చాకచక్యాలతో ధనపుసంచులు స్వాధీనంచేసుకుని తప్పుకొనడం మేలయిన పద్ధతని నిర్ణయించారు.

1925 ఆగష్టు 9వ తేదీన పదిమంది వీరులు ఈ పనిమీద బయలుదేరారు. నాయకుడైన రాంప్రసాద్ బిస్మిల్‌తోపాటు చంద్రశేఖర ఆజాద్, మన్మథనాథగుప్తా, శచీంద్రనాథబక్షీ, బన్వారీలాల్, రోషన్‌సింగ్, కేశవచక్రవర్తి, రాజేంద్రనాథ లాహిరీ, ముకుందలాల్ ముఖ్యులున్నారు.

ఆ రైలులో ప్రయాణంచేస్తున్న వీరుల్లో ఒకడు-రైలు షాజహాన్‌పూర్ స్టేషన్‌నుంచి బయలుదేరి కాకోరీప్రాంతం చేరు తూండగా ప్రమాదం సూచించే గొలుసును లాగాడు. రైలు వేగంతగ్గి ఆగుతూండగానే ఎవరి పెట్టెలోంచి వాళ్ళు కిందికి దూకి, ఆయుధాలతో ఇంజన్‌వేపు వేగంగా దూసుకువెళ్ళారు. అక్కడ వున్నగార్డు (అండర్‌గార్డు)ను బెదిరించి కిందికిదింపి యిద్దరు సభ్యుల్ని అతనికి కాపలాపెట్టారు. గాలిలోకి పిస్తోళ్ళు

చెప్పి అందర్నీ ఎవరిస్థానాల్లో వారు కదలకుండా వుండాలని హెచ్చరించారు.

కొందరు ఇంజన్‌వేపు వెళ్ళి డ్రయివర్‌ను నిలవరించగా, మరికొందరు వెనక్కు పరుగెత్తి గార్డును భయపెట్టి అదుపు చేశారు.

"ప్రయాణీకుల్ని కష్టనష్టాల పాల్జేయడం మా కిష్టం లేదు. ప్రభుత్వధనాన్ని దోచుకుపోవడమే మా లక్ష్యం. కనుక యెవరూ తమ స్థానాలనుంచి కదిలేసాహసంచేసి మా దెబ్బలకు గురికావద్దని హెచ్చరిస్తున్నాం. మా కార్యక్రమానికి విఘ్నం కలిగించేవారిని నిర్దాక్షిణ్యంగా కాల్చివేస్తాం" అని ప్రకటించారు.

ఇంతలోనే కొందరు గార్డుపెట్టెలోవున్న ఇనుపపెట్టెల్ని బయటికి లాగారు. సుత్తులతో తాళాలూ, గొలుసులూ విడగొట్టేశారు. డబ్బును సంచుల్లో నింపుకున్నారు. ఆ మరుక్షణం-బిస్మిల్ ముందుగా నిర్ణయించిన ప్రకారం చిన్న చిన్న జట్లుగా విడిపోయి కలుసుకోవలసిన ప్రదేశానికి చడీచప్పుడూ తెలియకుండా వెళ్ళిపోయారు.

ఆ రైల్లో ప్రభుత్వ ఆస్తుల రక్షణకోసం అయిదుగురు సాయుధభటులూ, ఒక తెల్ల సార్జెంటూ ఉన్నా-ప్రాణభయంతో దాక్కున్నారేగాని తమ బాధ్యతా నిర్వహణకు సాహసించలేదు. ఆ విధంగా విప్లవబృందం అనుకున్నది సాధించి-వీరోచితంగా దోపిడీచేసి, మరెవరికీ అంతుతెలియకుండా ఉడాయించారు.

ఆ మర్నాడు "ఇండియన్ డెయిలీ టెలిగ్రాఫ్" పత్రిక ఈ లూటీవార్తను "కాకోరీవద్ద భయానకమైన దోపిడీ" అనే

పత్రిక శీర్షిక క్రింద ప్రకటించింది. ఈ చర్య ప్రభుత్వానికొక సవాలువంటిదని ప్రచారం జరిగింది. అందువల్ల ఈ సంఘటనతో సంబంధంవున్నదని అనుమానించదగ్గ వ్యక్తులకోసం గూఢ చారులు దేశమంతటా గాలించసాగారు.

ఈ సాహసికచర్య జరిపినవారెవరూ పోలీసులకు చిక్క కుండా, తలకోదారిని దూరప్రాంతాలకు తప్పుకున్నారు. గూఢ చారుల అన్వేషణ చాలాకాలంవరకూ ఫలించలేదు. కాని- ఆజాద్ ఆధ్వర్యానగల బృందమే యింతటి ధైర్యసాహసాలు చూపి వుంటుందని ప్రభుత్వం అనుమానించింది. తమ ఆఫీసర్లకు తెలిసిన "విప్లవకారులనుకునే" కొందరు ముఖ్యుల ఫోటోలను పోలీసుస్టేషన్‌లలో, ప్రజలుకూడే ప్రదేశాలలో విరివిగా అంటిం చారు. వాళ్ళను పట్టుకోడానికి తోడ్పడే వాళ్ళకు గొప్పబహు మతులిస్తామనికూడా ప్రకటించారు.

విప్లవకారుల్లో చాలామంది ఎవరికీ కనిపించని రహస్య జీవనం ప్రారంభించారు (అండర్ గ్రౌండ్). పోలీసులు వేవిధాల గాలిస్తూ విప్లవసంస్థల కేంద్రాలున్నవనే ఇళ్ళను చక్ర బంధాల్లో బిగిస్తున్నారు. పరిస్థితులు చాలా విషమిస్తున్నాయని గుర్తించగానే చంద్రశేఖర్ తన స్వగ్రామం వెళుతున్నానని మిత్రులతో చెప్పి బయలుదేరాడు. కాని - అతను మళ్ళీ "భాంవరా" వెళ్ళడం తగదని నిర్ణయించుకుని చాటుమాటుగా కాశీపట్నం చేరుకున్నాడు.

1925 సెప్టెంబర్ 26వ తేదీన ఉత్తరప్రదేశ్‌లో అనేక మందిని అరెస్టుచేశారు. కాకోరీకేసుతో సంబంధంవున్నదని అను

మానించిన యువకులెందరినో బంధించినా-ఆజాద్, అతని అనుచరులూ మాత్రం చిక్కలేదు. వాళ్ళకోసం అతిజాగ్రత్తగా వెదకడమేగాక-వారి ఫోటోలను పోలీసుస్టేషన్‌లలో, కూడలి స్థలాలలో ప్రదర్శించారు. కాని-ఆజాద్ యెవరి అంచనాకూ అందడంలేదు.

కాశీలో అతనికోసం పోలీసులు వేటకుక్కల్లా గాలించడం ఎక్కువైనందువల్ల చంద్రశేఖర్ అతిరహస్యంగా బయలుదేరి ఝూన్సీపట్నం చేరుకున్నాడు. మాష్టర్ రుద్రనారాయణసింగ్ యింట విడిదిచేశాడు. ఆ రోజుల్లో ఆయిల్లు రకరకాల కళాకారులూ, వ్యాయామ క్రీడాకారులూ, విప్లవకారులకు కూడా నిలయంగా వుండేది.

మాష్టర్ రుద్రనారాయణసింగ్ ఒక జాతీయ విద్యాలయంలో డ్రాయింగ్ టీచర్. అలాంటి మంచివానికి ఏ యిబ్బందీ కలగకుండా, తాను పోలీసుల కంటబడకుండా జాగ్రత్తపడడానికి ఆజాద్ చాలా అవస్థపడేవాడు. ఒకోసారి ఆ యింటినివదిలి నగరంబయట అడవిలో కొంతకాలం దాక్కోవలసి వచ్చేది. కొంతకాలం హరిశంకర్ బ్రహ్మచారి అనే పేరున సాధువు వేషంతో ఓర్ఛా అడవుల్లోనూ, సాతార్ నదీతీరంలోనూ గడిపాడు.

సాధువుగా వున్నపుడు నిర్జనప్రాంతాల్లోను, క్రూర మృగాలుండే అడవుల్లోను తిరగడం ఆజాద్‌కు కొంతహాయిగానే వుండేది. కాని-ఆ మాత్రం స్వేచ్ఛావిహారంకూడా యెక్కువ కాలం కొనసాగలేదు. పోలీసులు యీ అడవిప్రాంతాల్లోకూడా తరచుగా గాలిస్తున్నారని తెలిసింది.

ఈసారి చంద్రశేఖర్ వేషాన్ని మురికిగుడ్డలతో మార్చుకుని ఒక మోటారు డ్రయివర్ వద్ద సహాయకుడుగా చేరాడు. క్లీనింగ్ పనులుచేస్తూ, అతనిచ్చింది తింటూ, కారుషెడ్డులో పడుకుంటూ - క్రమంగా మోటారు డ్రైవింగ్ కూడా నేర్చుకున్నాడు.

ఝాన్సీలో పోలీసులు వేయికళ్ళతో ఆజాద్ కోసం వెదుకుతూనేవున్నా - అతను మోటార్ క్లీనర్ గా వుండడంవల్ల ఎవరూ అనుమానించలేదు. ఈవిధంగా కొంతకాలం హాయిగానే గడచినా అతనికి తృప్తిలేకపోయింది.

కాకోరీ రైలుదోపిడీవల్ల అధికధనం లభించినా దాన్ని పథకం ప్రకారం విప్లవకార్య ప్రగతికి వినియోగించే అవకాశం లేకపోయింది. ముఖ్యనాయకులంతా ప్రాణాలు అరచేతపట్టుకుని పుట్టకొకరు గుట్టకొకరుగా చెల్లాచెదరై వుండవలసి వచ్చింది. అందువల్ల విప్లవసంస్థ కార్యక్రమాలు అయోమయస్థితిలో పడ్డాయి. ఈ స్తబ్ధతను పోగొట్టి మళ్ళీ అందర్నీ సంఘటితపరచి, చురుకుగా అభివృద్ధిచెయ్యాలనే తపనతో ఆజాద్ వేగిపోతున్నాడు.

ప్రభుత్వ నిర్బంధాలవల్ల, పోలీసుల కఠినచర్యలవల్ల కొందరు విప్లవకారులూ, సానుభూతిపరులూ తమకు తెలిసిన వారి ఆనుపానులు వెల్లడించారని, చిత్రహింసలకు గురైన కొందరు ఆయుధాగారాల ఆచూకీకూడా చెప్పివేశారని తెలిసింది. ఝాన్సీలోవుండి పరిసరాల విప్లవకారుల్ని సమీకరించడం దుస్తరంగా తోచింది. అందువల్ల చంద్రశేఖర్ బొంబాయికి మకాం మార్చాడు.

తన ఫోటో దేశంలో పోలీసులందరికీ గుర్తుండేటంత ప్రచారం జరగడంవల్ల-ఆజాద్ యెక్కడైనా అతిజాగ్రత్తగా, గోప్యంగా మెలగవలసిందే! బొంబాయి ఓడరేవులో బరువులు మోసే కూలీగా కుదురుకున్న ఆజాద్ కొంతకాలం మరో వ్యాపకంగాని, చరిత్రగాని ఏమీలేనట్టే ప్రవర్తించాడు.

పగలంతా బండచాకిరీ చేసేవాడు. ఏ చౌకబారు హోటల్లోనో యింత తిని, అర్ధరాత్రివరకూ సినిమాలు చూచి, ఏ గిడ్డంగిలోనో నిద్రపోయేవాడు. చదువుసంధ్యలు, నోరూ వాయీ లేని మోటుకూలీయేనని అందరూ అనుకునేట్టు ప్రవర్తించేవాడు.

ఈ విధంగా చంద్రశేఖర్ ఆజాద్ బొంబాయిలో రెండేళ్ళు గడిపేసరికి-కాకోరి సంఘటన పరిణామాలు చాలా జరిగాయి. ఆ రైలుదోపిడీలో పాల్గొన్నవారు పదిమందే అయినా అది ప్రభుత్వాన్ని కూలదోసే రాజకీయ కుట్ర అంటూ 24 మందిపై లక్నోలో కేసుపెట్టారు.

దేశమంతటా ప్రసిద్ధమై చరిత్రకెక్కిన ఈ కేసు విచారణ పద్దెనిమిది నెలలపాటు జరిగింది. ముద్దాయిల్లో ముఖ్యులయిన చంద్రశేఖర్, అష్ఫాక్ ఉల్లా, బక్షీలు ప్రభుత్వానికి దొరకలేదు. కొందరికి అనారోగ్య కారణంగా విడుదల లభించింది. తక్కిన వారిమీద క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ సెక్షన్ 121 (చక్రవర్తికి వ్యతిరేకంగాయుద్ధ ప్రకటన) 120 ఎ. (రాజకీయకుట్ర) 369 (హింసాత్మకంగా దోపిడీలు) 302 (హత్యలు)లకింద నేరారోపణలు జరిగాయి. ఈ అభియోగాల విచారణకు ఆ రోజుల్లోనే పది

లక్షలరూపాయలు ప్రభుత్వం ఖర్చుచేయవలసి వచ్చింది. ప్రభుత్వం వాదం చేసే వకీలు ఒకరికి రోజుకు 500 రూపాయలఫీజు చెల్లించే వారట! ముద్దాయిల తరఫున జాతీయనాయకులు కొందరు ఉచితంగా వాదించారు.

ఎవరెన్నివిధాల వాదించినా, జాతిమొత్తం తమయువక వీరుల్ని కాపాడవలసిందని దేవుళ్ళకు మొక్కుకున్నా - మిగిలిన నిందితులు శిక్షలనుభవించక తప్పలేదు. కోటిప్రజల కన్నీరు తుడవడానికి, దేశమాత దాస్యశృంఖలాల్ని ఛేదించడానికి అత్యంత సాహసంతో కృషిచేసిన వీరకిశోరాలకు శిక్షలాయని భారతీయులు విస్తుపోయారు.

రాంప్రసాద్ బిస్మిల్, రాజేంద్రనాథలాహిరీ, రోషన్ సింగ్, అష్ఫాక్ ఉల్లాఖాన్‌లకు ఉరిశిక్షలు పడ్డాయి. శచీంద్రనాథ సన్యాల్ కుద్వీపాంతరవాసం మన్మథనాథగుప్తాకు పధ్నాలుగేళ్ళ కఠిన కారాగారవాసం విధించారు. యోగేశచంద్రచటర్జీ ముకుందలాల్, గోవిందచరణ్ కర్, రాజకుమార్ సింగ్, రామ కృష్ణ ఖత్రీలకు తలకోపదేండ్లు శిక్ష; భూపేంద్రనాథ సన్యాల్, రాందులారీత్రివేది, ప్రేమకృష్ణ ఖన్నాలకు అయిదేసేళ్ళు, విష్ణుశరణ డుబ్లిష్, సురేశచంద్ర భట్టాచార్యలకు తలొక ఏడేళ్ళజైలుశిక్షలు విధించారు.

ఈ కుట్రకేసు విచారణ సమయంలోనే మిత్రుల్ని విడి పించుకోవాలని ఇతర విప్లవకారులుచేసిన ప్రయత్నాలుకూడా ఫలించలేదు. మరణశిక్షలు విధించబడినవారిని ఉరికంబాలెక్కించే తేదీలుకూడా దగ్గరపడ్డాయి.

ఈ సమాచారం దేశప్రజలందరిలో విపరీత సంచలనం కలి

గించింది. దశదిశలా ఉద్వేగావేశపూరిత చర్చలు చెలరేగాయి. సభలూ సమావేశాలూ విరివిగాజరిపి ప్రభుత్వం ముక్కుపచ్చ లారని యువకులపై కఠసాధించే శిక్షలు అమలుజరపరాదనే తీర్మానాలు చేశారు.

ఈ ఉరిశిక్షల అమలును రద్దుచెయ్యాలని కోరుతూ కేంద్ర (ఢిల్లీ)శాసనసభకు విజ్ఞప్తులు విరివిగా అందించారు. కేంద్ర శాసనసభాసభ్యులు పెక్కుమంది సంతకాలు చేసిన వినతిపత్రం ఒకటి వైస్రాయికి సమర్పించబడింది. ఈ ప్రజావ్యతిరేకతను గుర్తించినట్టుగా వైస్రాయి ఉరిశిక్షల అమలును రెండుసార్లు వాదాయివేశాడు.

అందువల్ల ఈ ఉరిశిక్షలు రద్దుకాగలవనే ఆశలు ప్రజలలో చిగురించాయి. కాని-అధికార మదోన్మత్తులూ, కఠినచిత్తులూ అయిన బ్రిటిష్‌పాలకులు ప్రజావాణిని పెడచెవినిపెట్టడానికే నిర్ణయించారు. రవి యస్తమించని సామ్రాజ్యంగా పేరొందిన బ్రిటన్ అధికారాన్నే సవాల్‌చేసిన కుట్రదారుల చర్యలకు ప్రతీకారం చెయ్యవలసిందేనని భావించారు.

1927 డిశంబరు 17, 19 తేదీలు భారతదేశచరిత్రలో బ్రిటిష్‌వారి అతిదారుణ క్రూర జుగుప్సాకర పాశవికచర్యలకు గుర్తుగా పంకిలమయ్యాయి. 17వ తేదీన గోండాజైలులో విప్లవ యోధాగ్రణి రాజేంద్రలాహిరీ ఉరితీయబడ్డాడు.

అంతకు కొద్దిరోజులముందు లాహిరి తనమిత్రుడొకడికి ఈ విధంగా అంతిమలేఖ వ్రాశాడు: "దేశమాత శృంఖలాల విచ్ఛిత్తికోసం బలిపీఠం సింగారించబడ్డానికి మారక్తం వినియోగ పడుతుంది. నిజానికి మృత్యువంటే జీవితానికి మరో అంచు

మాత్రమేగాని, భయంకరంకాదు, అన్యభావం కూడదు. ఈ చరిత్ర ఏదో ఒకరోజు మంచిమలుపు తిరిగి తీరుతుంది. అలాంటి మలుపుకోసం జరిగే యజ్ఞంలో సమిధల్లా ఉపయోగపడుతున్న మా ప్రాణార్పణలు వృథాకాబోవు. దేశీయులకు అంతిమ ప్రణామాలర్పిస్తూ శెలవుతీసుకుంటున్నాను."

స్వాతంత్ర్య సమరచరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడే యీ లేఖ విశేషాలు తెలిసి సంచలించని భారతీయుల్లు లేరు!

మిగతాముగ్గురు విప్లవవీరుల్ని డిశంబరు 19వ తేదీనవేర్వేరు జైళ్ళలో ఉరితీశారు. గోరఖ్‌పూర్ చెరసాలలో ఉరికంబమెక్కిన రాంప్రసాద్ బిస్మిల్ ముఖంలో విచారంగాక సంతోషం వెల్లివిరిసిందట. అతను తనతల్లికి చివరిలేఖవ్రాస్తూ దేశస్థులందరికీవిప్లవంవర్ధిల్లజేసి స్వతంత్రజీవనం సాధించండని విజ్ఞప్తిచేసి వీడ్కోలు తీసుకున్నాడు. ఉత్సాహంతో ఉరకలువేస్తూ ఉరికంబమెక్కే బిస్మిల్ "వందేమాతరం"...."భారత్‌మాతాకుజై" అని నినదించాడు.

అలహాబాద్‌జైల్లో రోషన్‌సింగ్ బలిదానం జరిగింది. అష్ఫాక్ ఉల్లాఖాన్‌ను ఫైజాబాద్‌లో ఉరితీయగా అతని సోదరుడు రియాసతుల్లా-ఆ వీరుని శవాన్ని అత్యక్రియలకోసం తమవూరికి తీసుకెళ్ళాడు.

రైల్లో ఒక గూడ్స్‌పెట్టెలోవుంచబడిన అష్ఫాక్‌శవాన్ని చూడ్డానికి "బాలామావూ" రైలుస్టేషన్‌లో సూటూ బూటూ హేటూ ధరించిన ఒక యువకుడు లోపలికెక్కాడు. ఆ మృత

వీరునికి అంతిమసందన చెయ్యాలంటే రియాసతుల్లా శవం ముఖంమీది వస్త్రాచ్ఛాదనను తొలగించాడు.

ఆ వచ్చినవ్యక్తి టోపీతీసి మూడుసార్లు వినయంగా వంగి అభివందనాలర్పించాడు. చివరికి కట్టలు తెంచుకుంటున్న కన్నీటిని తుడుచుకుంటూ అతను వెనుదిరిగి రైలుదిగి వెళ్ళిపోయాడు. అతను చంద్రశేఖర ఆజాద్ అని ఆ తర్వాత వెల్లడయింది.

# లాలాజీ

మొదటి ప్రపంచయుద్ధకాలంలో బ్రిటిష్ ప్రభుత్వానికి సాయపడితే భారతీయులకు కొన్ని స్వతంత్రాధికారాలు ఇస్తామని గాంధీజీకిచ్చిన వాగ్దానం సంగతి భారతీయులందరికీ తెలిసిందే.

"భారతదేశంలోని పరిస్థితులను పరిశీలించి, అవసరమైన సూచనలు చేసేందుకు ఒక ఉన్నతాధికార సంఘాన్ని పంపనున్నాం" అంటూ బ్రిటిష్ ప్రభుత్వం లండన్లో ప్రకటించింది.

అలా పంపుతున్న సంఘంలో అందరూ ఆంగ్లేయులే గాని-భారతీయప్రతినిధులు లేకపోవడం మననాయకులకు రుచించ లేదు. ఈ కమిటీ రాకవల్ల భారతదేశానికి యెలాంటి మేలూ జరుగబోదని ముఖ్యనాయకులు విమర్శించారు. "సైమన్" దొర ఆధ్వర్యాన వస్తున్న యీ కమిటీని బహిష్కరించాలని, ఎవరూ

సహాకరించరాదని, అన్నిచోట్లా నిరసన వెల్లడించాలనీ ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

సైమన్ కమిషన్ భారతదేశంలో అడుగుపెట్టినప్పట్నుంచీ నల్లజెండాలతో, "గోబ్యాక్ సైమన్" నినాదాలతో భారతీయుల నిరసన వ్యక్తమయింది. ప్రతిచోటా ప్రభుత్వం అనేక భద్రతాచర్యలు తీసుకున్నా ప్రజావెల్లువముందు అవి గడ్డిపరకల్లా ఎగిరిపోయాయి.

మద్రాసులో ప్రజల నిరసనోద్యమం మరింత బలిష్ఠంగా వెల్లడయింది. టంగుటూరి ప్రకాశం పంతులు ఆధ్వారాన జనం సముద్రకెరటాల్లా కదిలి మౌంట్‌రోడ్ (నేటి అన్నాసాలై)ను ముంచివేస్తూ రాష్ట్ర సచివాలయాలున్నకోట "ఫోర్ట్ సెంట్ జార్జ్" వేపు ఉప్పెనలా కదిలింది.

సైమన్ సంఘసభ్యులు అభిప్రాయసేకరణ జరుపుతున్న కోటవద్ద గల్లంతు జరక్కుండా ప్రభుత్వసాయుధపోలీసులేగాక-సైనిక దళాలుకూడా అటునుంచి మౌంట్‌రోడ్‌వేపు ప్రజల నడ్డగించే గోడలాగా ఎదురు వచ్చాయి.

ప్రకాశం ఆధ్వర్యాన కదంతొక్కుతూ "గోబ్యాక్ సైమన్" నినాదపదాలు పాడుతూ సాగిపోతున్న జనవాహిని ఐలండ్ గ్రౌండ్స్‌మధ్య కురుక్షేత్రయుద్ధానికి నాందీప్రస్తావన చేసేట్టు తోచింది. ప్రజల ధైర్యాన్ని తన మనోబలంగా చేసుకున్న ప్రకాశం అందరికంటెముందు నడుస్తున్నాడు. తెల్ల సార్జెంట్ ఆధ్వర్యంలో ఆయుధాలుదూసి మీదికివస్తున్న దళాన్ని ప్రకాశం ఎదిరించాడు.

చొక్కాగుండీలు తొలగించి "రండిరా - దమ్ములుంటే

నన్ను కాల్చండిరా" అని గర్జిస్తూ తన ఎదరొమ్ము చూపించి ముష్కరాధికార బలాన్ని సవాల్ చేశాడు. ప్రజానీకం నల్ల జెండాలతో "గోబ్యాక్ సైమన్" అని నినదించి భూనభోంత రాళాలు దద్దరిల్ల జేశాయి. ప్రకాశంగార్ని "ఆంధ్రకేసరి... జిందాబాద్" అంటూ ప్రశంసించి, అదేక్షణంలో బిరుదుప్రదానం చేశాయి.

ఆంధ్రకేసరి గర్జన, ప్రజల వెల్లువలు చూచిన తెల్ల సాయుధబలాలు తెల్ల మొహాలువేసి వెనక్కు జంకక తప్పలేదు. మరువరాని చరిత్ర సృష్టించబడింది.

అదేవిధంగా లాహోర్ పట్నానికి సైమన్ కమిషన్ వచ్చినప్పుడు లజపతిరాయ్ నిరసన ప్రదర్శనలకు ఆధ్వర్యం వహించి మరో సంచలనాత్మక చరిత్ర సృష్టించారు.

ఆయన అప్పటికే పంజాబ్ రాష్ట్ర వాసులకు "లాలా"గా భారతీయులకు "పంజాబ్ కేసరి"గా ప్రసిద్ధుడైన నాయకుడు, పత్రికల సంచాలకుడు, వయోవృద్ధుడు. గాంధీజీకంటె ముందు ప్రసిద్ధులైన దేశనాయకత్రయం-లాల్, బాల్, పాల్ లలో లజపతి రాయ్ ఒకడు.

సైమన్ కమిషన్‌కు నిరసన తెలిపే కార్యక్రమాలకు అప్పటికే తెరవెనుకవుండి విప్లవపంథా చేపట్టిన భగత్సింగ్ ప్రభృత యువకులు విశేషకృషిచేసి లాలాజీ ఆధ్వర్యాన ప్రజల్ని ముందుకు నడిపించడంలో ప్రముఖపాత్ర వహించారు.

సైమన్ సంఘసభ్యులు అట్టహాసంగా రైలుస్టేషన్‌లో దిగి రాజలాంఛన మర్యాదలతో ముందుకు నడిచీ నడవకముందే

ప్రజావెల్లువ నల్ల జెండాలతో చుట్టుముట్టింది. "గో బ్యాక్" సైమన్" నినాదాలు మిన్నుముట్టాయి.

గౌరవాభివ దనాల సమర్పణకూ, భద్రతా చర్యలకూ విపరీత సంఖ్యలో చేరివున్న పోలీసు, సైనికదళాలు పరిస్థితి విష మించి సైమన్‌కమిటీ సభ్యులకు ప్రమాదం జరిగేట్టుందని భావించి-ప్రజలపై లాఠీఛార్జి జరపసాగారు. ప్రజాసందోహం జంకకుండా ముందుకే తోసుకుపోతోంది.

సైర్వైవిహారానికి అనుమతి లభించిన ప్రభుత్వబలగాలు లాఠీలతో మోది అనేకమంది తలల్ని పగలగొడుతున్నారు. అయినా స్వచ్ఛంద సైనికులు "సైమన్ వెనక్కి-పో" అని నిన దిస్తూ విజృంభిస్తున్నారు.

లాఠీఛార్జిలో అనేకమంది యువకుల తలలుచిట్లి రక్తం జలజలకారసాగింది. అనేకమంది చేతులూ, భుజాలూ విరిగి పోయాయి. దెబ్బదెబ్బకీ ప్రజల ఉద్రేకం మరింతరెచ్చిపోతోంది. అది గమనించినపోలీసు అధికారి (తెల్లవాడు) ఒకడు ఆవేశంతో ముందుకువచ్చాడు. తానొక లాఠీతీసుకుని - ఈ ప్రజలకు నాయ కత్వం వహించి ముందుకువస్తున్న లజపతిరాయ్‌ని గురిచూచినట్టు కొట్టాడు. దెబ్బమీద దెబ్బవేస్తున్న అతనిబారినుండి తమ లాలాను రక్షించుకోడానికి భగత్‌సింగ్ అనుయాయులు కొందరు దూసుకువచ్చి లజపతిరాయచుట్టు వలయంగా అడ్డుగోడగానిలచి దెబ్బలుతిన్నారు. ఆ అధికారీ, సైనికులూ విసిరే లాఠీలకు జంక కుండా లజపతిరాయ్‌ని కాపాడ్డమే ప్రాణాధికంగా వ్యవహ రించారు.

అప్పటికే తగిలిన లాఠీదెబ్బలు చాలాబలమైనవి కావడం

వల్ల "వందేమాతరం....గోబ్యాక్" అని నినదిస్తున్న లాలా తల నుండి, భుజంనుండి రక్తం వలవలకారసాగింది. ఆయన తూలి పడిపోబోతున్నాడు. ఇది గమనించిన యువబృందం ఆయన్ని గట్టిగా పట్టుకుని అవతలికి నడిపించసాగింది.

రక్తం విపరీతంగా కారుతూ బలహీనంగా నినాదాలిస్తున్న లజపతిరాయ్‌ని వెంటనే ఆస్పత్రికి చేర్చాల్సి వచ్చింది. ఉద్యమ నిర్వాహకులు ఈ ఆందోళనలో, ఏర్పాట్లలో వుండగా ప్రభుత్వాధికార్లు సైమన్ కమిషన్ సభ్యుల్ని మరొకదారికి మళ్ళించి, మరెక్కడికో తీసుకువెళ్ళి - వారి ఉనికి ప్రజలకు తెలియకుండా చేశారు.

లాలాలజపతిరాయ్ ఆరోగ్యం ఆందోళనకరంగా వున్నందువల్ల ప్రజలదృష్టి అటుమళ్ళింది. భగత్సింగ్ బృందానికిమాత్రం- ప్రభుత్వాధికార్లపై కోపావేశాలు రేగిపోతున్నాయి. అదను చూచి దెబ్బతియ్యాలనే సంకల్పంతో వారు అశాంతితో కాలం గడుపుతున్నారు.

పంజాబ్ కేసరి గాయాలు మానుపడుతున్నాయి. ఆయన స్వస్థుడైనట్లేనని అందరూ సంతోషిస్తున్నారు. కాని లాలా పూర్తిగా కోలుకోలేదని ఎవరూ అనుమానించలేదు. ఆయన కూడా భగత్సింగ్ ప్రభృత యువకులమాటల ప్రకారం వెంటనే బహిరంగసభ జరిపి ప్రజలలో ధైర్యసాహసాల్ని ప్రేరేపించక పోతే-పిరికిబారిపోతారని భావించాడు.

అందువల్ల వెంటనే బహిరంగసభ ఏర్పాటయింది. ప్రజలు ఇరుగుపొరుగు గ్రామాలనుంచికూడా తిరునాళ్ళకు వచ్చినట్లు

అధికాధికంగా వచ్చారు. లజపతిరాయ్ తన అశక్తతను మరచి, అహమికతో ఆస్పత్రినుంచి బయలుదేరి బహిరంగసభకు హాజరై ప్రసంగించాడు.

"గౌరవమర్యాదలు తెలిసిన ప్రభుత్వం ఏదీకూడా నిరాయుధులయిన ప్రజానీకంమీద అమానుషంగా దాడిచెయ్యదు. బ్రిటిష్ ప్రభుత్వం తన నిరంకుశాధికారాన్ని భారతదేశంలో యింకా యెక్కువకాలం నిలబెట్టుకోలేదు. నామీదపడిన ప్రతి ఒక్క-లాఠీదెబ్బ-బ్రిటిష్ ప్రభుత్వ శవపేటికపై ఒక్కొక్క మేకుగా దిగబడక తప్పదు" అని లజపతిరాయ్ గర్జించేసరికి ప్రజలు పెద్దపెట్టున హర్షధ్వానాలుచేశారు. ఈ బహిరంగసభ పంజాబీయుల్నేగాక దేశంలో అందర్నీ ప్రభావితుల్ని చేసింది. సాయుధులయిన ప్రభుత్వ బలాల్ని ఎదిరించడానికి మనోధైర్యం, ధర్మపక్షం ముఖ్యమని సామాన్యులుకూడా విశ్వసించారు.

ప్రజలనెంతో ఉత్తేజపరచి తనలక్ష్యాన్ని నెరవేర్చుకున్న పంజాబుకేసరి లాలాలజపతిరాయ్-ఆనాటి లాఠీదెబ్బలు లోలోపల కలిగించిన గాయాలు నయంకాక, వాటివల్లనే 1928 నవంబరు 17వతేదీన మరణించారు.

లాలామరణవార్తవిని దేశమంతా ఉద్రేకంతో ఉడికిపోయింది. భగత్సింగ్ ప్రభృతులు కొంతకాలంగా వ్యవస్థీకరించిన విప్లవసంఘ సభ్యులు అప్పుడు చాలావరకు లాహోర్లోనే వున్నారు. ఆ కార్యకర్తలందరూ సమావేశమై లాలాజీ మృతికి ప్రతీకారం చెయ్యడానికి తీర్మానించారు.

లాఠీఛార్జి జరిపించిన అధికారుల్లో ముఖ్యుడు, స్వయంగా

లాలాజీని కొట్టిన పోలీస్ ఆఫీసర్ "సాండర్స్" అనేవాడేనని తేల్చుకున్నారు. ఆ సాండర్స్ రక్తంతో లజపతిరాయ్ ఆత్మకు తర్పణం చేసిగాని విశ్రమించరాదని శపథంచేశారు. ఈ గురుతర బాధ్యతను భగత్‌సింగ్, చంద్రశేఖర ఆజాద్, రాజగురు, జయ గోపాల్ నిర్వహించాలని నిర్ణయించారు. వాళ్లు ఓ పథకం రచించుకున్నారు.

ఆజాద్ తన పిస్తోలును సరిచేసుకుని, రవ్వలు (మందు గుళ్ళు) నింపుకుని, జేబులో పెట్టుకున్నాడు. భగత్సింగ్ కూడా అలాగే సిద్ధమయ్యాడు.ఇద్దరూ సైకిళ్ళువేసుకుని డి.ఎ.వి.కాలేజీ వేపు వెళ్ళారు. పథకం ప్రకారం జయగోపాల్ అప్పటికే అవతలి పోలీస్‌స్టేషన్‌కు ఎదురుగా-తనసైకిల్ చెడిపోయినట్లు, దాన్ని సరిజేసుకోజూస్తున్నట్లు నటిస్తూ సాండర్స్ ఎప్పుడు మోటార్ సైకిల్ మీద బయలుదేరతాడో గమనిస్తున్నాడు.

సాండర్స్ మధ్యాహ్న భోజనానికి తన ఎర్రరంగు మోటార్ సైకిల్ మీద ప్రతిరోజూ ఒకేసైముకివెళతాడని వారికి తెలుసు. ఆజాద్, భగత్‌సింగ్, రాజగురు నిర్ణీతస్థలాల్లో వేచి వున్నారు. జయగోపాల్ - ఎర్రవాహనంమీద డి. ఎస్. పి. సాండర్స్ బయలుదేరగానే నాయకులకు తెలిసే సైగచేశాడు.

ఆ సంకేతాన్ని చూడగానే భగత్సింగ్, రాజగురు కాలేజిగేటువైపు పరుగెత్తారు. ఆజాద్ చుట్టుప్రక్కలనుంచి ప్రమాదం ముంచుకురాకుండా పర్యవేక్షిస్తున్నాడు.

సాండర్స్ వాహనం డి. ఎ. వి. కాలేజిగేటుకు సూటిగా రాగానే రాజగురు పిస్తోలు పేల్చాడు. గుండు తలకు తగిలేసరికి సాండర్స్ తన మోటార్‌సైకిల్‌తోసహా రోడ్డుమీద పడి

పోయాడు. అప్పుడే భగత్సింగ్ కూడా పిస్తోలుపేల్చి సాండర్స్ తలను, భుజాల్ని తూట్లుపడజేశాడు.

తమ డి. ఎస్. పి. గారు బయలుదేరగానే పిస్తోళ్ళు పేలి నందువల్ల పోలీస్ స్టేషన్‌లోని పోలీసులు ఆందోళనతో యిటు చూచారు. రక్తసిక్తమైన కాళ్ళు, చేతులూ కొట్టుకుంటున్న సాండర్స్‌ను చూచి హాహాకారాలుచేస్తూ బయటికి పరుగెత్తుకు వచ్చారు. రాజగురు, భగత్‌సింగ్ తమ కర్తవ్యం ముగిసింది గనుక కాలేజి ఆవరణలో దాచుకున్న సైకిళ్ళవేపు పరుగెత్తారు. చంద్రశేఖర్ మాత్రం కాలేజి ప్రహరీగోడ చాటునే పొంచి, పరుగునవస్తున్న పోలీసుల్ని హతమార్చడానికిసిద్ధంగావున్నాడు.

హెడ్‌కానిస్టేబుల్ చందన్‌సింగ్ ఇద్దరు ముగ్గురు పోలీసులతో వేగంగా వచ్చేశాడు. ఆజాద్ "అడుగు ముందుకేశారంటే మీ ప్రాణాలు దక్కవు" అని గర్జించి పిస్తోలుతో గురిచూశాడు. అంతే-వెనుకవున్న పోలీసులు తక్కున ఆగిపోయారు. చందన్ సింగ్ మాత్రం పెద్దునసే ధైర్యంతో ముందుకే లంఘించాడు. చంద్రశేఖర్ పిస్తోలు ప్రేలింది. సింగ్ బిళ్ళబీటున వెల్లకిలాకూలి పడ్డాడు. ఇదంతా క్షణాల్లో జరిగిపోయింది.

విప్లవవీరులు మాయమైపోయారు!

ఈ సంఘటన క్షణాల్లో లాహోర్ అంతటా తెలిసిపోయింది. పట్నంచుట్టూ పోలీసు వలయం యేర్పడింది. పట్నంలోపల గాలింపు మొదలయింది. దేశమంతటా యీ వార్తలు వ్యాపించగా విప్లవకారులు రహస్యంగా ఉత్సవాలు చేసుకున్నారు. ప్రజలు ఆగుబ్బుగా చెప్పుకుంటున్నారు.

మర్నాడు జాతీయభావాలుగలపత్రికలు "లాహోర్‌లో

లాలాలజపతిరాయ్ హత్యకు ప్రతీకారం" అనే పతాక శీర్షికతో ఈ సమాచారాన్ని ప్రకటించి మరింత సంచలనం కలిగించాయి.

సాండర్స్ వధకు కారణమైన పూర్వాపరాలను వివరించి, విప్లవసంఘ ఆశయాదర్శాలను వివరిస్తూ "హిందూస్తానీ సమాజవాద ప్రజాస్వామ్య సమితి" (హిం. స. ప్ర. స.)ఒక ఎర్రని కరపత్రాన్ని ప్రచురించింది. అది ఈ దిగువ విధంగా ముద్రించబడింది.



## సామ్రాజ్యవాదులారా జాగ్రత్త!

లాలాలజపతిరాయ్ హత్యకు ప్రతీకారంగా జె. పి. సాండర్స్ వధ జరిగింది. సాండర్స్‌వంటి ఒక సామాన్య పోలీసు అధికారి తన ముష్కరహస్తాలతో ముప్పదికోట్ల భారతీయుల ప్రియతమనాయకుడైన పంజాబ్ కేసరిని వధించడం క్షమించరాని నేరం.



భారతీయులు నిర్వీర్యులయిపోలేదని సాండర్స్‌వధ ప్రపంచానికి చాటింది. మా రక్తంచల్లారి గడ్డకట్టలేదనీ, మా జాతి పరువు ప్రతిష్ఠలు నిలబెట్టడంకోసం మేం ప్రాణాలయినా ఒడ్డగలమనీ-నేడు స్పష్టంగా రుజూచేశాం.



## అత్యాచార పాలకులారా జాగ్రత్త!

మా దేశంలోని పేదల్ని, పీడితుల్ని మీరింకా నిర్బంధాలకు గురిచెయ్యకండి. ఇకనైనా - మీ దురాగతాల్ని మానుకోండి. భారతీయులు ఆయుధాలు ధరించరాదనే నిషేధం వున్నప్పటికీ మాక్కావలసినన్ని రివాల్వర్‌లు అందుతున్నాయనేది

బహిరంగ రహస్యం. అయితే-ఈ చిన్న ఆయుధాలే సాయుధ విప్లవానికి చాలకపోవచ్చు. అయినా-తమ జాతీయులకు జరిగే అవమానాల్ని అరికట్టడానికైనా ఇవి తప్పక పనికివస్తాయనే సత్యం మరవకండి. విదేశీప్రభుత్వం మామీద ఎన్ని నిర్బంధాలు విధించినా-అవమానించేవారికి గుణపాఠాలు నేర్పడానికీ,జాతీయ గౌరవాన్ని పరిరక్షించుకోడానికీ మేం యెప్పుడూ సిద్ధంగా వుంటాం. ఎన్ని అడ్డంకులెదురైనా, ఎన్నికష్టాలు పడాల్సి వచ్చినా విప్లవ పతాకం ఎగరేస్తూనే వుంటాం.ఉరికంబాలనుంచి కూడా గర్జిస్తూనే ఉంటాం.

## విప్లవం వర్థిల్లాలి

సాటిమనిషి నౌకర్ని చంపవలసిరావడం మాకు బాధగానేవుంది. కాని-అతడు కేవలం ఒకవ్యక్తిమాత్రమేకాదు-జాలిలేని, నీతిలేని, నీచమైన ఒక వ్యవస్థయొక్క దండనాంగం. అందువల్లే అతన్ని హతమార్చడం తప్పనిసరి అయింది. మీ ప్రభుత్వ విధానం-ప్రపంచమంతటాగల వివిధపాలనావ్యవస్థ లన్నింటికంటె అతినికృష్టమైంది. దాన్ని క్షమించి మిన్నకుండడం - ప్రపంచ మానవాళికి; అసలు మానవత్వానికే ద్రోహంచేయడం అవుతుంది.

మానవరక్తాన్ని చిందించవలసి వచ్చినందుకు మేమెంతో విచారిస్తున్నాం. అయితే స్వాతంత్ర్య విప్లవ విజయం కోసం ఎంతో కొంత రక్తతర్పణం చెయ్యకతప్పదు. విప్లవమంటే మా దృష్టిలో-ఒక మనిషిని మరొకరు దోచుకునే పద్ధతిని అంతమొందించే సిద్ధాంతం!

"విప్లవం వర్థిల్లాలి"!

"పరాయిపాలన నశించాలి"!!

"ప్రపంచకార్మికులారా, ఏకంకండి"!!!

ఈ నినాదాలతో ఈ ఎర్రని కరపత్రం ముగిసింది.

ఇది "హిందూస్తాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ ఆర్మీ" పంజాబ్ ప్రాంతం సేనాపతి బాలరాజ్ సంతకంతో వెలువడింది.

అది 1928 డిశంబరు 18వ తేది.

## బాంబులు

సాండర్స్ వధతో పంజాబ్ పోలీసులు వెర్రెక్కిన వేట కుక్కల్లా చెలరేగారు. లాహోర్, ఆ పరిసరప్రాంతాల్లో మూల మూలలా గాలింపు ఎక్కువయింది. ఏ మాత్రంఅనుమానించిన వాడినయినా బంధించి యమయాతనలు పెడుతున్నారు. హంత కుల్ని సజీవంగా కాకుంటే, నిర్జీవంగానయినా బంధించాల్సిందని ప్రభుత్వం ఉత్తర్వులు. పట్నంలోంచి ఒక్క ఈగైనా పోలీసుల కన్నుగప్పి బయటపడే వీల్లేనంత పటిష్టంగా కాపలా ఏర్పాట్లు జరిగాయి.

పట్నంలో ఉండడం దుర్భరం అవడంతో ఆజాద్ మున్నగు ముఖ్యులు ఎలాగయినా బయటపడాలని నిర్ణయించు కున్నారు. అందుకోసం వాళ్ళు వేషాలు మార్చుకున్నారు.

సర్దార్ భగత్సింగ్ ఒక దొరబాబై పోయాడు - సూటు, బూటు, హ్యాటు, పొన్నుగర్ర, పొడవాటి దొరచుట్టతోసహా! మీసాలుతీసేసిన చంద్రశేఖర్ మరోలా!! రాజగురు ఈ దొరల నౌకరు.

నోట్లో చుట్టపెట్టుకుని ఠీవిగా వస్తున్న దొరబాబును చూచి రైలుస్టేషన్ గేటులో వున్న అధికారి వంగి వంగి సలాములు చేశాడు. నౌకరుతోసహా వెళ్ళి మొదటి తరగతి పెట్టెలో యెక్కారావీరులు. ఆ రోజుల్లో మొదటి తరగతి ప్రయాణికులు-(అందులోనూ తెల్లవాళ్ళు-) అంటే అందరికీ హడల్!

ఆ వేషాల్లో మన విప్లవవీరులు ముగ్గురూ అమృతసర్ చేరుకున్నారు. అక్కడా పోలీసునిఘా యెక్కువగానే వుంది. ఎలాగో బస్తీలోకివెళ్ళి గోప్యంగా వుండసాగారు. కాని-విప్లవ సంస్థ నాయకులు అమృతసర్ కే చేరారని వదంతులు వ్యాపించాయి. పోలీసుల గాలింపుచర్యలు శృతిమించాయి. పూటకో వేషం, రోజుకో విడిదీ మార్చినా పోలీసుల్ని తప్పించుకోవడం దుస్తరమవుతోంది. అందువల్ల ఈ చికాకుల్లేని దూరప్రాంతానికి వెళ్ళాలని బయలుదేరారు.

ఈ ముగ్గురువీరులూ వేయికళ్ళ పోలీసుల కన్నుగప్పి తప్పించుకుంటూ అలహాబాద్ చేరడంలో ఎన్నెన్నో కష్టాలు పడ్డారు. అక్కడ పండిట్ మోతీలాల్ నెహ్రూను కలుసుకున్నారు. తమ విప్లవసంస్థ ఆశయలక్ష్యాల్ని వివరించారు. ఆంగ్లప్రభుత్వం పునాదులు పెకలించివేసే కార్యక్రమాల్ని చేపడతామని, భారతీయుల్ని హింసించే ప్రతి ఆంగ్లేయుడూ

అందుకుతగ్గ శిక్ష అనుభవించేట్టు చూడ్డం తమ కార్యక్రమాల్లో ఒకటని చెప్పారు. ఆ దేశభక్తుడు వారి నాశీర్వదించి తనకు సాధ్యమైనంత సహాయం చేస్తానన్నాడు.

ఆ కాలంలో కార్మికలోకంలో అశాంతి వ్యాపించింది. తమ తమ కోర్కెల సాధనకూ, సమస్యల పరిష్కారానికీ సమ్మె నోటీసులివ్వడం యెక్కువయింది. యజమానులు తాము పోష కులమని భావించి, పోషణ పొందుతున్న కార్మికులు తాము చెప్పినట్టు పడివుండాలనే ధోరణినే అవలంబిస్తున్నారు.

జాతీయభావుకులూ, స్వాతంత్ర్య సమరయోధులూ కార్మికుల న్యాయమయిన కోర్కెల్ని బలపరుస్తున్నారు. ప్రభుత్వం యజమానులకు మద్దతునిస్తూ కిరాతకాలకు అవకాశం కల్పిస్తోంది. అందువల్ల కార్మికుల్లోను, రాజకీయవాదుల్లోను అలజడీ, విమర్శలూ, సమ్మెలూ యెక్కువయ్యాయి. ప్రజా జీవితంలో అశాంతి ప్రబలిందనేసాకుతో ప్రభుత్వం "ప్రజారక్షణ చట్టం" (పబ్లిక్ సేఫ్టీ) బిల్లు చర్చకు ప్రవేశపెట్టింది. (కార్మిక వివాదాలకు సంబంధించిన మరొక బిల్లునుకూడా దాంతోనే చర్చకు ప్రవేశపెట్టారు). ఈ బిల్లులు చట్టాలయితే కార్మిక కోటికీ, రాజకీయ వాదులకుకూడా అనేక ప్రతిబంధకాలూ, నిర్బంధాలూ చుట్టుముట్టగలవు. అందువల్ల ఈబిల్లుల్ని జీవన్మరణ సమస్యగా భావించి, నిరోధించాలని విప్లవకారులు నిర్ణయించారు.

ఈ బిల్లులు కేంద్రశాసనసభలో చర్చకు వచ్చినప్పుడు ప్రతిపక్షాల సభ్యులందరూ ఆమూలాగ్రంగా వ్యతిరేకించవచ్చు.

అయినా-ప్రభుత్వం విమర్శలను త్రోసివేసి మొండిపట్టుదలతో వ్యవహారించవచ్చు. అలా జరిగితే తాము కేంద్రశాసనసభలోనే బాంబులువేసి కల్లోలం కలిగించాలనీ, ప్రభుత్వాన్ని హడల కొట్టాలనీ విప్లవకారులు పథకంవేశారు.

కేంద్రశాసనసభలో (పార్లమెంట్) బాంబులువేసే బాధ్యతను భగత్సింగ్, చంద్రశేఖర్‌లు నిర్వహించాలని ఆదిలో నిర్ణయించారు. మళ్ళీ బాగా ఆలోచించి - ఆ తర్వాత అరెస్టులు జరిగి వాళ్ళిద్దరూ తమకు అందుబాటులో లేకపోతే తమ సంస్థ విప్లవోద్యమ కార్యకలాపాలన్నీ దిక్కు-తోచని అయోమయంలో పడిపోతాయని భావించారు. అందువల్ల ఆ బాధ్యతనుంచి ఆజాద్ (సర్వసేనాని)ను తప్పించి - భగత్సింగ్, బటుకేశ్వర దత్తుల్ని నియమించారు. (ఈ చారిత్రిక సంఘటనలపై ఇంకా ఆసక్తికరమైన వివరాలెన్నో "షహీద్ భగత్సింగ్" అనే గ్రంథంలో చదవండి. ఆ గ్రంథాన్నికూడా ఈ ప్రచురణకర్తల నుంచే పొందండి.) బాంబులు విసిరి తప్పించుకునే మార్గాలు అన్వేషించడానికి చంద్రశేఖర ఆజాద్ ఒకసారి మారుపేరుతో వెళ్ళి కేంద్రచట్టసభ ప్రేక్షకుల గేలరీలన్నీ చూచివచ్చాడు. ఎవరెక్కడ కూర్చుంటారో (సభ్యులూ, అధికారవర్గం) ఏ యే అనుకూల, ప్రతికూలవిధానాలు అమల్లోవున్నవో పరిశీలించాడు.

ఈ సభాభవనం వెలుపల ఒక కారు సిద్ధంగావుంటే - ఆ బాంబులు విసిరినవాళ్ళు తక్షణం తప్పించుకునే అవకాశంవుంటుందని ఆజాద్ వివరించాడు. అలా తప్పించుకోలేకపోయే ఆలోచనే తగదని భగత్సింగ్ వాదించాడు.

శాసనసభలో డమ్మీబాంబులు (ప్రమాదకరం కానట్టివే) విసిరి పారిపోతే తమ ఆర్మీ ఉద్దేశాలు వెల్లడికావు. బాంబులతో

పాటు తమ కరపత్రాల్నికూడా వెదజల్లాలి. పట్టుబడి కోర్టుల కెళ్ళాలి. బోనుల్లో సింహాల్లా నిలబడి తమ చర్యల్ని సమర్థించు కుంటూ, తమ ఆశయలక్ష్యాల్ని ఉద్ఘాటించాలి. ఆ విధంగా ప్రజలందరికీ తమ విప్లవసంస్థ గురించి బాగా తెలిసి రావాలని భగత్‌సింగ్ వాదన. అనేక తర్జనభర్జనల తర్వాత అందరూ భగత్సింగ్ వాదననే ఆమోదించారు. అప్పటినుంచి బాంబులూ, కరపత్రాలూ విసిరేందుకు కావలసిన యేర్పాట్లు చేయ సాగారు.

"ప్రజారక్షణ" పేరుతో దొరలు రూపొందించాల్సిన బిల్లు 1929 ఏప్రిల్ 8వ తేదీన కేంద్రశాసనసభలో ప్రతిపాదించ బడింది. అనుకూల, ప్రతికూల చర్చలు మహోద్రేకంతో కొన సాగాయి.

ఆ చర్చల మధ్యలో భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తులు ఎవరికీ అనుమానం కలక్కుండా సాధారణుల్లా ప్రేక్షకుల గేలరీలో ప్రవేశించారు. ప్రభుత్వపక్షం సభ్యులు తమకు కని పిస్తూ వుండేట్టు చోటు చూచుకుని కూర్చున్నారు. అనుకూల సమయంకోసం ఎదురుచూస్తున్నారు.

బిల్లుపై చర్చలు, ఖండన మండనలు - వాగ్ధాటితో వేళా కోళాలతో ఉధృతంగా జరుగుతున్నాయి. వాటికొక అంతూ పంతూ లేదనిపిస్తోంది. అలాంటి తరుణంలో మబ్బులేని పిడుగు లాగా ప్రభుత్వ ప్రతినిధి ఒకడులేచి "ఇంతటితో చర్చలు ఆపాలి. ఘనత వహించిన వైస్రాయ్, తమకుగల ప్రత్యేకాధి కారంతో ఈ బిల్లును చట్టంగా భావించాలని ఆజ్ఞాపించారు" అని ప్రకటించాడు.

ప్రజాప్రతినిధులందరూ తమ నిష్ప్రయోజకత్వాన్ని గురించి విస్తుపోతుండగా - ఆ సభాభవనం దద్దరిల్లేట్టుగా రెండు బాంబులు ప్రేలాయి. భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తు విసిరిన యీ బాంబుల ప్రేలుడువల్ల సభ్యుల గుండెలు ప్రాణభీతితో గజ గజ లాడాయి.

హాలంతా పొగకమ్ముకుంది. ప్రతిపక్షాలసభ్యులు మాత్రం నిబ్బరంగా తమతమ చోట్లలో కూర్చున్నారు. ప్రభుత్వపక్ష సభ్యులు అటూ యిటూ గంగవెర్రులెత్తినట్టు పరుగులెత్తారు; హాహాకారులు చేశారు. ఎటుపోవడానికీ దారీ తెన్నూ తోచడం లేదు-పాపం!

చుట్టూ భద్రతాదళం, సైనికబలగంకూడా కాపలా వుండగా పట్టపగలు కేంద్రశాసనసభలోకి మారణాయుధాలతో ప్రవేశించడం కలలోకూడా సాధ్యంకాదు. అలాంటిది జరిగింది. బాంబులు తమమీదే పడ్డాయంటే ప్రభుత్వ సభ్యులు బెంబేలు పడరా, మరి!!

ఇలా అందరూ కలవరపడుతుండగా, గందరగోళంమధ్య ప్రేక్షకుల గేలరీలనుంచిదిగి తప్పించుకుపోవడానికి విప్లవకారు లకు చాలా అవకాశంవుంది. కాని - వాళ్ళలా పారిపోకుండా ధైర్యంగా బాల్కానీ అంచునే నిలబడ్డారు. పైగా - "విప్లవం వర్ధిల్లాలి...బ్రిటిష్ సామ్రాజ్యవాదం నశించాలి ... ప్రపంచ కార్మికులారా, ఏకంకండి..." అంటూ నినాదాలతో గర్జించి అందరిదృష్టినీ ఆకర్షించారు. ఒక్కపెట్టున యిద్దరూ నినదిస్తూనే

తమ ఆశయలక్ష్యాదులుగల కరపత్రాల్ని హాలునిండా వర్షిం చారు.

ఈ వ్యవధిలో భద్రతాదళానికి చెందిన సాయుధపోలీసులు గేలరీలో కెక్కివచ్చి భగత్‌సింగ్‌నూ, బటుకేశ్వరదత్తునూ అరెస్టు చేసి అధీనం చేసుకున్నారు. వారిని పెద్ద భద్రతాదళం మధ్య నుంచుకుని న్యూఢిల్లీ జైలుకు తీసుకెళ్ళారు.

ఆ క్షణంనుంచీ ఇతర విప్లవకారులకోసం పోలీసులు దేశ మంతటా గాలించడం తీవ్రతరమయింది. ఉత్తరప్రదేశ్, పంజాబుల్లో అనేక ప్రాంతాల్లో అనుమానితులకోసం దుర్భిణీ లతో వెదుకసాగారు.

విప్లవకారులని అనుమానం కలిగినవారిని అరెస్టులు చెయ్యడమేగాక-వారికేంద్రాలని అనుమానంగల యిళ్ళమీద హఠాత్తుగా దాడులు జరిపి విధ్వంసాలుచేశారు. దొరికిన సాహి త్యాన్ని, మందుగుండుసామగ్రినీ, విప్లవకారుల స్వంతవస్తువుల్ని చేతనయినంతవరకు తీసుకువెళ్ళడం, లేదా ధ్వంసం చెయ్యడం జరిగింది.

ప్రముఖ విప్లవకారులయిన సుఖదేవ్, కిశోరీలాల్‌లు లాహోర్‌లో దొరికిపోయారు. భగత్సింగ్, బటుకేశ్వరదత్తులను కూడా లాహోర్‌కు తరలించి అక్కడొక న్యాయస్థానంలో విచారణ జరిపిస్తారని తెలియవచ్చింది. అందువల్ల - నిందితుల్ని ఢిల్లీనుంచి లాహోర్ తీసుకెళ్ళే సమయంలో విప్లవకారులు మెరుపుదాడి జరిపి తమ నాయకుల్ని తప్పించుకుపోవాలని నిశ్చ యించుకున్నారు.

అలాంటి మెరుపుదాడిచేసి విజయం సాధించాలంటే తమకు బాంబులుకూడా అవసరమని సహచరులు అభిప్రాయ పడ్డారు. మొత్తం పథకాన్ని పకడ్‌బందీగా రూపొందించడానికి చంద్రశేఖర ఆజాద్, భగవతీ చరణ్, యశపాల్, ధన్వంతరి, వైశంపాయన్, దుర్గాభాబీ, సుశీలాదీదీ (ఈ భద్ర మహిళల గురించి వివరంగా తెలుసుకోవాలంటే "షహీద్ భగత్‌సింగ్" చదవండి.)లు రహస్య సమావేశం జరిపారు.

ఈ సమావేశంలో ఓ పథకం రూపొందింది. తమ మెరుపు దాడికి బాంబులవసరమేననీ, ముందుగా కొన్ని బాంబుల్ని పేల్చి పరీక్షించడం మంచిదనీ నిర్ణయించారు.

అంతకుముందు భగత్సింగ్ మొదలయినవారు ఆగ్రా, రోహ్‌టక్, కాన్పూర్ మొదలయినచోట్ల నెలకొల్పిన ఆయుధాల తయారీ కేంద్రాలలో కొన్ని గూఢచారులకు వెల్లడవడం, వాటిని ప్రత్యేకదళాలు ధ్వంసం చేయడం జరిగిపోయింది. రోహ్‌టక్‌లో సిద్ధంచేసుకున్న మందుగుండు పేలుడు పదార్థాలు మాత్రం కొన్ని భద్రంగా వున్నాయ్. చంద్రశేఖర ఆజాద్ అంతకుముందు కాన్పూరులో కొన్ని బాంబు డిప్పల్ని (గోళాలు) పోతపోయించి దాచాడు.అలాంటివాటితో మూడు బాంబుల్ని సిద్ధంచేసుకున్నారు. ఒకటో రెండో పేల్చి పరీక్షించాల్సి వుంది.

ప్రేలుడు మందును దట్టించేప్పుడు రాపిడికి తమ చేతుల్లోనే ప్రేలిపోకుండా - ముందుగానే డిప్పలకు వార్నిష్‌పూత పూసి వుంచాలనే జాగ్రత్త వహించారు.

ఒకరోజున—

చంద్రశేఖర ఆజాద్-బందీలను విడిపించుకున్న తర్వాత దూరంగా తరలించుకు వెళ్ళేందుకు అవసరమైన చిన్నకారును మాట్లాట్టంకోసం బస్తీలోకి వెళ్ళాడు. యశపాల్ మరికొన్ని యేర్పాట్లు చూడ్డానికి పోయాడు. అలాంటి సమయంలో సుఖదేవ్, భగవతీచరణ్, వైశంపాయన్ రావినదీతీరాన ఒక బాంబు పేల్చి చూద్దామని వెళ్ళారు. అక్కడ అడవి మధ్యకు చేరుకున్నారు.

ముసుగులోంచి ఆ బాంబునుతీసి దూరంగా విసరడానికి ప్రయత్నిస్తున్నంతలో అది భగవతీచరణ్ చేతుల్లోనే ప్రేలిపోయింది. ఆ ధాటికి తట్టుకోలేక అతను అంతెత్తుఎగిరి అల్లంత దూరానగల ఓరాతి అంచుమీదపడ్డాడు. కెవ్వుమని ఆర్తనాదం చేశాడు.

వైశంపాయన్‌కు దెబ్బలేమీ తగల్లేదుగాని సుఖదేవ్‌కు తీవ్రంగా గాయాలయ్యాయి. అయినా వీళ్ళిద్దరూ తమశక్తి యుక్తులన్నీ కూడదీసుకుని ఆర్తనాదం వినవచ్చినవేపుకు వెళ్ళారు.

భగవతీచరణ్ చేతులు రెండూ తెగిపోయాయి. మొండెంలాంటి భుజాలనుంచి మాంసంముద్దలు రక్తధారలతో వేలాడుతున్నాయి. అతను అంగాంగకాల్చి బాధతో రాతికేసి కొట్టుకొంటున్నాడు. స్పృహాకోల్పోతున్న దశలో "దాహం, దాహం" అంటూ ఆక్రోశిస్తున్నాడు. ఆ వీరుని శరీరం చూడ్డానికే భయంకరంగా, గుర్తుపట్టలేనంత వికృతంగా వుంది.

దాహంతో ఆరాటపడుతున్న అతనికి మంచినీళ్ళు పోయడానికి ఏ పాత్రా లేదాయె! మిత్రులు నది ఒడ్డుకువెళ్ళి వస్త్రాలు తడిపితెచ్చి భగవతీచరణ్‌నోట్లో పిండాల్సి వచ్చింది. అతను మెల్లగా నీటిని గుటకలు వేయగలిగాడు.

సుఖదేవ్ తీవ్రంగా గాయపడ్డా లక్ష్యపెట్టకుండా వెంటనే బస్తీలోని తమ విప్లవకేంద్రానికి పరుగెత్తాడు. ఈ దారుణ వార్త వినగానే కొందరు యశపాల్‌వెంట రావీనదీతీరానగల అడవివేపు పరుగెత్తారు. సుఖదేవ్‌ను తన గాయాలకు తగుచికిత్స చేయించుకుని విశ్రాంతి తీసుకోమన్నారు.

అడవిలోకివెళ్ళిన యశపాల్ బృందం వైశంపాయన్ని పేరుపెట్టి పిలుస్తూ, సమాధానంరాక చాలాసేపు వెదకాల్సి వచ్చింది. చివరికి వైశంపాయన్‌కేక వినిపించింది. యశపాల్ మిత్రులతో అటువెళ్ళేసరికి-వైశంపాయన్ తడిగుడ్డతో భగవతీ చరణ్ నోట్లో నీళ్ళుపిండుతున్నాడు. భగవతీచరణ్ వెల్లకితలా పడివున్నాడు.

బాధతో మెలికలుతిరిగేట్టు విలవిల్లాడినందువల్ల అతని మోకాళ్ళు పైకిలేచి బిగుసుకుపోయినట్టున్నాయి. రక్తం కారుతున్న చేతులమొండేలు రొమ్ముమీద వాలాయి. పొట్టచిట్లినట్లు ప్రేవులు లుంగలుగా బయటికివచ్చాయి. మోమునిండా గాయాలే!

వైశంపాయన్ నీళ్ళుపిండి పరిచర్యలు చేసివుండడంవల్ల భగవతీ కొంచెం ప్రయాసగానయినా మాట్లాడగలిగాడు. మిత్రుల్ని పరిశీలనగా చూచాడు: "ఆజాద్‌కూడా వస్తే నా

కళ్ళతో చివరిసారి చూచివుండేవాణ్ణి. నాకా అదృష్టంలేదు" అని కన్నీరుకార్చాడు.

యశపాల్ అతన్ని ఓదార్చుతూ "భయపడకు. మేం వెళ్ళి ఓ మంచం పట్టుకొస్తాం. నిన్ను సురక్షిత ప్రదేశానికి చేరుస్తాం. నీకేం భయంలేదు" అన్నాడు. భగవతీచరణ్ ఆదో మాదిరిగా, విరాగిలా పెదవి విరిచాడు. "నేను చస్తున్నందుకు భయపడుతున్నా ననుకుంటున్నారా?! అబ్బే-లేదు! భగత్‌సింగ్, దత్తుల్ని విడిపించే కార్యక్రమంలో పాల్గొనలేకపోతున్నానే అని బాధపడుతున్నాను. ఈ ప్రమాదం మరో రెండు మూడు రోజుల తర్వాత జరిగినా బాగుండేది - ఈలోగా మన పథకం నెరవేరేది!!" అన్నాడు

అతను కొంచెం ఊపిరిపీల్చుకున్నాడు. మళ్ళీ - "మళ్ళీ మంచం గించం ప్రయత్నాలేమీ చెయ్యకండి. నేనింక ఎక్కువ సేపు బతకనని నాకుతెలుసు. నన్ను రక్షించే ప్రయత్నం చేయడం దండుగ. అంతకంటె మహానాయకుడయిన భగత్‌సింగ్‌ను విడిపించే పథకాన్ని జయప్రదం చెయ్యండి. అదే మనందరి ప్రథమ కర్తవ్యం" అని గట్టిగా చెప్పాడు.

స్వయంగా వీరకిశోరమైన భగవతీచరణ్ యిలాంటి అప్పగింతలు చెప్పడం అందర్నీ సంచలింపజేసింది. అతను యింతవరకూ స్పష్టంగానే మాట్లాడినా చివరికి ఆయాసం, తొట్రుపాటూ ధ్వనించాయి. మృత్యువును ముఖాముఖీ చూస్తూ కూడా ధైర్యంగా, కర్తవ్యపాలన గురించే ఆలో

చిస్తున్న భగవతీచరణ్ వీరాగ్రేసరుల చరిత్రలో గణనకెక్కిన వ్యక్తిగదా!

ఆ తర్వాత భగవతీచరణ్ సునాయాసంగా మరణించాడు. అతనికి-అక్కడున్నవారంతా పాదాభివందనం చేశారు. ఒక వస్త్రాన్నికప్పి-శవాన్నేంచెయ్యాలో తోచక-అంతా కలిసి తమ కేంద్రానికి వెళ్ళిపోయారు. అప్పటికి అర్ధరాత్రయింది.

తెల్లవారకముందే ఆజాద్, యశపాల్, వైశంపాయన్ ఆ వీరుని శరీరంవున్నచోటికి బయలుదేరారు. భగవతీచరణ్‌మీద కప్పివున్న వస్త్రాన్ని తొలగించి చూచేసరికి సూర్యోదయం అయింది. ఏ జంతువూ తమ వీరుని శవాన్ని చిందరవందరచేయక పోవడం సహచరులకు తృప్తి కలిగించింది. రక్తపువాసనకో యేమో కొన్ని చీమలుమాత్రం పారాడుతున్నట్టు కనిపించాయి.

ఆ దగ్గరనే రావీనదిశాఖ ఒకటి నిండుగా ప్రవహిస్తోంది. వీరవరులు-శవంతోపాటు కొన్ని బండరాళ్ళనుకూడా చేర్చి ఓ దుప్పటిలో పొడవాటిమూటగా కట్టారు. ఆ వీరాగ్రేసరుని ముగ్గురుమిత్రులే ఎత్తుకుని నదిలోవేసి అంజలిఘటించడంద్వారా జలసమాధిచేశారు.

భగవతీచరణ్ మృతి అందరికంటె చంద్రశేఖర ఆజాద్‌కు మాననిగాయంగా తోచింది. అతనందరికంటె తనకే అతిసన్నిహితుడు, ఉత్సాహి, పిరికితనమనేది ఎరుగని క్రియాశీలి అని ఆజాద్ నమ్మిక. అందువల్ల తనచేయి విరిగినంత వెలితి ఏర్పడిందనుకున్నాడు-ఆజాద్.

## విషాదాలు

రావీనదీతీరాన ఒక దుర్గమారణ్య ప్రాంతంలో బాంబు ప్రేలిందనేవార్త బయటికి పొక్కడంతో పోలీసులూ, గూఢ చారులూ-మామూలు ప్రజలకు తెలిసిన రహస్యం తమకు తెలియ లేదని "నామోషీ" పడ్డారు. వారిపైన అధికారవర్గాలవత్తిడి యెక్కువయింది.

అందువల్ల పోలీసులు-ఈగకాలంత అనుమానంగా కని పించిన ప్రతివాణ్ణీ అరెస్టుచేసి విప్లవకారుల ఆచూకీ వెళ్ళగక్కం డని చిత్రహింసల పాల్జేయసాగారు. పట్టుబడని విప్లవసారధుల జాబితా మిగిలేవుంది. అందువల్ల వీధివీధినీ, ఇంటింటినీ నిఘా వేసి గాలించడం యెక్కువయింది.

చంద్రశేఖర ఆజాద్ యింక కాన్పూర్‌లో వుండడం కూడా క్షేమకరం కాదని, కొంతకాలం బొంబాయిప్రాంతాల్లో గడిపి తగుతరుణంలో భగత్‌సింగ్, దత్తులను విడిపించే పథకం కోసం రావచ్చుననుకున్నాడు.

ఈ ఆలోచన రాగానే ఆజాద్‌కు మరో పాతవిషయం గుర్తుకువచ్చింది.

బొంబాయిలో విప్లవ కార్యాచరణ కేంద్రాన్ని నెల కొల్పి కొంతకాలం బాగానడిపి, పోలీసులు గుర్తించడంవల్ల వాళ్ళ కళ్ళుగప్పి తప్పుకొన్న పృథ్వీసింగ్ చాలాకాలంవరకు

తెలిసిన మరెవరికీ కనిపించలేదు. ఆయన ఒకప్పుడు గదర్ పార్టీలో ప్రముఖనాయకుడు, దృఢశరీరుడు, ధీరశిఖామణి, ఎంతటి శ్రమనయినా అవలీలగా ఓర్చి లక్ష్యాల్ని సాధించగల క్రియాశీలి.

అలాంటి మహావీరుడొకసారి యాదృచ్ఛికంగా - అలహాబాద్ "ఆల్ఫ్రెడ్ పార్క్"లో చంద్రశేఖర్‌కు కనిపించాడు. వారిద్దరూ వయసుల్లో యెంతో తేడాలున్నా మనసులువిప్పి సూటిగా మాట్లాడుకున్నారు.

అనుభవం, ఓపికా, దీక్షాగల పృథ్వీసింగ్ వంటి పెద్దలు విప్లవపంథాను మరచి దూరదూరంగా వుండడం తగదనీ, అలాంటి మహానాయకులు శ్రద్ధచూపితేగాని వేలాది మందియువకులు దేశభక్తి సైనికులుగా రూపొందలేరనీ ఆజాద్ వాదించాడు. ఆయన అతనివాదనతో యేకీభవించి తాను బొంబాయి ప్రాంతంలో విప్లవసంస్థ నిర్వహణకు పూర్తిగా తోడ్పడగలనని మాట యిచ్చాడు. అలాంటి మహావీరుడిప్పుడు ఆజాద్‌కు గుర్తు వచ్చాడు.

చంద్రశేఖర్ బొంబాయివెళ్ళి పృథ్వీసింగ్‌గారికి తమ సంస్థ విప్లవశాఖా సభ్యుల్ని పరిచయంచేసి వద్దామనే లక్ష్యంతోనే అటువెళ్ళాడు. బొంబాయి, ఆ పరిసరశాఖలతోపాటు యితర రాష్ట్రాలలో శాఖోపశాఖల్ని పటిష్ఠం చేయడానికి, చురుకుగా నడపడానికి చంద్రశేఖర్ యీ సంధి సమయంలో చాలా కృషిచేశాడు.

తాను పోలీసుల దుర్భిణీలకూ, వేటకుక్కలకూ చిక్క

కుండా వేషాలుమార్చి తప్పించుకుంటూ, విప్లవసంఘ శాఖోప శాఖల విస్తరణకు ఎంతో చేయగలుగుతున్నందుకు సంతోషిస్తున్నా-ఆజాద్‌కు మనస్తాపం కలిగించే సంఘటనలు వరుసగా జరుగుతున్నాయి.

సర్దార్ భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తులతోపాటు మరి కొందరినికూడాచేర్చి అనేక నేరారోపణలపై ఢిల్లీలోనే విచారణ తతంగం నడిపించసాగారు. అసలుకేసు (కేంద్ర శాసనసభలో బాంబు వేయడం) విచారణకోసం ఒక ప్రత్యేక న్యాయ స్థానాన్నే (ట్రిబ్యునల్) యేర్పాటుచేశారు. ప్రభుత్వం యీ విచారణాదికాలకు లక్షలాది ధనం వెచ్చించాల్సి వచ్చింది. ప్రభుత్వ వకీళ్ళకుతోడు అనేకమంది ప్రముఖ న్యాయవాదుల్ని అధికాధికంగా ఫీజులిచ్చి నియమించుకున్నారు.

ముద్దాయిల పక్షాన దేశభక్తుల్లో పేరొందిన వకీళ్ళు, బార్-ఎట్-లాలు, స్వాతంత్ర్య సమరయోధులు, సానుభూతి పరులు ఒక పెద్ద "డిఫెన్సు కమిటీ"ని యేర్పాటుచేశారు. కోర్టులో విచారణజరిగే రోజుల్లో నిందితుల బంధుమిత్రులేగాక అనేకవందలమంది ఆసక్తితో వచ్చేవారు.

భగత్‌సింగ్ ప్రభృతుల్ని చూస్తే చాలుననే కోరికతో ప్రతిరోజూ కొన్నివేలమంది సెంట్రల్‌జైలు గేటుముందు గుమిగూడేవారు. ఇలాంటి జనసమూహం ఎప్పుడైనా ఆవేశంతో చుట్టుముడుతుందోననే భయంతో - రక్షకభటులు భగత్‌సింగ్, దత్తులను అతిరహస్యంగా ఎవరికీ అనుమానం కలుగనిమార్గాల్లో ట్రిబ్యునల్ (ప్రత్యేక న్యాయస్థానం) వద్దకు తీసుకువచ్చేవారు.

మిగిలిన బందీలు బ్రిస్టల్‌జైలులో వుంచబడ్డారు. వారిని

మాత్రం ప్రజలు చూస్తుండగానే పోలీసులారీలలో, ఎక్కువ మంది కాపలాతో కోర్టుకు తెచ్చేవారు.

అత్యంత ప్రమాదకారులని నేరారోపణ జరిగిన భగత్ సింగ్, బటుకేశ్వరదత్తుల కాళ్ళకూ, చేతులకూ ఇనుప గొలుసులు బిగించి-కోర్టులోకూడా ఆ సంకెళ్ళను తొలగించేవారు కాదు. అంతగట్టి బంధనాలున్నా ఆ వీరాగ్రేసరులిద్దరూ నిర్లక్ష్యంగా, విజయగర్వహాసాలతో లోపలికి నడిచేవారు.

పోలీసువాహనంనుంచి దిగగానే "ఇంక్విలాబ్ - జిందాబాద్" (విప్లవం వర్థిల్లాలి) అంటూ బిగ్గరగా నినాదాలు ప్రారంభించేవారు. వెంటనే ప్రజలు వేలాదిగొంతులతో ప్రతిధ్వనించేవారు. పైగా "సర్దార్ భగత్‌సింగ్ వర్థిల్లాలి...బటుకేశ్వరదత్ వర్థిల్లాలి" అనికూడా ప్రజలు నినాదాలు చేసేవారు.

కోర్టులో ప్రవేశించి బోనులో యెక్కినప్పుడుకూడా మన వీరకేసరులు నినాదాలు చేస్తూనే వుండేవారు. తెల్లదొరలు, పోలీసు ఆఫీసర్లు తమ గుండెలు జారిపోతవేమోనన్నంత ఆందోళన చెందేవారు. వీరులు, ప్రజానీకం కలిసి ఇంతసేపు చేసే నినాదాల పరంపర భూనభోంతరాళాల్ని దద్దరిల్లజేస్తుంటే ఒక విచిత్ర ఉద్రిక్త ఉద్విగ్న వాతావరణం నెలకొనేది.

ఆ కాలంలో దేశంలో యెందరో విప్లవకారులకు మరణశిక్షలు పడుతున్నాయి. మరెందరో వీరులు ఆయుధాల పరీక్షా సమయంలో ప్రమాదాలకు గురౌతున్నారు. గూఢచారి వలలనుంచి తప్పించుకోడంలో ఎందరెందరో స్వచ్ఛందసైనికులు చెప్ప

లేని ఇక్కట్లు పడుతున్నారు. అజ్ఞాతంగా గడపక తప్పని పరిస్థితుల్లో ఎందరో యువకులు తినడానికి తిండీ, కట్టుబట్టా, కునుకు దీసే అవకాశమూలేక క్షీణించిపోతున్నారు.

ప్రజలకు తెలిసే యిన్ని భయంకరాలు జరుగుతున్నా-స్వచ్ఛంద సైనికులుగా ముందుకువచ్చేవారి సంఖ్య తరక్క-నానాటికీ పెరిగిపోతూనేవుండడానికి కారణం ఏమిటి?

అసలీ విప్లవకారులనేవాళ్ళు ఏంసాధిద్దామని ప్రాణాల్ని సైతం పణంగాపెట్టి చెలరేగుతున్నారు? విప్లవసంస్థపై తటస్థుల కూడా అభిమానం, గౌరవం ఏర్పడ్డానికిగల మూలకారణం ఏమిటి? ఇలాంటి అనేక ప్రశ్నలకు యశపాల్ తన "సింహావలోకనం" అనే పుస్తకంలో హేతుబద్ధంగా వివరణలిచ్చాడు.

విప్లవకారులు-న్యాయంకోసం, సత్యంకోసం, మాతృదేశ స్వాతంత్ర్య సాధనకోసం తమకు చేతనయిన మార్గాలన్నీ తొక్కుతారు. విప్లవంద్వారామాత్రమే దేశదాస్య బంధనాల్ని బదాబదలు చేయగలమని వారి నమ్మకం. వారి అభిప్రాయం-విప్లవమంటే పరాయి పాలకులతో పోరాడ్డం మాత్రమేకాదు; సకల జనావళికీ న్యాయం కల్పించి, సమన్యాయసమ్మతంగా కనిపించే నవసమాజాన్ని నెలకొల్పడంకూడా అందులో ఇమిడి వుంది.

పెట్టుబడిదారీశక్తుల్ని, విధానాన్ని నాశనం చెయ్యాలి. వర్గరహిత సమసమాజ వికాసానికి కృషిచెయ్యాలి. విదేశీయులతోపాటు దేశీయ దోపిడీదారులనుంచి కూడా ప్రజా సామాన్యాన్ని కాపాడాలి. ప్రజలకే స్వయం నిర్ణయాధికారాన్ని దత్తంచేయడం విప్లవ ప్రధానలక్ష్యం.

ప్రజాపీడకుల్ని గద్దెలమీదినుంచి వైదొలగించి-రైతులకూ శ్రామికులకూ శాసన నిర్మాణాధికారాన్ని కట్టబెట్టడం విప్లవ ధ్యేయం. ఒక్కవాక్యంలో చెప్పాలంటే-రైతుకూలీప్రజారాజ్య స్థాపనే విప్లవ సంస్థ ఆశయం!!

అందువల్లనే అనేకానేక క్లిష్టపరిస్థితుల్ని ఎదుర్కోవాలని తెలిసికూడా యువకులెందరో విప్లవసంఘాల్లో చేరడానికి చివరి రక్తంబొట్టువరకూ చిందించడానికి సిద్ధమయ్యారు.

ఆ కాలంలో అధికసంఖ్యాకుల్లాగా లౌకిక జీవితాల తాత్కాలికసుఖాలు చాలునసే భావం ఈ యువతకు లేనేలేదు. మత్తువంటి మత ప్రభావాలనుంచి వారు బయటపడ్డానికి నిశ్చయించుకున్నారు. ప్రపంచంలో అనేకచోట్ల కొత్తగా ప్రభవిస్తున్న స్వేచ్ఛాసమరాల్ని గురించి, విజ్ఞానవీచికలగురించి వారు ఆలోచనా పూర్వకంగా తెలుసుకున్నారు. రేయింబవళ్ళు బానిస బంధాల్ని త్రెంచివెయ్యడానికే తీవ్రకృషి ఆరంభించారు. ఆ కృషిలో అనుక్షణ సంఘర్షణలు - ఆరని విప్లవజ్వాలలు, తీరని స్వేచ్ఛాపిపాస! ఈ జ్వాలల్లోపడి దోపిడీవర్గాలు శలభాల్లా మాడిపోవలసిందే.

ఈ మాదిరి విప్లవకార్యక్రమాలు ఒక్కోసారి దౌర్జన్య హింసాకాండలుగాకూడా రూపొందవచ్చు. ఆ దౌర్జన్యవాదం జరుగునున్న మహావిప్లవానికి ఒక సంకేతం వంటిదే! రేపు జరిగేదే సంపూర్ణవిప్లవం అని చెప్పలేం. పరిపూర్ణ విప్లవగమ్యం చేరాలనే ప్రయత్నంలో అనేక మజిలీలు, ఎన్నో నిచ్చెనమెట్లు- అందులో దౌర్జన్యకాండకూడా ఒకటి కావచ్చు.

ఎవరేమన్నా విప్లవపోరాటంలో యెప్పుడో ఒకప్పుడు హింసావాదం తప్పదు. ప్రపంచంలో జరిగిన విప్లవాలన్నీ అసలు దౌర్జన్యంతోనే మొదలయ్యాయి. దౌర్జన్యం దోపిడీదారుల్ని హడలగొడుతుంది. బలహీనులకు ఉత్సాహాన్నీ, ఉద్రేకాన్నీ కలిగిస్తుంది.

ఈ వాదనవల్ల భారతీయ విప్లవకారులు దౌర్జన్యాన్ని దౌర్జన్యం కోసమే చేపట్టారనుకోరాదు. వారి సిద్ధాంతం హింసాత్మకంకాదు. ప్రజలందరికీ సాంఘిక, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్యాల్ని, హక్కుల్ని ప్రసాదించడమే విప్లవాశయం. వారెన్నడూ చిట్టి పొట్టి తాత్కాలిక సంస్కరణలకోసం ఆశించ లేదు. "స్వరాజ్యం నా జన్మహక్కు" అన్న లోకమాన్య బాల గంగాధరతిలక్‌నే ఆదర్శంగా భావించారుగాని తాత్కాలిక పరి మిత స్వయం నిర్ణయాధికారాలకై బేరాలాడలేదు. నిర్నిబంధ సంపూర్ణస్వాతంత్ర్య సాధనకోసమే కష్టసంకీర్ణమైన, త్యాగశీలం గల మార్గాన్ని ఎంచుకున్నారు.

భారతీయుల స్వయంపాలనా వాంఛలకు బద్ధవైరులైన వైస్రాయీ, అతని తాబేదారులూ-విప్లవకారుల్ని "లాహోర్, కాకోరీ, మీరట్ కుట్రకేసుల్లో" ఇరికించి, న్యాయవిచారణ సాకుతో కపటనాటకాలాడుతున్నారు. తాము చెప్పిన విధంగా తీర్పులు రాబట్టుకుని విప్లవయోధవరుల్ని ఒక్కొక్కరినే పొట్టన బెట్టుకుంటున్నారు.

ఇలాంటి కుత్సితంతోనే భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తుల పైనా, ఇతరులపైనా ప్రత్యేక విచారణలు జరిపిస్తున్నారు.

కేంద్ర శాసనసభలో బాంబులు విసిరినందు కొకరకమైన శిక్షలు విధించబడ్డవాళ్ళపై లాహోర్‌లో సాండర్స్‌వధ గురించి మరో విచారణ తతంగం ఏర్పాటుచేశారు.

భగత్సింగ్ ప్రభృత వీరనాయకుల్ని విడిపించుకునే ప్రయత్నాలు అనేకం భగ్నమయ్యాయి. ఆదిలోనే భగవతీచరణ్ వంటి సాహసికుని కోల్పోవడం జరిగింది. ఆజాద్ యెవరికీ చిక్కకుండా దినమొక వేషంతో, పూటకొక యెత్తుగడతో సంచరిస్తూ విప్లవకారులకు తోడ్పడ్డం, ప్రోత్సహించడం జరుగుతూనే వున్నా కొందరు వీరవరులు బలయిపోతూనే వున్నారు.

బ్రిటిష్ ప్రభుత్వం లండన్‌లోవుంటే - దాని ప్రతినిధిగా భారతదేశాన్ని అణగదొక్కుతున్న వైస్రాయి ఢిల్లీలో వున్నాడు. అతన్నే తుడిచిపెట్టడంవల్ల తమసత్తా ఇంగ్లండ్ పాలకులకు తెలియజెప్పాలని విప్లవకారులు యోచించారు.

దేశపర్యటలో వైస్రాయి ప్రయాణించేసే ప్రత్యేకరైలు పెట్టెను పాతఢిల్లీ సమీపంలో పేల్చివేసేందుకు వారు పథకం వేశారు. 1930 డిశంబరు 29వతేదీన యీ ప్రయత్నంకూడా విఫలమైపోయింది. ఆ ప్రత్యేక రైలుకున్న మొదటి రెండు పెట్టెలూ తునాతునకలైపోయినా వైస్రాయివున్న పెట్టె చెక్కుచెదరలేదు. అతడు సురక్షితంగా న్యూఢిల్లీలోని తన విడిది భవనానికి (నేటి రాష్ట్రపతిభవన్ అదే) చేరుకున్నాడు.

అసలు ఈ తీవ్రచర్య జరపడానికి కారణం భగత్సింగ్, సుఖదేవ్ ప్రభృత మహావీరులపై పెట్టిన కేసుల విచారణముగిసి-తీర్పులు వెలువడ్డమే.

1930 అక్టోబర్ 7వ తేదీన ప్రకటించిన ఆ తీర్పుల ప్రకారం సర్దార్ భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురులను "మరణించేవరకూ ఉరితీయాలి". దాదాపు యాభై పేజీలున్న తీర్పులో విప్లవకారులపై అనేక హేయమైన ఆరోపణలు జరిగాయి. విజయకుమార్ సిన్హా, శివశర్మ, కిశోరీలాల్, జయదేవ్‌కపూర్, మహావీరసింగ్, గయాప్రసాద్ నిగం, కమలనాథ్ తివారీలకు అండమాన్ దీవులలో యావజ్జీవకారాగారవాసశిక్ష విధించబడింది.

కుందన్‌లాల్‌కు ఏడేళ్ళు, ప్రేమదత్‌కు అయిదేళ్ళు కఠినశిక్షలన్నారు. పిడుగుపాటువంటి ఈ తీర్పులకు ప్రతీకారంగానే వైస్రాయిని మట్టుబెట్టాలనే నిర్ణయంచేశారు. అదీ విఫలం కావడంతో చంద్రశేఖర ఆజాద్ మరీ క్రుంగిపోయాడు.

ఈ సందర్భంలో-కేంద్రశాసనసభలో బాంబు వేసిన వారిలో బటుకేశ్వరదత్తు విషయంకూడా చెప్పుకోవాలి. అతను బ్రిటిష్ వారి న్యాయస్థానానికి అందనంతదూరం తప్పించుకుపోగలిగాడు. ఈ అత్యంత సాహసిక సంఘటన గురించిన పూర్తిచరిత్ర మనకు తెలిసే అవకాశం లేకపోయింది. చిరకాలం అజ్ఞాతవాసం చేసిన బటుకేశ్వరదత్తు దేశం స్వాతంత్ర్యం పొందిందన్న తర్వాత బయటకువచ్చి 1965లో మరణించాడు. అంతకుముందు అతను కోరిన ప్రకారం దత్తు శవానికి మృతవీరుల స్మారకచిహ్నలవద్దనే అంత్యక్రియలు జరిపించారు. ఇదితరువాతి చరిత్ర.

భగత్సింగ్ ప్రభృతులకు మరణశిక్షలు ప్రకటించబడ్డాక చంద్రశేఖర ఆజాద్ గుండెల్లో గునపం దిగినంతబాధతో, తీరని

విచారంతో వ్యసనతరంగా సంచలించాడు. విప్లవసంఘ ప్రముఖులెందరో ప్రభుత్వంవలల్లోచిక్కుకుని ప్రాణాలు కోల్పోతుంటే తానొక్కడేబయటవుండి చేయగలిగిందేమీ లేదని నిరాశాహతుడయ్యాడు.

కింకర్తవ్యతా విమూఢదశలో, ఒకచోట కాలాననట్లు ఉత్తరహిందూస్థానమంతటా పర్యటించాడు. చివరికి అలహాబాద్ వెళ్ళి మోతీలాల్ నెహ్రూగారి "ఆనందభవనం" చేరుకున్నాడు. ఆజాద్‌కు అక్కడ జవహర్‌లాల్ నెహ్రూతో మాట్లాడే అవకాశం కలిగింది.

త్వరలో బ్రిటిష్ ప్రభుత్వం రౌండ్‌టేబుల్ సమావేశం జరుపనున్నదని తెలిసింది. అలాంటి సమావేశంలో గాంధీ, నెహ్రూ, తదితర దేశనాయకులు ఏమేమి చర్చించనున్నారనే అంశాన్ని చంద్రశేఖర్ సూటిగా ప్రశ్నించాడు.

"మీ చర్చలవల్ల ప్రభుత్వానికీ, మీకూ మధ్య ఏదో ఒక ఒడంబడిక కుదరవచ్చు. అలాంటి ఒడంబడికలో మా విప్లవ సంస్థ కార్యకర్తలకుండే స్థానం ఏమిటి? వారినింకా - ఆ ఒడంబడిక తర్వాతకూడా 'తిరుగుబాటు దార్లు"గానే పరిగణిస్తారా? లేక వార్ని శాంతియుతంగా, మామూలు ప్రజల్లో కలిసి మెలిసి బ్రతకనిస్తారా? అప్పుడుకూడా గూఢచారులు నీడల్లా వెన్నాడుతూండే భయకంపిత జీవితాల్నే మేం గడపాలా?? మమ్మల్ని పట్టి యిచ్చినవారికి గొప్ప బహుతులిస్తామని ప్రకటిస్తూనే వుంటారా? మేముకూడా స్వేచ్ఛగా మా ఇష్టంవచ్చిన వృత్తులు చేసుకుంటూ గౌరవంగా బ్రతికే అవకాశాలిస్తారా?? ఈ ప్రశ్న

లకు మీరిచ్చే సమాధానాలేమిటి?" అని జవహర్‌ను ఆజాద్ నిష్కర్షగా అడిగాడు.

యువకోత్సాహంగల జవహర్‌లాల్ విప్లవకారులకు సమగౌరవం, అవకాశాలూ కల్పించేందుకు తనచేతనయినంతా చేస్తానని వాగ్దానం చేశాడు. చంద్రశేఖర ఆజాద్ ఆ మేరకు తృప్తిపడి, మళ్ళీ దేశాటనకు బయలుదేరాడు.

విప్లవసంస్థకు "సర్వసేనాపతి" చంద్రశేఖర్‌ను ఏ విధంగా నయినా బంధించవలసిందని ఉన్నతాధికారులు ఆజ్ఞాపించారు. అందుకెంత ఖర్చయినా, మరెందరికో లంచాలవసరమయినా ప్రభుత్వ భొక్కసం సిద్ధంగా వుందని చెప్పారు. అందువల్ల మళ్ళీ ఆజాద్‌కోసం గాలింపు ఉధృతంగా జరుగసాగింది. ఆజాద్ వాళ్ళకు మించిన పైయెత్తులువేస్తూ చాకచక్యంగా తప్పించు కుంటున్నాడు.

కొద్దికాలానికి-వైశంపాయన్ ఢిల్లీలో ఒకచోట పోలీసు లకు దొరికిపోయాడని తెలిసింది. ఆ సమయంలో తనవద్ద రివాల్వర్ వున్నా వైశంపాయన్ దాన్ని ప్రయోగించడానికి ప్రయత్నించక మేకలా లొంగిపోయాడని తెలియవచ్చి ఆజాద్ మరింత వ్యధచెందాడు.

తర్వాత ధన్వంతరికూడా పోలీసులకు చిక్కిపోయాడు. ఈ వార్తలువింటూ చంద్రశేఖర్ "విప్లవసౌధ శిఖరాలు ఒక్కొక్కటే కూలిపోతున్నాయి. ఇక సౌధంకూడా పడిపోయే ప్రమాదం ముంచుకొస్తోంది" అని నిట్టూర్పు విడిచాడు.

# వీర గంథం

ప్రజారక్షణచట్టాన్ని, కార్మిక వివాదచట్టాన్ని బిల్లుల రూపంలో చర్చకు ప్రవేశపెట్టడం-ఆ సందర్భంలో భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తులు కేంద్రశాసనసభలోకి డమ్మీబాంబులు విసరడం వగయిరా సంఘటనల్ని దేశం యెన్నటికీ మర్చిపోలేదు. ఆ సమయంలో వాళ్ళు హాలునిండా గుప్పించిన కరపత్రాల వివరాలూ తెలుసుకోదగ్గవే.

## హిందూస్తాన్ సామ్యవాద ప్రజాతంత్రసేన నోటీసు

నిరంకుశ బ్రిటిష్ ప్రభుత్వం గతపదేళ్ళుగా యేవేవో సంస్కరణలంటూ మా దేశపు ప్రజానీకాన్ని విపరీతమైన అవమానాలకు గురిచేస్తోంది. ఇది అందరికీ తెలిసిన విశేషమే. "భారతీయ పార్లమెంట్" అనబడుతున్న ఈ శాసనసభద్వారా కఠినశిలల్లాంటి మరో రెండు శాసనాల్ని యిప్పుడు ప్రజలనెత్తి మీద రుద్దడానికి ప్రయత్నం చేస్తున్నారు. ఇదీ అందరికీ తెలిసిందే.

ఇలా-దమననీతికీ, అవమానాలకీ గురవుతున్న క్లిష్ట పరిస్థితుల్లో హిందూస్తాన్ సామ్యవాద ప్రజాతంత్ర సంస్థమీద ఎనలేని బాధ్యతవుంది. ఈ బాధ్యతా నిర్వహణలో మమ్మల్ని మావంతు చర్య జరపవలసిందిగా మా సంస్థ ఆదేశించింది. ఈ రూపంగా మేం ఘూ ఘుమ్కర ప్రభుత్వానికో హెచ్చరికచేస్తున్నాం!

చట్టాలపేరుతో వారాడుతున్న కపటనాటకాన్ని వారు తక్షణం ఆపివెయ్యాలి. విదేశీదోపిడీ దార్లయిన మీ "చట్టబద్ధ పాలన" అనే బూటకపు ముసుగుని మేం చించివెయ్యడం ఖాయం. అన్నివర్గాల ప్రజల్ని విప్లవాయత్తుల్నిచేసి, విదేశీ దుష్ట పాలనకు వ్యతిరేకంగా నిలబడి పోరాడేట్టు చెయ్యగలం.

భారతీయ ప్రజాకోటిపక్షాన, అభివృద్ధినిరోధక పాలనకు వ్యతిరేకంగా-లాలాలజపతిరాయ్ హత్యకు ప్రతీకారంగా మేమీ చర్యకు పూనుకున్నామని విదేశీపాలకులకు తెలియజేస్తున్నాం.

మేం-మానవజీవితం సర్వోత్కృష్టమయిందిగా భావిస్తాం. ప్రతివ్యక్తీ సంపూర్ణ స్వేచ్ఛను అనుభవించేట్టు గ్యారంటీఇవ్వగల ఉజ్జ్వల భవిష్యత్తే మా ధ్యేయం. మానవరక్తం ప్రవహింపజేయ వలసిన పరిస్థితులు దాపురిస్తే అందుకు మేం విచారిస్తాం. కాని- మా విప్లవంవల్ల మేంకోరేది సంపూర్ణ స్వేచ్ఛాస్వాతంత్ర్యాల్ని, ఒకమనిషి మరొకర్ని దోచుకోడానికి వీల్లేని నవసమాజ నిర్మాణాన్నే!

మానవజీవితం అమూల్యమయింది. దాన్నిఅర్థాంతరంగా తుంచివేసేహక్కూ, అధికారం యెవరికీలేవు. ఈ భావాన్ని పరి రక్షించడంలో మేం ఎవరికీ తీసిపోం. మేం వ్యతిరేకిస్తోంది ఒక మతాన్నో, ఒకజాతినో, ఒకవ్యక్తినో కాదు. మా బద్ధశత్రువు సామ్రాజ్యవాదమే! ఆ దుర్విధానాన్ని నిర్మూలించడానికే మేం కడకంటా పోరాడతాం.

దౌర్జన్యాం, హత్యలు, విధ్వంసాలే విప్లవమని మేం భావిం చడంలేదు. అయితే-మానవులందర్నీ సోదరులుగా భావిస్తూ,

అందరి సుఖశాంతులకోసమూ కృషిచేసే నవసమాజ స్థాపనకు అవసరమయితే ఆయుధాల్ని ఉపయోగించడానికి వెనుకాడం. విప్లవం వర్ధిల్లాలి!"

ఈ కరపత్రంకూడా విప్లవసంస్థ పంజాబుప్రాంత శాఖ సేనాని బలరాజ్ సంతకంతోనే వెలువడింది. ఈ కరపత్ర విశేషాలు ప్రజాకోటికంతటికీ తెలిసి-ఎక్కడ నలుగురు చేరినా యీ అంశాలే చర్చనీయాంశాలూ, ప్రశంస నీయాంశాలూ అయ్యాయి.

ప్రభుత్వం క్రమంగా విప్లవవీరుల్లో చాలామందిని బంధించడమో, సంఘర్షణల్లో పొట్టనబెట్టుకోడమో జరిగింది. ఇలాంటి చర్యలు యెక్కువగా బెంగాలు, పంజాబు, ఉత్తరప్రదేశ్‌ల లోనే జరిగాయి. మిగిలిన ప్రాంతాల్లోకూడా విప్లవకారులకోసం గాలింపు తీవ్రతరంగా జరుగుతోంది.

ఆ కాలంలో హతశేషులైన విప్లవకారులు చాలామంది ప్రయాగ (అలహాబాదు)నే తమ ముఖ్య కేంద్రంగా చేసుకున్నారు. సర్వసేనాపతి చంద్రశేఖర ఆజాద్ కూడా అక్కడ నుంచే తన కార్యకలాపాలు కొనసాగించాడు. ఈ విషయం యెలాగో ప్రభుత్వానికికూడా తెలిసింది. అందువల్ల చంద్రశేఖర్‌ను గుర్తించగల వేగులవారినీ, పోలీసుల్నీ అలహాబాద్ అంతటా గాలించడానికి నియోగించారు.

ఈ విప్లవజోదులకు కట్రావీధిలోని లక్ష్మీదీదీ యిల్లు ముఖ్యాశ్రయంగా వుంటోంది. ఆమెకు "ప్రయాగ ముసలమ్మ" అనే మారుపేరు ప్రసిద్ధంగా వుండేది. ఆమె భర్త ఒకప్పుడు

విప్లవకారుల్లో ప్రముఖుడు. ఆజాద్‌కు కుడిభుజంగా మెలుగుతూ ఒకానొక సంఘటనలో అసువులర్పించిన యోధుడు. అతను అంతిమకోరికగా విప్లవకారులకు సహాయకారిగా వుండవలసిందని భార్యను ఆదేశించాడు.

అందువల్ల చంద్రశేఖర్ ప్రభృతులు ఎప్పుడు అలహాబాదు ప్రాంతాన తలదాచుకోడానికివచ్చినా లక్ష్మీదీదీ యింటో స్వాగతం, అతిథి మర్యాదలూ లభించేవి.

లక్ష్మీదీదీ అలాంటివారికి వంటచేసి వడ్డించడం, విశ్రాంతికి ఏర్పాట్లు చెయ్యడమేగాక - బిచ్చగత్తెలాగో, పిచ్చిదానిలాగో వేషాలువేసి పోలీసుల, అధికారుల రహస్యాలు సేకరించేది; విప్లవకారుల మధ్య వార్తలు నడిపేది; వారికి సాధ్యంగాని కొన్ని పనులు ఆమె చాకచక్యంతో నిర్వహించేది. తన యింటనే గాక - ఇతరచోట్ల కూడా సహచరుల్ని దాచిపెట్టగల సామర్థ్యం ఆమెకుంది. ఈ విధంగా ఆమె విప్లవకారిణియై భర్తకోరినట్లు తన జీవితాన్ని ధన్యం చేసుకుంది.

ఒకసారి కాన్పూరులో గజానన సదాశివపోద్దార్ అనే విప్లవకారుని పట్టుకోడంకోసం పోలీసులు డి. ఎ. వి. కాలేజి పరిసరాల్లో మోహరించివున్నారు. విప్లవసంస్థ సభ్యులు ఈ విషయాన్ని గమనించక అక్కడకువెళ్ళి పోలీసులవలలో పడిపోయారు.

మరొక కార్యక్రమం గురించి చర్చించడానికి చంద్రశేఖర్, వైశంపాయన్‌లకోసం-శాలిగ్రాం,శుక్లా, సురేంద్రనాథ పాండేలు ప్రభుత్వ కార్యాలయాల కూడలి ప్రదేశంలో వేచి

వుండాలనే వార్త అందింది. అందుకోసం వాళ్ళిద్దరూ సైకిళ్ళ మీద ఆ సంకేత స్థలానికి బయలుదేరారు. కొంతదూరం వెళ్ళే సరికి శుక్లా సైకిల్ చెడిపోయింది. దాన్ని అక్కడికక్కడ వెంటనే బాగుచేసే అవకాశంలేదు.

అందువల్ల పాండే అక్కడే వేచివుండగా - శుక్లా సైకిల్ను డి. ఎ. వి. కాలేజి హాస్టల్ వరకూ నడిపించుకువెళ్ళి ఏ విద్యార్థికో అప్పగించి రావాలని వెళ్ళాడు.

శుక్లా హాస్టల్ సమీపానికి చేరుతుండగానే తుపాకీలు ప్రేలాయి. పోలీసులు అతన్ని విప్లవకారుడుగా యెంచి బంధించ బోగా శుక్లా కాల్పులు ప్రారంభించవలసివచ్చింది. అతని కాల్పు లకు ఒక సార్జెంటూ, మరోపోలీసూ బాగా గాయపడ్డారు. కాని - పోలీసుల తుపాకులు శుక్లా శరీరాన్ని జల్లెడలా తూట్లు పడజేశాయి.

ప్రేలుళ్ళువింటూ ఆజాద్, వైశంపాయన్, పాండేలు తలోకత్రోవనూ అక్కడికి చేరుకున్నారు. అప్పటికే కూలిపడి పళ్ళబిగువున రివాల్వర్ పట్టుకునివున్న శుక్లా, మిత్రుల్ని చూడ గానే "ఖబేర్ - ఖబేర్" (జాగ్రత్త...చుట్టూ గమనించండి) అని హెచ్చరించి మరీ ప్రాణాలు వదిలాడు. మృత్యువు నోటిలో చిక్కివున్న తరుణంలో కూడా అతను మిత్రుల భద్రతకొరకే తన కొన ఊపిర్ని వెచ్చించాడంటే - అతని దేశభక్తి ఎంతటి మహత్తరమైందో మనం ఊహించవచ్చు.

శుక్లా హెచ్చరికతో అప్పటికి తప్పుకొనిపోయిన చంద్ర శేఖర్ మనసు కకావికలయింది. మిత్రుని శవానికి ఏ అపచారం జరుగుతోందో అనే ఆందోళన అతనికి విశ్రాంతి లేకుండా

చేసింది. అర్ధరాత్రివేళ మరోవేషం వేసుకుని ఆ కాల్పులు జరిగిన చోటికి వెళ్ళాడు.

అప్పటికి కొందరు ప్రజలు గుంపుగా చేరారేగాని శవాన్ని ఎవరూ కదిలించినట్టులేదు. శుక్లా సైకిల్ ఓ చెట్టుకు ఆనించి పెట్టివుంది; దానికి టిఫిన్ కేరియర్ కూడా అలాగే వ్రేలాడుతోంది. హేండిల్‌కు ఓ సంచి కూడావుంది. ఆ స్థితిలో సహచరుని కోల్పోయినందుకు చంద్రశేఖర ఆజాద్ హృదయం చాలా వికలం అయింది.

విప్లవ వీరశేఖరుడైన భగత్‌సింగ్, తదితరులూ ఉరితీయబడ్డారు. విప్లవదళంలో తనతో చేయీచేయీ కలిపి పనిచేసిన మిత్రులెందరో తమతమ విద్యుక్త ధర్మాలు నిర్వహిస్తూ శౌర్యధైర్యసాహసాల్ని ప్రదర్శిస్తూ వీరమరణం పొందారు. మరెందరో సభ్యులు జైళ్ళలో మ్రగ్గుతున్నారు. ఇవన్నీ చంద్రశేఖర్ మనసును పచ్చిపుండులా కెలికి వేస్తున్నాయి.

విప్లవ సంస్థ అతనొకనాడు అన్నట్టుగా బీటలువారి కూలిపోయే స్థితికి దిగజారిపోతోంది. ఆజాద్ మానసిక పరిస్థితి దయనీయంగా మారిపోయింది. కేంద్ర సంఘాన్ని రద్దుచేసి - ఏ శాఖకాశాఖ స్వతంత్రంగా తనకు తోచిన, చేతనైన కార్యక్రమాలు నిర్వహించవచ్చుననే స్వేచ్ఛ నివ్వడం మంచిదనుకున్నాడు.

1930 సెప్టెంబరు 4 వ తేదీన సాధ్యపడినంతమంది సభ్యుల్ని సమావేశపరిచిన ఆజాద్ - వారికి ప్రాంతాల వారీగా ఆయుధాలు పంచి యిచ్చాడు. ఎవరంతటవారు దేశమాత దాస్య

శృంఖలాల విచ్ఛేదానికి కృషిచెయ్యాలని నచ్చబలికాడు. కేంద్ర సంఘమంటూ యిక వుండదనీ, వ్యక్తిగా తన సాయం కావలసిన వారికి తోడ్పడ్డానికి తానెప్పుడూ సిద్ధంగా వుంటాననీ ప్రకటించాడు.

అతని మానసికస్థితి కకావికలం అయినట్లే - దేశంలో పరిస్థితులు కూడా నానాటికీ విషమిస్తున్నాయి. చంద్రశేఖర్‌ను ఏ విధంగానైనా బంధించాల్సిందనే హెచ్చరిక నూటొక్కటో సారి పోలీసు బలగాల్ని తొందర పెట్టింది. పోలీసులు వలలు పన్ని రోజురోజుకూ దగ్గరవుతున్నారని అనుమానంగావుంది.

ఈ క్లిష్ట పరిస్థితుల్లో చంద్రశేఖర్ కొంతకాలం మరే దేశానికైనా వెళ్ళివుండడం మంచిదని హితులు సూచించారు. బోల్షివిక్కుల సారథ్యంలో స్వేచ్ఛ, సుఖశాంతు లనుభవిస్తున్న రష్యాకు వెళితే అతను ప్రశాంతంగావుండి - వారి పోరాట, పాలనా విధానాలను గురించి కూలంకషంగా తెలుసుకునే అవకాశం వుంటుందని కూడా వివరించారు.

చంద్రశేఖర ఆజాద్ ఈ విధంగా రష్యా వెళ్ళడానికి కావలసిన డబ్బుకోసం వెదుక్కోవలసిన అవసరం కూడా లేక పోయింది. అజ్ఞాతవాసం చేస్తున్న యశపాల్ "సోహన్" అనే గుప్తనామంతో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూను కలుసుకున్నాడు. ఈ విషయం తెలియగానే నెహ్రూ 1500 రూపాయలు రొక్కం యిచ్చి పంపాడు.

కాని - చంద్రశేఖర ఆజాద్‌కు ఈ ఆలోచన నచ్చలేదు. మాతృదేశం పరాయి పాలననుంచి విముక్తం అయ్యేందుకు జీవన్మరణ పోరాటం జరుపుతోంది. ముద్దుబిడ్డ లెందరో అందు

కోసం తమ సుఖాల్నీ, జీవితాల్నీ కూడా వొడ్డి సమరంలో ముందడుగు వేస్తున్నారు. ఇటువంటి సమయంలో తాను తన భద్రతకోసం మరొక దేశానికి పారిపోడం తగదని అతడు వాదించాడు.

"దేశానికి నేనింకా సేవ చెయ్యగల్ను! నాలో శక్తి యుక్తులున్నంతవరకూ - చివరి రక్తపు బొట్టుకూడా వ్యయమై పోయేవరకూ దేశంలోనేవుండి, శత్రువులతో పోరాడ్డమే నా నిర్ణయం, నా ధ్యేయం" అని ప్రకటించాడు.

చంద్రశేఖర్ మరో ప్రతిపాదన కూడా చేశాడు. యశపాల్‌వంటి ఆధునిక విద్యావంతులు రష్యావంటి దేశానికి వెళ్ళి పరిశీలించి రావడం ఎక్కువ ప్రయోజనకరం అని నచ్చబలికాడు. 1931 ఫిబ్రవరి 27 వ తేదీన యశపాల్ బయలుదేరి రష్యా వెళ్ళాలని నిర్ణయం అయింది.

26 వ తేదీ రాత్రి అంతా ఆ యాత్రను గురించే యశపాల్, ఆజాద్‌లు ముచ్చటించుకుంటూ నిద్రమరిచిపోయారు. యశపాల్ ప్రయాణానికి తగు సామగ్రి సర్దుకున్నాడు. త్రోవలో ఈతిబాధల నివారణకు కొన్ని మందులు కూడా అవసరం అనిపించింది.

అతను అతి రహస్యంగా దేశాన్ని దాటివెళ్ళాలంటే ఆఫ్ఘనిస్తాన్ ద్వారా సరిహద్దులు దాటాలి. ఆ మార్గం దుర్గమ పర్వతాలతో ప్రమాద భరితంగా కష్టతరంగావుంటుంది. కొత్త వాతావరణంవల్ల యాత్రికులు జబ్బు పడవచ్చు. కొండలు ఎత్తయినకొద్దీ చలిగాలులు, మంచుపడ్డం ఎక్కువ. అంచేత కంబళ్ళూ, స్వెట్టర్లూ, ఉన్ని దుస్తులూ చాలా అవసరం.

జవహర్‌లాల్ నెహ్రూ అందజేసిన 15 వందల రూపాయలూ తనవద్దే వుంచుకోడం మేలుకాదని యశపాల్ ఓ అయిదు వందలుతీసి ఆజాద్ జేబులో పెట్టాడు. రష్యా యాత్రకు బయలుదేరేప్పుడు ఆ సొమ్ము తీసుకుంటానన్నాడు.

అవసరమైన మందులు వగైరా కొనడానికి యశపాల్ సైకిల్‌మీద బజారుకు బయలుదేరాడు. చంద్రశేఖర ఆజాద్ తనకు ఆల్ఫ్రెడ్ పార్కు దగ్గరలో కొంత పనివుందనీ, తననక్కడ దింపి వెళ్ళవలసిందనీ బయలు దేరాడు.

1931 ఫిబ్రవరి 27వ తేదీ ఉదయం పదిగంటల ప్రాంతాన ఆజాద్ వెనక కేరియర్ మీద ఎక్కగా యశపాల్ తన సైకిల్‌ను బస్తీలోకి నడిపించాడు. త్రోవపొడవునావాళ్ళు రష్యా పర్యటన గురించి ప్రయాణంలో బహుశా ఎదురయ్యే అడ్డంకుల గురించీ, అలాంటి సమస్యల గురించే మాట్లాడుకున్నారు.

"నువ్వు రష్యా చేరిం తర్వాత మన ఉద్యమాని కెలాంటి సహాయమైనా అందే వీలుంటుందేమో చూడు. అవసరమంటే నేను కూడా వస్తాను. నువ్వు అక్కడికి సురక్షితంగా చేరడం మీదే అంతా ఆధారపడి వుంటుంది. ఏదో ఒక విధంగా వార్తలు పంపుతూండు" అని ఆజాద్ మిత్రునికి పదేపదే చెప్పాడు.

ఆల్ఫ్రెడ్ పార్కు సమీపిస్తుండగా ఆజాద్ సైకిల్ దిగి "మళ్ళీ మనింట్లో కలుసుకుందాం. త్వరగా వచ్చెయ్" అని యశపాల్‌ను హెచ్చరించాడు.

ఆజాద్, మెల్లగా ఆల్ఫ్రెడ్ పార్కులోకి వెళ్ళి ఒక చల్లని చెట్టునీడల్లో కూర్చుని ఉన్నాడు. అప్పటికే పోలీసులు

వారినెన్నో గంటలుగా కనిపించని నీడల్లా వెంటాడివున్నారని-ఆ క్షణంలో పార్కు చుట్టూ సాయుధులు వల పన్నివున్నారనీ ఆ వీరాగ్రేసరునికేం తెలుసు, పాపం !

చుట్టుపట్ల ఏదో కొంత అలజడి సవ్వడి జరిగినట్టు అనుమానించినా ఆజాద్ అదేమిటో పరిశీలించాలనుకోలేదు. అంతలోనే రివ్వుమంటూ ఓ తుపాకి గుండు వచ్చి ఆజాద్ తొడలో దూరింది. అతను తుళ్ళింతగాలేస్తూనే తన జేబులోని పిస్తోలు తీసుకుని జవాబిచ్చాడు.

సరిగా గురి చూడకుండా ప్రేల్చిన ఆజాద్ పిస్తోలు గుండు పార్కు అవతల నిలబడివున్న ఒక పోలీసాఫీసర్ కారు టైర్ను బద్దలు జేసింది. ఆ ప్రక్కనే వంగివున్న ఆ అధికారి దవడకూడా ఆ దెబ్బకే చీలిపోయింది.

చుట్టూతా పోలీసులనుంచి గుళ్ళవర్షం. చంద్రశేఖర ఆజాద్ శరీరమంతా ఆ దెబ్బలకు హూనమై రక్తం ధారలై కారసాగింది.

అయినా అతను ధైర్యసాహసాలే బలంగా నిలదొక్కుకొని ఓ చెట్టు మ్రానుచాటుకు తప్పుకుని పొంచి చూచి కాల్పులు సాగించాడు. అదే విధంగా మరో చెట్టుచాటున నిలబడ్డ పోలీసు అధికారి "నాట్ బాబర్" చంద్రశేఖర్ మీదికి కాల్పులు జరిపాడు. ఆజాద్ గురిచూచి పేల్చగా ఆ ఆఫీసర్ కుడిచేతి మణికట్టు బదాబదలై వ్రేలబడిపోయింది.

అన్నివైపులనుంచీ ధన్ ధన్ మని తుపాకులు, పిస్తోళ్ళ ప్రేలుళ్ళు. చంద్రశేఖర్ ఎందరికని సమాధానంగా ప్రేల్చ

గలడు. ఇంక తన పిస్తోలులో ఒకే ఒక్క గుండు మిగిలిందని అంత కల్లోల సమయంలో కూడా గుర్తుంచుకో గలిగాడు.

అప్పటికే అతని తొడ ఎముక విరిగిపోయింది. ఒకచేయి చీలికలై రిబ్బన్‌లలా వేలాడుతోంది. శరీరం జల్లెడలా తూట్లు పడి రక్తం చిమ్ముతోంది. అరగంటకుపైగా ఏకాకిగానే ఎందరో పోలీసు గురిగాళ్ళను ప్రేలుస్తూ, బలిగొంటూ, గాయపరుస్తూ అరిభయంకరుడుగా, ప్రళయరుద్రుడులా వ్యవహరించాడు.

పోలీసులూ, వారి ఆఫీసర్లూ, యుద్ధనిపుణులూ అందరు చుట్టిముట్టి కూడా ఆజాద్‌ను సమీపంనుంచి కాల్చడానికి ఎవరికీ ధైర్యం చాలడంలేదు. అతడంత చాకచక్యంతో చిచ్చర పిడుగులా పిస్తోలు పేల్చుతున్నాడన్నమాట.

అంత భయంకర సమయంలోనూ అతను తాను ఎన్నడో చేసిన శపథాన్ని మరవలేదు. ఎడమచేత్తో పిస్తోలు పట్టుకుని తన కణతకు గురిపెట్టి చివరి గుండును కూడా సద్వినియోగం చేసుకున్నాడు. బ్రతికి వుండగా పోలీసులకు చిక్కనన్నమాట నిలబెట్టుకున్నాడు.

విప్లవజ్యోతి, విప్లవసేనాని - అనన్య సాహసిక దేశ భక్తాగ్రేసరుడు చంద్రశేఖర్ "ఆజాద్"గానే వీరమరణం చెందాడు. విప్లవజ్యోతి కొడిగట్టింది.

# వ్యక్తిత్వం

చంద్రశేఖర్ "ఆజాద్"గా తనను తాను అభివర్ణించు కున్న తీరు దేశస్థులు మరువలేరు.

అతను బ్రతికింది కొద్దికాలమే అయినా - తెలిసిన ప్రతి క్షణాన్నీ దేశంకోసమే వెచ్చించాడు. మాతృభూమి దాస్య బంధనాల్ని విడగొట్టేందుకు తన ప్రాణాల్నే ముడుపుగట్టిన మహత్తర దేశభక్తుడతడు.

తన జీవితంలో అధికభాగం కష్టాల కడలిలో ఈదాడు. కార్యనిర్వాహణలో నిమగ్నుడయివున్నప్పుడు అతడాకలిదప్పి కల్లి తలంచనేలేదు. రేయింబవళ్ళు ప్రాణాలరచేత పట్టుకుని క్షణమొక గండంగా బ్రతకవలసి వచ్చినా ఆజాద్ యెన్నడూ విప్లవపంథాను విడనాడే యోచన చెయ్యలేదు. ఒక్కోసారి పావలాడబ్బులుంటే తన సహచరులకు మరమరాలో, అటుకులో యేర్పాటుచేసి-తాను షడ్రసోపేతంగా భోంచేసినట్టు తృప్తి పడేవాడు. స్వార్థమన్నది ఈషణ్మాత్రమూ యెరుగని వ్యక్తి చంద్రశేఖర ఆజాద్.

1929 ప్రాంతంలో భగత్‌సింగ్, చంద్రశేఖర్, విజయ కుమార్‌సిన్హా కాన్పూర్‌లో ఒక చిన్నగదిలో అద్దెకుండేవారు. టీకికూడా కరువుగా వుండేది. పోలీసులు పొంచివున్నందువల్ల

వాళ్ళు బయటికివెళ్ళి ఏదయినా సేకరిద్దామన్నా వీలుకుదరని రోజులవి.

అలాంటిరోజుల్లో ఒకసారి బెంగాలునుంచి బటుకేశ్వర దత్తువచ్చి వారిని కలుసుకున్నాడు. ఏవో సంతోషకరవార్తలు చెప్పాడు. అందువల్ల మిత్రులు ఒక డబల్‌రొట్టె తెప్పించి "ఇదే విందు" అన్నారు. ఈ సంగతి తెలిసిన ఆజాద్ చాలా కోప్పడ్డాడు.

"ఇది మనం విందులూ, జల్సాలూ చేసుకునే సమయం కాదు. మనకోసం మృత్యువు పోలీసులనే కోరల్ని తెరిచి పొంచి వుంది. ఈ సంగతి మరువకండి" అని ఆజాద్ హెచ్చరించాడు.

మరొకసారి - విప్లవకార్యక్రమాలకోసం అత్యావసరంగా నాలుగువేల రూపాయలు కావలసి వచ్చాయి. ఆజాద్ ఒక మిత్రుని అప్పు అడిగాడు. ఆ మిత్రుడు ఆ రోజుల్లో వడ్డీ వ్యాపారంలో బాగా సంపాదిస్తున్నాడు. చంద్రశేఖర్ "నాకు అర్జంటుగా నాలుగువేలు కావలసివచ్చాయి. నువ్వు నాకుచితంగా యివ్వవద్దు. మళ్ళీ ఆరునెలల్లోగా నీకు వడ్డీతోసహా యిచ్చి వేస్తాను. వడ్డీలతోనే ఎంతో సంపాదించిన నువ్వు యీ అప్పు యివ్వడంద్వారా దేశసేవకు పరోక్షంగా తోడ్పడినట్టవుతుంది. నన్ను నమ్మి ఆ డబ్బు యివ్వ"మన్నాడు.

ఆ స్నేహితుడు మారుపలకలేదు. వాస్తవంగా తనవద్ద పైకం నిల్వలేదు. అందువల్ల మరొకరివద్ద అధికవడ్డీపై అప్పు చేసి తెచ్చి చంద్రశేఖర్‌కు నాలుగువేలూ యిచ్చి పంపించాడు.

ఆజాద్ ఆ అప్పుచెల్లించడానికి ఆరునెల్లదాకా ఆగాల్సిన

అవసరం లేకపోయింది. ఒకనాడతను ఒక అన్యాయార్జితంగల దుకాణంలో పట్టపగలు ప్రవేశించి, బెదరించి పధ్నాలుగువేల రూపాయలు తీసుకొచ్చాడు. అందులో నాలుగువేలు పూర్వ మిత్రునికి అప్పుకింద యిచ్చేశాడు.

ఆ మిత్రుడా డబ్బుతీసుకుని "ఆజాద్‌వంటి సత్యసంధుడూ దేశభక్తుడూ డబ్బుకోసం ఒకర్ని పీడించడం సమంజసంకా"దని మెల్లగా మందలించాడు.

ఆజాద్ అతని వాదాన్ని అంగీకరించలేదు. "నువ్వన్నది నిజమేకావచ్చు. కాని నాకింతకంటె మార్గాంతరం తోచలేదు. నేను దోచుకుంది మామూలుమనిషిని కాదు. ఆ వర్తకుడు పోలీసు సహాకారంతో దొంగసొత్తుల క్రయవిక్రయాలుచేసి చాలా అక్రమార్జనచేస్తున్నాడు. ఈ నిజం తెలిసే వాణ్ని దోచుకొచ్చాను. వాడికీ ఈ పధ్నాలుగువేలూ ఓ నష్టంకింద రావు" అన్నాడు.

చంద్రశేఖర్ గురిచూచి పిస్తోలు పేల్చడంలో అత్యంత సామర్థ్యంగలవాడు. ఈ సంగతి మిత్రులందరికీ తెలుసు. కాని-ఒకసారి పదుగురుతోకలిసి ఒక అడవిగుండా వెళుతున్నప్పుడు ఆజాద్ గురిని పరీక్షించాలని ఎవరికో ఆసక్తి కలిగింది. దూరంగా వున్న ఓ చెట్టుదిగువకొమ్మకు యింకా కిందుగా కనిపిస్తున్న ఒక ఆకునుకొట్టి చూపవలసిందని అడిగారు.

ఆజాద్ అలాగేనని తన పిస్తోలుతో గురిచూచి ఆ ఆకును కొట్టాడు. కాని-అది క్రిందపడలేదు. ఆశ్చర్యం! వెంట వెంటనే చంద్రశేఖర్ మరోనాలుగు గుండ్లుపేల్చాడు. అయినా

ఆ ఆకు పడిపోలేదు. అది అతనికూ్కడా విస్మయకరంగానే వుంది.

మిత్రులు ఆ చెట్టువద్దకువెళ్ళి ఆ ఆకును పరిశీలించగా-ఆ ఆకు క్రిందకిరాలలేదుగాని దానికి అయిదుగుండ్ల రంధ్రాలూ ఏర్పడివుండి చంద్రశేఖర్ గురికి నిదర్శనం అన్నట్టు కనిపించాయి.

ఝాన్సీలో వుంటున్నకాలాల్లో ఒకప్పుడు ఒక సర్దార్ యింట ఆజాద్వున్న చరిత్ర మనకు తెలిసిందే. మరోసారి కొంత కాలం ఒక రాజావారి భవనంలోకూడా సాధువులాగా అతను తలదాచుకున్నాడు. ఆరాజా ఎల్లప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ ఉల్లాసంగా కాలం గడిపేవాడు. చంద్రశేఖర్కు ఆయన ధోరణి ఎంతో నచ్చింది.

ఆ కాలంలో ఆ రాజావారిస్థితి ఆర్ధికంగా చాలా చితికి పోయివుంది. ఆయనకు చంద్రశేఖర్ చరిత్రంతా తెలుసు. అతన్ని ప్రభుత్వ తాబేదారుల కప్పగిస్తే చాలా మొత్తం బహుమతిగా లభిస్తుందనికూడా తెలుసు. వంశగౌరవం కాపాడుకునేందుకు ఆ రాజావారు కొన్ని సందర్భాలలో ఆచారప్రకారం విందులు చెయ్యవలసివచ్చేది, దానధర్మాలు చెయ్యవలసివచ్చింది. అందుకోసం అయన తన స్వంతఖర్చులు మానుకుని చాలా యిబ్బందిపడేవాడు. ఇది ఆయనవద్ద మిగిలిన గుమాస్తాకుకూడా చాలాకష్టం కలిగించేది.

చిరకాలంగా ఆ రాజావారి కొలువులోవున్న నమ్మిన బంటువంటి ఆగుమాస్తా ఒకనాడు రాజావారికి ఒక దివ్యోపదేశం

చేశాడు. అది రాత్రివేళ. ఆజాద్ నిద్రపోతున్నాడు. రాజావారు ఆర్థిక యిబ్బందులగురించి వాపోతున్నారు. ఈ గుమాస్తా గుసగుసలాడుతూ "రాజావారు ఒకే ఒక్క ఉపాయం చేబడితే చాలు-ఈ యిబ్బందులన్నీ కొంతకాలం దూరం అవుతాయి. ప్రభుత్వం మెప్పుకూడా లభిస్తుంది" అన్నాడు.

అలాంటి ఉపాయమేదో చెప్పవలసిందని రాజాగారు అడిగారు. గుమాస్తా "ఈ హరిశంకర బ్రహ్మచారి (అజ్ఞాత వాసంలో ఆజాద్ మారుపేరు. సాధువు వేషంగదా!) నిజంగా యెవరో మీకు తెలిసిందే. ఇతణ్ణి పట్టి యిస్తే సర్కారువారు పెద్దమొత్తం బహుమతి యిచ్చి, పోలీసు బలగం యావత్తూ చాలాకాలంగా సాధించలేని పనిని మీరుచేసినందుకు బిరుదులూ, సన్మానాలూ చేస్తుంది రాజావారూ" అని నివేదించాడు.

రాజావారు ఆ విషయం ఆలోచించసాగారో ఏమో, ఏమీ మాట్లాడకుండా వూరుకున్నారు. నిజానికి ఆజాద్ నిద్రపోక-ఆ మాటలన్నీ విన్నాడు. వంటింటికుందేలులా వున్న తనను నిజంగానే వాళ్ళుపట్టి పోలీసులకుఅప్పగించగలరని అనుమానించగానే చంద్రశేఖర్ హృదయం క్రోధావేశాలతో ఉడుకులెత్తింది. వెంటనే వాళ్ళకు బుద్ధిచెప్పాలన్నంత ఆవేశం పెల్లుబికింది.కాని-అది తనకు అనువైన తరుణంకాదని-కోపం అణచుకుని, నిద్రపోతున్నట్టే వుండిపోయాడు.

వాళ్ళ గుసగుసలు తాను విన్నట్టు వారికేమాత్రమూ అనుమానం కలక్కుండా ప్రవర్తించి-ప్రమాదం ముంచుకురాక ముందే-ఆ రాత్రికి రాత్రే అక్కడనుంచి తప్పించుకుని బయట పడ్డాడు.

తర్వాత ఈ సమాచారం విన్నప్పుడు ఆజాద్ మిత్రులు కోపోద్రిక్తులయ్యారు. వెంటనే వెళ్ళి ఆ గుమాస్తానీ, రాజా వార్నీ హతమార్చి వస్తానని ఒక కార్యకర్త బయలుదేరాడు.

చంద్రశేఖర్ అతన్ని వారించాడు. "బానిస దేశంలో ప్రభుత్వ గులాములకూ, తాబేదార్లకూ లోటు వుండదు. మనం అలాంటివాళ్ళనందర్నీ మట్టుబెట్టలేం. అదే కర్తవ్యమనుకుంటే నేనుమాత్రం నా పిస్తోలును ప్రయోగించకుండా వూరుకునే వాడినా? కాని - అది వారెతప్పుకాదు. రాజావారున్న ఆర్థిక మాంద్య పరిస్థితిలో యెంతయినా దిగజారి నీచానికి ఒడిగట్ట గలరు. పరిస్థితులు చక్కబడితే ఆయన మనవంటివారిని ఇంకా బాగా అర్థంచేసుకుని తోడ్పడే దొడ్డగుణం గలవాడని నా నమ్మకం". అని మిత్రుల్ని చల్లబరిచాడు.అతనివిశాలభావుకతా, వివరణా వార్ని ఆశ్చర్యచకితుల్ని చేశాయి.

ఆగ్రాలో బాంబుల కార్మాగారంకోసం వారు అద్దెకు తీసుకున్న యిల్లు వారికి గోప్యనివాస గృహంగానేగాక గ్రంథ పఠనానికీ, వ్యాయామసాధనకూకూడా పనికొచ్చేది. చంద్ర శేఖర్ తాను వ్యాయామం చేయడమేగాక మిత్రుల చేతకూడా కసరత్తు చేయిస్తూ తృప్తిపడేవాడు. అనేక మంచి మంచి పుస్త కాలు తెచ్చి తానుచదివి అందరిచేతా చదివించేవాడు. అయితే కథల పుస్తకాలూ, శృంగార సాహిత్యమూ అంటే అతనికిష్టం వుండేదికాదు. మత సాంప్రదాయాలు పాటించనివాడైనా అతనిమనసుమీద మతప్రభావం కొంతవుండేదేమో-స్త్రీలప్రేమ, సౌందర్యాల ప్రసక్తి సహించేవాడుకాదు.

తీరికసమయాల్లో రాజకీయ సిద్ధాంతాలూ, విప్లవ కార్య క్రమాలగురించి చర్చిస్తూ పిస్తోలును శుభ్రపరచడం, గురిచూచి అభ్యాసం చేయడం అతనికెంతో ఇష్టం. ఆయా చాకచక్యాల్ని సహచరులందరికీ నేర్పడం మరీ యిష్టం.

ఆదిలో అతను విప్లవసంఘంలో స్త్రీలను చేర్చుకోరాదని మొండిపట్టుదలతో వ్యవహరించేవాడు. కాలక్రమాన చంద్ర శేఖర్ అభిప్రాయం మారుతూవచ్చింది. తాముచేసే మంచిపనికి ఎవరెంత తోడ్పడినా మంచిదని భావించడం నేర్చాడు. క్రమంగా స్త్రీలకుకూడా ఆయుధాల ప్రయోగం, గురిచూచి కొట్టటంవంటివి తానే నేర్పడం జరిగింది.

అలాంటి సందర్భాలలో అతను మగపిల్లలతో వ్యవహ రించే సరళికి భిన్నంగా వ్యవహరించేవాడు. మగవారు సరిగా చెయ్యలేకపోతే విసుక్కుంటూ, కసురుకుంటూ భయపెట్టే ఆజాద్ స్త్రీ సభ్యులకు చాలా ఓర్పుతో ఆయా విషయాలు నేర్పడం, అతిసౌమ్యంగా వుండి అందరి సోదరప్రేమకూ పాత్ర మయ్యేది. దళంలో ఎవరయినా స్త్రీ సభ్యులపట్ల దురుసుగా, అనుచితంగా ప్రవర్తించారంటే శేఖర్ సహించేవాడుకాదు. వార్ని తల్లులకంటే గౌరవభావంతో చూడాలనేవాడు.

చంద్రశేఖర ఆజాద్ విప్లవసంఘ సారధిఅయ్యాక మితా హారీ,శాఖాహారీ అయ్యాడు. పిస్తోలు గురిచూచే అభ్యాసాలవల్ల పిట్టల్ని వేటాడ్డం అతనికి సరదాగానేవున్నా - మాంసాహారం ముట్టి ఎరగడు.

చుట్ట, బీడీ, సిగరెట్ వంటివన్నా; మత్తుకలిగించే ద్రవ,

ఘనపదార్థాలన్నా అతనికి ఏహ్యం. అందాకా ఎందుకు-అల్లం, వెల్లుల్లి వంటివికూడా వాడేవాడుకాదు. అయితే - తోటివారి ఆహారపు అలవాట్లను, చిన్నచిన్న బలహీనతల్ని అతను పట్టించుకునేవాడుకాదు, . గేలిచేసేవాడుకాదు. ఎవరి రుచి వారిది అనేవాడు.

ఈ విషయంలో అతనికున్న ఓర్పూ, సహనం అద్భుతా అని మిత్రులు చెప్పుకునేవారు. అతన్ని ఏడిపించాలని భగత్ సింగ్ ఒకోసారి ఆజాద్ తినే కిచిడీ (పులగం) అన్నంలో చిన్న మాంసంముక్కలుకలిపి పెట్టేవాడు.చంద్రశేఖర్ భోజనంచేస్తూ ఆ మాంసంముక్కల్ని ఏరిపారేస్తూ, చిలిపిచేష్టలు చేసినవార్ని తిట్టిపోస్తూ,మిగతాఅన్నం పూర్తిగాతినేవాడు. మరీచాదస్తంగా ఆ ఆహారాన్ని పారేసేవాడుకాదు. మాంసాన్ని తాకితేనే అపవిత్రత అంటుతుందనే ఛాందసం ప్రదర్శించడం ఎరుగడు.

విప్లవసాహిత్యం చదవడంవల్లా, విప్లవకారులతో సన్నిహిత పరిచయాలవల్లా చంద్రశేఖర్ వంటివారు క్రమంగా మతాచార సంప్రదాయాల బంధనాలనుంచి విడివడగలిగారు. వారు కొంతయినా మార్క్స్ - ఏంగిల్స్‌ల గతితార్కిక భౌతిక వాద మార్గాన్ని అనుసరించసాగారు.

అందువల్లనే అనేక యాతనలెదురయినా, చెరసాలల్లో మ్రగ్గవలసి వచ్చినా వాళ్ళు 'దైవచింతన' అనే భ్రమల్లోకి మళ్ళలేదు. చివరికి ఉరికంబాలెక్కేప్పుడుకూడా దేవుణ్ణి తలుచుకోవాలనే సలహాల్ని పాటించకుండా దేశభక్తితోనే నినాదాలు చేశారు.

భగత్సింగ్ కంఠానికి ఉరితాడు బిగిసేపుడుకూడా "విప్లవం వర్ధిల్లాలి...సామ్రాజ్యవాదం నశించాలి" అనే నినదించాడు. ఈ నినాదాలు పూర్తిగా భౌతికవాదపరమైనవేగాని ఆధ్యాత్మిక వాసనల్లేవుగదా! ఈ విధంగా చరమక్షణాల్లోకూడా విప్లవకారులు మనోనిబ్బరంతో గట్టిగా నిలబడ్డానికి ఒక మంచి ఉదాహరణ ఫతేఘడ్ సెంట్రల్ జైలులో జరిగింది.

ఆ జైల్లో రాజకీయఖైదీలు ఒకప్పుడు నిరసనవ్రతం పాటించారు. ప్రభుత్వ దమన విధానాలకు వ్యతిరేకంగా జరిగిన ఆ దీక్ష చాలాకాలం కొనసాగింది. వారిలో ప్రసిద్ధ అగ్రశ్రేణి విప్లవకారుడు మణీంద్రబెనర్జీకూడావున్నాడు. ఆయన ఆరోగ్యం పదిహేనురోజుల ఉపవాసంవల్ల చాలాక్షీణించిపోయింది. లోగడ నుంచీ వున్న గుండెజబ్బు ఇప్పుడెంతో తీవ్రమయింది. కంటి చూపు మందగించింది. కాళ్ళూ చేతులూ వాపు చూపాయి.

మణీంద్రబెనర్జీ యింక బతకటం కష్టమని అంతా అనుకున్నారు. ఆయన ఊపిరి పీల్చడంకూడా కష్టతరంగావుంది. శరీరం మెలికలు తిరిగిపోతోంది. అయితే ఆయన స్పృహాలోనే వున్నాడు. ప్రక్కనున్నవారిలో ఒకరు "చివరినిమిషాల్లో దేవుణ్ణి తలుచుకోటం మంచి"దని చెప్పారు.

వెంటనే ఆయనకోపం ముంచుకొచ్చింది. "డ్యామ్ యువర్ గాడ్! డ్యామ్ హీజ్ మెర్సీ!! మరణానికి ముందు దేవుడు దర్శనమిస్తాడని ప్రతివాడూ వాగుతూంటాడు. కాని— నాకిపుడు చిరుచీకటితప్ప యేమీ కనిపించడంలేదు. ఈ తుది ఘడియల్లో నాకు పిరికిమందు పొయ్యకండి" అని విసుక్కున్నాడు.

ఆ వెంటనే ఆయనకో వెక్కిలిరావడం, ప్రాణవాయువు అనంతంలో కలిసిపోడం జరిగాయి. హిందూస్థానీ సమాజవాద ప్రజాస్వామ్యసంస్థ సభ్యులకు మతమౌఢ్యాలు లేవనడానికి ఇదో నిదర్శనం మాత్రమే. భగవతీచరణ్ వంటివారుకూడా అంతిమ ఘడియల్లో యెంతో మనోస్థయిర్యాన్ని ప్రదర్శించారుగదా!

విప్లవకార్యకర్తల్లో హిందూ, ముస్లిం, క్రైస్తవ,సిక్కు మొదలయిన అనేక మతాలవారున్నారు. అయితే వాటిని ఎన్నడో మరచిపోయినట్లే ప్రవర్తించేవారు.

భగత్‌సింగ్ చిన్నప్పుడు తమ కుటుంబాచారాల ప్రకారం శుద్ధశ్రోత్రియుడులా త్రికాల సంధ్యావందనంచేస్తూ, జంధ్యం వేసుకుని వుండేవాడు. తరువాత అతనికి జందెమన్నా, సంధ్యావందనమన్నా, దేవుడన్నా చిర్రెత్తుకొచ్చేది. అజ్ఞాత వాసం గడపవలసి వచ్చినప్పుడు మాత్రమే జందెం వగైరా వేషాలువేసి నటించేవాడు.

పైగా దైవచింతన, పూజాపునస్కారాలవంటివి - ఆత్మ శక్తిమీద నమ్మకంలేని హైన్యానికి నిదర్శనం, తనను తాను కించ పరచుకోవడమేనని భగత్‌సింగ్ ఉద్ఘాటించేవాడు. ఆజాద్, భగవతీచరణ్, యశపాల్‌వంటివారందరూ ఈ ధోరణిలోనే జీవి తాలు మలుచుకున్నారు.

యశపాల్ రచించిన "సింహావలోకనం"లో ఈ విప్లవ సంస్థ సభ్యుల వ్యక్తిత్వాలనుగురించి అనేక ఆసక్తికరమయిన అంశాల్ని పొందుపరచాడు. ఆజాద్ వ్యక్తిత్వాన్ని అతను కొనియాడాడు.

## విశిష్టత

ఆజాద్ జీవనసరళి, త్యాగశీలం, దీక్షాదక్షత, ఓరిమి, త్రికరణశుద్ధి-సహచరులనెంతో ప్రభావితంచేసేవి.

అతను పార్టీ క్రమశిక్షణ తూచా తప్పకుండా పాటించే వాడు. ఆ విషయంలో చంద్రశేఖర్ ఎవరి అంచనాలకూ అంద నంత ఎత్తుకు ఎదిగిపోయాడు.

ఆజాద్ వ్యక్తిత్వాన్ని ఓవేపునుంచి చూస్తే మధ్యాహ్న సూర్యబింబంకంటే వేడీ వాడీ గలదనిపించేది-మరోవైపునుంచి పూర్ణచంద్రుని వెన్నెలల ప్రసారంలాగా వుండేది.

అతను స్త్రీలనెంతో గౌరవంగా ఆదరభావంతో చూడ్డమే గాక-వారిపట్ల వక్రంగా ప్రవర్తించినవారు తన పిస్తోలుకు గురి కావలసిందేననేవాడు.

విప్లవకార్యక్రమాలకు సేకరించింది ప్రజాక్షేమంకరమైన నిధేనని-దానికి తానొక ధర్మకర్తనని, రక్షకభటుడననీ అనేవాడు. అందులో ఒక్కపైసా వృథాఅయినా మన్నించననేవాడు. స్వంతానికి రాగిదమ్మిడీ తీసుకునేవాడుకాదు.ఎప్పుడూ మూడవ తరగతిలోనే పయనించేవాడు.

మిత్రులెవరయినా 'సినిమా' అంటే 'శుద్ధదండుగ' అనే

వాడు. కొందరు తమ భోజనాలూ, టీ ఖర్చులూ మానుకుని సినిమాలకు వెళ్ళవలసి వచ్చేది. ఆ సంగతి తెలిస్తే ఆజాద్ చాలా విచారించి కోప్పడేవాడు.

చంద్రశేఖర్‌కు దుస్తులుకూడా చాలా తక్కువగా, అతి సామాన్యంగా వుండేవి. తన కుటుంబానికీ, భవిష్యత్తుకూ కొంత సంపాదించి దాచాలనే ఆలోచనే వుండేదికాదు. అసలు తన వ్యక్తిగతాంశాల్ని, కుటుంబవిషయాల్ని తనకాప్తులైన భగత్‌సింగ్, యశపాల్ వంటివారిక్కూడా చెప్పేవాడుకాదు.

ఆజాద్ విప్లవసంస్థ సర్వసేనాపతియైనా సిద్ధాంతకర్తను కాదనేవాడు. విధాన నిర్ణయాలు చెయ్యాలనే ప్రయత్నం అతడెన్నడూ చెయ్యలేదు. అదంతా భగత్‌సింగ్ ప్రభృతుల పని అనేవాడు. వాళ్ళుచేసిన నిర్ణయాల్ని అమలుపరచడానికే తన సేనాధిపత్యం అనేవాడు. కార్యాచరణ నాయకత్వంలో తన సత్తా అద్వితీయమని అనేకసార్లు నిరూపించుకున్నాడు. ప్రమాద కరమైన కర్తవ్యాన్ని నిర్వహించవలసివస్తే తానే ముందంజలో వుండేవాడు.

అయితే-సహచరులు తమ సర్వసేనాధ్యక్షుణ్ణి సర్వదా పరిరక్షించుకోవాలనే దీక్షతో-అతన్ని ప్రమాదాల్లో చిక్కుకోకుండా కాపాడుకోడం ముఖ్య బాధ్యతగా వ్యవహరించేవారు.

ప్రభుత్వం చంద్రశేఖర ఆజాద్‌ను ఎలాగైనా బంధించి శిక్షించాలనే ప్రయత్నాల్ని దినదినం తీవ్రతరం చేస్తుంటే - దళ సభ్యులు అది తమకందరికీ సవాలుగా భావించి, వేయికళ్ళతో

ఆజాద్‌ను కాపాడుకోజూచేవారు. అందుకే వాళ్ళు తాము నిర్వర్తించగల కార్యక్రమాల్లోకి నాయకుడు చొరబడరాదంటూ అతని కర్తవ్యభారాన్ని తగ్గించేవారు.

విప్లవసంస్థ అవసరాలనిమిత్తం చంద్రశేఖర్ ఒకమిత్రుని వద్ద నాలుగువేలు అప్పుచేసిన విషయం లోగడ విన్నాం. ఒక అన్యాయార్జనల వ్యాపారిని పట్టపగలు దోచితెచ్చి ఆ అప్పు తీర్చిన విధంకూడా తెలుసుకున్నాం. ఆజాద్‌వద్ద యింకా పది వేల రూపాయలు నిల్వవున్న సమయంలో-కొందరు సహచరులు "భాంవరా" గ్రామంలో అతని తలిదండ్రులు ఎంతో పేదరికం అనుభవిస్తుంటారనే విషయంపై గుసగుసలాడుకుంటున్నారు. అది వినగానే ఆజాద్ వార్ని కోప్పడ్డాడు.

నేను నా తలిదండ్రులకోసం యెక్కడో బిచ్చమెత్త బోవడంలేదు. ఇది నేను ప్రాణాలొడ్డి సాధించిన ధనం!!

అందువల్ల దీన్ని నా యిష్టంవచ్చినట్టు వాడుకునేహక్కు నెవరూ కాదనలేరు. కాని-నేనట్లా వాడలేను. ఈ ధనం మొత్తం మన మాతృదేవి శృంఖలాల విచ్ఛేదన క్రియలకే వినియోగ పడాలి!

"నేను కేవలం నా తలిదండ్రుల్నిగురించే ఆలోచించడం అర్థంలేనిపని. వారికి ఆర్థికబాధలులేకుండా చెయ్యాలంటే ఇద్దరికీ రెండు పిస్తోలుగుళ్ళుచాలు!! అప్పుడు వారికిక ఏ సమస్యా వుండదు. అంతకంటే నేనేసహాయమూ వారికి చెయ్యలేను.

కాబట్టి ఇకముందెప్పుడూ వారి ప్రస్తావన చెయ్యకండి" అని గట్టిగా మందలించాడు.

అయినా-మరోసారికూడా యీ సమస్యే చంద్రశేఖర్‌కు యెదురయింది. ఒకప్పుడు భగత్‌సింగ్‌కు పాత్రికేయుడుగా అవకాశం యిచ్చిన "ప్రతాప్" పత్రికా సంపాదకుడు, విప్లవసంస్థ ప్రోత్సాహకుడు శ్రీ "గణేశ్ శంకర విద్యార్థి"ని ఒకసారి అజాద్ కలుసుకున్నాడు. అప్పుడాయన భాంవరా గ్రామంలో అజాద్ తలిదండ్రులు వృద్ధులై సంపాదనలేక ఎన్నో యిబ్బందులు పడుతున్నారని తెలిసిందన్నాడు. ఆ ముసలి దంపతుల క్షేమార్థమైనా తాను సాయంచేయగలనేమోననే ఉద్దేశంతో అజాద్‌కు రెండువందల రూపాయలుకూడా యిచ్చి భాంవరా పంపించమన్నాడు.

అజాద్ మరోసారి ఆయన్ని కలుసుకున్నప్పుడు యీ సంగతీ, తలిదండ్రుల విశేషాలూ గణేశ్ శంకర విద్యార్థి అడిగాడు. చంద్రశేఖర్ చేదుగా నవ్వాడు: నాతలిదండ్రులు కనీసం రెండురోజులకైనా ఒపూట భోంచేస్తూండవుంటారు. కాని-దేశంలో లక్షలాదిమంది గంజినీళ్ళుకూడా దొరకని నికృష్టజీవితాలనుభవిస్తున్నారు. అలాంటి అందరిబాధల్నీ దూరంచేద్దామని మా కృషి! నా తలిదండ్రులు అన్నంలేక పస్తులున్నా ఫరవాలేదు-అలాంటివారు రోజుకెందరో ప్రాణాలు విడుస్తున్నారు. కాని-నా సహచరుల్ని మాత్రం ఆకలితో మాడ్చి చంపుకోలేను"

అన్నాడు. అప్పుడతని వదనంలో విషాదం గూడుకట్టుకునివున్నా చిరునవ్వు తొణికింది.

చంద్రశేఖర ఆజాద్ ఎటువంటి విపత్కర పరిస్థితుల్లో నయినా మనోస్థయిర్యంకోల్పోక,దృఢిమతో సమయస్ఫూర్తితో వ్యవహరించేవాడనడానికి అనేక నిదర్శనలున్నయ్.

ఒకసారి ఆజాద్ ఒక కార్యకర్తతోకలిసి ఢిల్లీ వెళ్ళాల్సి వచ్చింది. అతనేమో అజ్ఞాతవాసంలోనే వున్నాడాయె. ఖాకీ నిక్కరు, కోటు హ్యాటు-పోలీసు ఇన్స్పెక్టర్ లాగా డ్రెస్ చేసుకున్నాడు. ఎవరూ గుర్తుపట్టరని, దర్జాగా మిత్రునితో బయలుదేరాడు. కాని ప్రభుత్వానికి అతని ప్రయాణం సంగతెలాగో తెలిసిపోయింది.

వాళ్ళు రైలుప్రయాణంచేసి ఉదయం ఏడుగంటలకు ఢిల్లీలో దిగుతుండగా పోలీసులు సాయుధులై బిలబిలమంటూ రైలును చుట్టుముట్టారు. ఆజాద్ వున్న రైలు పెట్టెద్వారానికిరువైపులా ఇద్దరు పోలీస్ అధికార్లు పిస్తోళ్ళతో సిద్ధంగా వున్నారు. ఇక ఆజాద్‌ను గుర్తించి బంధించడం తప్పదనిపించింది.

అయినా చంద్రశేఖర్ ఏ మాత్రమూ తొట్రుపడలేదు. ఒక కూలీనిపిలిచి సామాను ఎత్తించాడు. మిత్రునితోసహా ఆ పెట్టెనుంచిదిగి బయటికి నడిచాడు-ఆఫీసర్లను చూచీచూడనట్లే!

అప్పుడతను ఎడంచేత్తో రైలుటిక్కెట్లు పట్టుకునివున్నా-కుడిచేయి నిక్కరుజేబులోవున్న రివాల్వర్‌ను పేల్చడానికి సిద్ధంగావుందనీ, అతను గొప్పగురికాడనీ గుర్తించగలిగిన పోలీస్ ఆఫీసర్‌కూడా తెలియనట్టు ఊరుకున్నాడని ఆ తర్వాత వెల్లడయింది. ఆజాద్ సహచరునితో నిశ్చయంగా ఢిల్లీలోగమ్యానికి చేరాడు.

మరొకసారి అతనెక్కడినుంచో వచ్చి కాన్పూర్‌లో రైలుదిగాడు. అతనిరాకకోసమే పోలీసులెందరో వేచివున్నారు. వాళ్ళు రైలుస్టేషన్‌లో ప్రతి అంగుళాన్నీ గాలించడం మొదలెట్టారు. ఆజాద్‌ను బాగా గుర్తించగలిగిన సి.ఐ.డి. ఆఫీసరొకడు అతనికోసం అప్రమత్తంగా చూస్తున్నాడు. అతను ఆజాద్‌ను తేలిగ్గా గుర్తించాడు. ఇక అతనిదృష్టినుంచి తప్పించుకోడం అసంభవమనిపించింది.

అయినా - చంద్రశేఖర్ ఆజాద్ తొట్రుపడలేదు. ధైర్యంగా సూటిగావెళ్ళి ఆ సి. ఐ. డి. ఆఫీసర్ భుజంమీదనే చాలాకాలానిక్కలిసిన మిత్రుడిలా ఓ చెయ్యివేసి అవతలికి నడిపించసాగాడు. ఏవో కుశలప్రశ్నలు వేస్తున్నాడు. రెండోచేయి కోటుజేబులో "ట్రిక్ ట్రిక్" మనిపిస్తోంది. ఆజాద్ అతనితో "చూడుమిత్రమా! మనం ప్రాణాలకు తెగించడం అనవసరం. ఎవరిపనిమీదవాళ్ళం వెళ్ళిపోదాం-మరికొంతకాలంబ్రతుకుదాం" అన్నాడు.

ఈ సాహసాతిరేకానికి ఆ ఆఫీసర్ నివ్వెరచెందాడు. ఆజాద్ చేతిపట్టును తప్పించుకోలేనట్టు నడిచాడు. బయట గోడ కానించివుంది-ఆ ఆఫీసర్ సైకలు. చంద్రశేఖర్ ఆ సైకిలే తీసుకుని "టా-టా"చెప్పి వేగంగా బస్తీలోకి వెళ్ళిపోయాడు. ప్రతిక్షణం-ఆజాద్ కుడిచేయి అతని కోటుజేబులోని రివాల్వర్ ట్రిగ్గర్‌ను సరిజేస్తోందని ఆ ఆఫీసర్‌కు తెలుసు. అందువల్ల ఏమీ సాహసించలేకపోయాడు. ఎవర్ని అరెస్టుచెయ్యాలని వచ్చాడో అతనికే (అనుకోకుండా) తప్పించుకోడానికి సాయపడ్డ ఆ ఆఫీసర్ మనస్సెమైపోయివుంటుందో!

"హరిశంకర బ్రహ్మచారి" అనే సాధువు వేషంలో బ్రతికిన కాలంలో ఆజాద్ కొన్నిరోజులు రుద్రనారాయణసింగ్ (ఝాన్సీ) అనే డ్రాయింగ్‌మాష్టర్ యింట్లో వున్నాడని మనం చదివాం. ఆ మాష్టర్ గొప్ప చిత్రకారుడూ, ఫోటోగ్రాఫరూ కూడా! విప్లవవీరశేఖరుడైన ఆజాద్ ఫోటోను తీసుకోవాలని అతడెంతో ముచ్చటపడేవాడు. కాని,ఆజాద్ అతని కాఅవకాశం చిక్కనిచ్చేవాడుకాదు.

ఒకసారి ఆజాద్ స్నానంచేసి, అంగవస్త్రం చుట్టుకుని వచ్చేసరికి రుద్రనారాయణ్ కెమెరాతో సిద్ధంగావుండి "ఇప్పుడిక నీ ఫోటో తియ్యకుండా వదల్ను" అన్నాడు. చంద్రశేఖర్ ఏ

ధోరణిలో ఆలోచించాడో ఏమో-"అలాగే! నన్ను నామీసాలు ఎక్కుపెట్టుకోనీ" అంటూ మీసాన్ని సవరించుకోసాగాడు.

ఆ సమయంలో మాష్టారి కెమేరాక్లిక్ మని రికార్డు చేసిన ఫోటోయే దేశానికి దక్కింది. చొక్కాకూడా లేని వస్త్రాదులా, గోదాలోదిగి సవాల్ చేస్తున్నట్టు మీసాల్ని మెలివేస్తున్న ఆజాద్ ఫోటో ఒక్కటే జాతికి తెలిసి, నతులందుకుంది-ఇంకా గౌరవించ బడుతోంది.

చంద్రశేఖర ఆజాద్ కూ, సర్దార్ భగత్ సింగ్ కూ మధ్య తొలి పరిచయం జరిగిన తీరు చాలా విచిత్రంగా వుంది. "ప్రతాప్" పత్రిక శ్రీ గణేశశంకర విద్యార్థి సంపాదకత్వాన కాన్పూరునుంచి వెలువడేది. ప్రతిసంచికా దేశభక్తి ప్రపూరిత మైన వ్యాసాలతో, దేశభక్తుల వార్తలతో వెలువడుతున్న ఆ పత్రికంటే బ్రిటిష్ వారికీ, ప్రభుత్వాధికారులకీ యెంతో కంట గింపు. అయినా ఆ పత్రిక భయపడేదికాదు. దేశస్వాతంత్ర్య మహాయజ్ఞంలో బలికావడానికూడా సిద్ధపడాలని "ప్రతాప్" యువజనులకు పిలుపు యిచ్చేది. గణేశశంకర్ విద్యార్థి యీ పత్రికను నడపడంతోపాటు-విప్లవకార్యక్రమాలకు సానుభూతి సమకూర్చి, విప్లవకారుల్ని భద్రంగా దాచడానికూడాసహాయ పడుతుండేవాడు. విప్లవసంఘాన్ని శాఖోపశాఖలుగా విస్తరింప జేసే పనిపై తిరిగేపుడు ఆజాద్ ఆయన్నికలుసుకుని యెంతో

అభినందించాడు. ఆయన అండదండలతోనే అతను కొంతకాలం లక్నోలోకూడా నివసించే వీలుకలిగింది.

ఆ సమయంలో భగత్‌సింగ్ లాహోర్‌నుంచి "విద్యార్థి" గారికొకలేఖ పంపించాడు. అందులో తాను కాన్పూర్ వచ్చి "ప్రతాప్" పత్రికలో కొంతకాలం పనిచెయ్యాలనే కోరికను వెల్లడించాడు. అతడంతకుముందే అ పత్రికకు గేయాలుగాని, చిన్నవ్యాసాలుగాని పంపిస్తే ఎడిటర్ ప్రచురించేవాడు.

భగత్‌సింగ్‌వంటి నవయువకుడూ, భావుకుడూ, విప్లవకారుడూ పత్రికలో పనిచేస్తానంటే వద్దనేదెవరు! వెంటనే రావలసిందని సంపాదకుడు జవాబువ్రాయడం, భగత్‌సింగ్ మరోలేఖ వ్రాయడం జరిగాయి.

ఈ విధంగా వారిమధ్య ఉత్తరప్రత్యుత్తరాలు జరుగుతూండగానే భగత్‌సింగ్ ఢిల్లీ వెళ్ళి "అర్జున్" అనే పత్రికలో సహాయకుడుగా చేరిపోయాడు. ఆ పత్రిక హఠాత్తుగా ఆగిపోయింది. అందువల్ల విద్యార్థిగారి ఆహ్వానం గుర్తువచ్చి భగత్‌సింగ్ కాన్పూరు వచ్చేశాడు.

నూనూగుమీసాల నూత్న యౌవనంలోవున్న భగత్‌సింగ్‌ను చూడగానే గణేశ్‌శంకర్ విద్యార్థి సంతోషాతిరేకంతో గాఢాలింగనం చేసుకున్నాడు. నాటినుంచి భగత్‌సింగ్

"ప్రతాప్" పత్రిక సంపాదకవర్గంలో "బల్వంత్" పేరుతో చేరి పోయాడు.

ఆ రోజుల్లో చంద్రశేఖర ఆజాద్ ఒకసారి కాన్పూర్ విద్యార్థిగార్ని కలుసుకోడానికి వెళ్ళాడు. ఆయన ప్రక్కనే కూర్చున్న కొత్తయువకుడు భగత్‌సింగ్, ఆజాద్‌కు తెలియదు. మరొకరిముందు బయటపడ్డం యిష్టంలేక ఆజాద్ వెనక్కి తిరి గాడు. విద్యార్థిగారు అతన్ని ఫరవాలేదు, రమ్మని-పిలిచి - తన సరసన కూర్చోవలసిందిగా ఆసనం చూపాడు.

భగత్‌సింగ్‌కు అతన్ని చూపి "బల్వంత్! నువ్వు చాలా కాలంగా కలుసుకోవాలంటున్న పండిట్‌జీ (చాలామంది ఆజాద్‌ను అలా పిలిచేవారు) ఇతడే"నని పరిచయం చేశాడు. భగత్‌సింగ్ దిగ్గునలేచి సెల్యూట్ చేసి "ఓహో, విప్లవదళ నాయ కుడు పండిట్ చంద్రశేఖర ఆజాద్ సాక్షాత్కారం!!" అంటూ సంభ్రమాశ్చర్యాలు ప్రకటించాడు.

ఆ యువకులిద్దరూ చిరపరిచయుల్లాగా పరస్పరం గౌర వించుకుంటూనే గాఢాలింగనం చేసుకుంటుంటే - గణేశ్‌శంకర్ విద్యార్థికళ్ళు ఆనందాశ్రువులతో నిండిపోయాయి. ఆ ఇరువురు వీరులూ రవి అస్తమించని బ్రిటిష్‌సామ్రాజ్యాధికారాన్ని గడ గడలాడించిన చరిత్రకు అప్పుడే అంకురార్పణజరిగింది!

చంద్రశేఖర్ "ఆజాద్" వీరమరణం చెందడానికి ముందు

జరిగిన మరో విశేషంకూడా చెప్పుకోదగ్గది. ఆ రోజున అలహాబాద్ ఆల్ఫ్రెడ్ పార్కులో ఆజాద్ చెట్టునీడను కూర్చుని ఉండగా పోలీసులు చుట్టుముట్టారు. ఆజాద్ వున్నాడో లేదో, వుంటే ఎవరో గుర్తించడానికి తగిన ఒక పోలీస్ ఇన్‌స్పెక్టర్ ఓ జవానుతో మెల్లగా (మఫ్తీలో) పార్కులో ప్రవేశించాడు. మరోచెట్టు చాటున నిలబడి పరికించి చూచాడు. తామింత కాలమూ వెదుకుతున్న ఆజాదేనని అతను వెంటనే నిర్ణయించలేకపోయాడు.

దాదాపుపదిసంవత్సరాలక్రితం కాశీలో మేజిస్ట్రేటు-సహాయ నిరాకరణోద్యమం సందర్భంగా కొరడాదెబ్బల శిక్ష విధించిన బాలుడికీ ఇతనికీ కొన్ని పోలికలున్నా-చాలామార్పులుకూడా వుండడంవల్ల ఆ ఇన్‌స్పెక్టర్‌కు అనుమానం కలిగింది. పై అధికారితో చెప్పి అనుమానం నివృత్తిచేసుకోవడం మంచిదని - అతను ఒక జవానును నాట్‌బాబర్ కోసం కబురంపించాడు.

ఈ విశేషాన్ని ఆ తరువాత నాట్‌బాబర్ అనే ఉన్నతోద్యోగి యిలా అభివర్ణించాడు:-

"ఆజాద్‌వంటి పోలికలున్న ఒక యువకుడు ఆల్ఫ్రెడ్ పార్కులో మరొకరితో కనిపించాడని ఇన్‌స్పెక్టర్ కబురంపించాడు. నేను వెంటనే కొందరు పోలీసులతోసహా వేన్‌లో ఆ పార్కుకు వెళ్ళాను. ఆ పరిసరాల్లో ఆ ఇన్‌స్పెక్టర్ జాడేలేదు.

కాని-కానింగ్ రోడ్డునుంచి పబ్లిక్ లైబ్రరీకి వెళ్ళే రోడ్డుదగ్గర్లో పార్కు లోపల ఓ చెట్టునీడలో యిద్దరు యువకులు కూర్చునివున్నారు.

"నేను మా వేన్‌ను ఆ రోడ్డువెంట సరాసరి వారిదగ్గర కంటా తీసుకెళ్ళి ఆపించాను. చేతిలో పిస్తోలు రెడీగా పట్టుకుని "మీరెవరు?" అని ప్రశ్నించాను. నా ప్రశ్నకు జవాబుగా వాళ్ళి ద్దరూ తృటిలో తమపిస్తోళ్ళుతీసి గురిపెట్టారు.

"వారిలో లావుపాటియువకుడు నావైపు గురిచూడ్డం గమనించి నేనేముందుగా నా పిస్తోలు పేల్చాను. ఆ గుండు అతనితొడలోకి దూసుకుపోయింది. అతనిగుండు నా మణికట్టును విరగగొట్టినట్టయి, నాచేతినుంచి పిస్తోలు జారిపోయింది. వెంటనే ధాన్ని నే నందుకుని ఓ చెట్టుచాటుకు తప్పుకున్నాను.

"అతడూ తను కూర్చున్న చెట్టుచాటుకు వెళ్ళాడు. మా యిద్దరిమధ్యా అడపాతడపా పిస్తోలుకాల్పులు జరుగుతూనే ఉన్నాయి.

"ఈ గందరగోళంమధ్య రెండో యువకుడు ఎప్పుడెటు తప్పించుకుపోయాడో తెలియదు. కాని-మరికొంతసేపటికి మరో చెట్టు చాటునుంచి ఇన్‌స్పెక్టర్ తొంగిచూస్తుంటే రెండో యువ కుడు ఎక్కడనుంచో పిస్తోలు పేల్చగా ఇన్‌స్పెక్టర్ దవడ తునా తునకలయిపోయింది."

ఈ విధమైన రిపోర్టును పోలీసాఫీసర్ నాట్ బాబర్ 1931 ఫిబ్రవరి 27వ తేదీ సాయంత్రం కర్నల్ గంజ్ (అలహాబాదు)

పోలీసుస్టేషన్‌లో వ్రాసినట్టుగా రిటైరైన పోలీసు అధికారి ఒకరు చెప్పారు.



పైన ఆఫీసర్ అభివర్ణించిన సంఘర్షణల అనంతరం చంద్రశేఖర్ ఆజాద్ తనను తానే పేల్చుకుని, ప్రాణత్యాగం చేసి, ఏవిధంగా తనప్రతిజ్ఞను నిలబెట్టుకున్నాడో మనకు తెలిసిందే.

ఆజాద్‌వంటి దేశభక్తులు, వీరాధివీరులు, ధీరోదాత్తులు ప్రపంచంలోనే చాలా అరుదు! అలాంటి క్రియాశీలురచరిత్రలే మనజాతి చరిత్రకు గర్వకారణం!!

చంద్రశేఖర "ఆజాద్"వంటి మహత్తర చరిత్రగల వీర కేసరుల జీవనసరళినుండి స్ఫూర్తిపొంది - వారాశించిన సమాజ స్థాపనకోసం త్రికరణశుద్ధితో కృషిచేయడం మనం వారికి అర్పించవలసిన స్మృత్యంజలి!!!

